శ్రీ

# ఘటికాచల మాహాత్మ్యము

తెనాలి రామకృష్ణకవి కృతము

సంపాదకుడు

డా॥ కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి

తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు-4.

# ఉపోద్ఘాతము

## I

### 1. రామకృష్ణుని స్వవిషయము :

తెనాలి రామకృష్ణుడు తనను గూర్చియు తన కుటుంబమును గూర్చియు కొంత సమాచారమును తన కృతుల యవతారికలలో తెలిపి యున్నాడు. మొట్టమొదటికృతియైన ఉద్భటారాధ్యచరిత్రమునను(1-24). రెండవదియైన పాండురంగమాహాత్మ్యమునందును (1-17, 22, 23, 24) ఆసమాచారవివరము లున్నవి. వాటినిబట్టి మనకుతెలియవచ్చు విశేషము లివ్వి :

ఉద్భటారాధ్యచరిత్రను వ్రాసినప్పటి రామకృష్ణునిపేరు రామలింగము. కౌండిన్యసగోత్రమువాడు. పాలగుమ్మిపతేశ్వరపదపయోజధ్యాయాధ్యానధారణ సముదాత్తచిత్తుడు. యజుర్వేదవేది. రామేశ్వరస్వామి రమణీయకరుణావిశేష పోషిత విలసిత సమగ్ర సహజసాహిత్యమాధురీ సంయుతాత్ముడు. లక్కమాంబకును రామధీమణికిని పుత్రుడు. పాండురంగమాహాత్మ్యమునను ఈ చెప్పబడిన వివరములే చెప్పబడియున్నవి. తల్లి పేరు మాత్రము లక్ష్మమ అని ప్రకృతిరూపముననున్నది. మరియు శ్రీగురుమూర్తి పేరు భట్టరుచిక్కాచార్యు లనియున్నది. ఉద్భటారాధ్యచరిత్ర గద్యమున గల ''కుమారభారతి'' బిరుదము పాండురంగమహాత్మ్యమున "శారదరూపము''గా మార్పుచెందియున్నది

### 2. అతని దేశకాలములు :

రామకృష్ణునకు గుంటూరుజిల్లాలోని తెనాలితో సంబంధమున్నది. అది ఆయనకు ఇంటిపేరుకూడ అయినది. మరియు తననుగురించి తెనాలి అగ్రహార నిర్ణేత యని చెప్పుకొనెను.[1] ఈయన్నింటినిబట్టి రామకృష్ణుడు తెనాలివాడనియే అనుకొనవలయును. రామకృష్ణునితండ్రి తెనాలిలోని రామలింగేశ్వరస్వామిభక్తుడై ఉత్సవ విగ్రహమును చేయించియుండుటను బట్టియు వారిది తెనాలి యనియే చెప్పవలయును అంతకుపూర్వము వారు గార్లపాడులోనున్నను[2] మరెచ్చటనున్నను రామకృష్ణుడుమాత్రము తెనాలివాడు.

---

1. పాండురంగమాహాత్మ్యము 1-23.
2. ఆంధ్రకవితరంగిణి సంపుటము 8. పుట 31.

రామకృష్ణుడు జీవించియున్న కాలము నొక్కవిధముగా సాహిత్య చరిత్రకారు లంగీకరించుటలేదు అందువలన శ్రీకృష్ణదేవరాయలవారి యాస్థానమున కవులలో నీతడొకడై యుండుటయు వివాదాస్పదమైనది. శ్రీ చాగంటి శేషయ్యగారి నిర్ణయము ప్రకారము[1] రామకృష్ణుని జనన కాలము క్రీ.శ 1495-1500 సంవత్సరముల నడుమ. ఉద్భటారాధ్యచరిత్ర రచన క్రీ.శ 1525 - 1530 సంవత్సరములనడుమ, పాండురంగమాహాత్మ్యము 1550 ప్రాంత రచన. ఘటికాచలమాహాత్మ్య రచన 1560ప్రాంతము. 1565-1570 సంవత్సరముల మధ్య ఆయన పరమపదించి యుండవలయును. మరియు రామకృష్ణుడు శ్రీకృష్ణదేవరాయల యాస్థానములోని అష్టదిగ్గజకవులలో నొకడు.[2] డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారి పరిశోధనము ననుసరించి[3] ఉద్భటారాధ్యచరిత్ర రచనము 1520ప్రాంతము. పాండురంగమాహాత్మ్యము కృష్ణరాయలవారి రాజ్యకాలము తుదనో తరువాత అచిరకాలముననో విరచితమై యుండవలయును.[4] అనగా 1525-1540 సంవత్సరముల ప్రాంతము.[5]

శ్రీ వీరేశలింగము పంతులుగారి వద్దనుండి కవిచరిత్ర కారులును, వాఙ్మయ చరిత్రకారులును, పరిశోధక పండితులును ఎక్కువమంది కొద్దిపాటి కుడియెడమల మీద ఈ పైన చూపబడిన కాలనిర్ణయమే నిర్ణయముగా భావించుచున్నారు.* రామకృష్ణుడు పదునారవ శతాబ్దము కవి శ్రీకృష్ణదేవరాయలవారి యాస్థానము నందలి యష్టదిగ్గజములలో నొకడు అయినచో వయస్సుచేత కొంత చిన్నవాడై యుండవచ్చును.

---

1. ఆంధ్ర కవితరంగిణి సం. 8 పుటలు 8-10-25.
2. ఆంధ్రకవితరంగిణి సం. 7. పుట 144.
3. వాఙ్మయ వ్యాసమంజరి పుట 115.
4. వాఙ్మయ వ్యాసమంజరి పుట 123.
5. వాఙ్మయ వ్యాసమంజరి పుట 149.

* ఈ విషయమున ఎవ రెవ రేమి చెప్పినదియు, ఆ చెప్పబడినదాని సత్యాసత్య వివరణమును, సిద్ధాంతవిషయప్రతిపాదనమును శ్రీ నేలటూరివేంకటరమణయ్యగారి వ్యాసములయందు సుష్ఠుగానున్నది. చూ. వాఙ్మయ వ్యాసమంజరి, పుటలు 94-156.

## 3. రామలింగ రామకృష్ణ లభిన్నులు :

ఉద్భటారాధ్య చరిత్రము వ్రాసిన రామలింగమును, పాండురంగ మాహాత్మ్యమును వ్రాసిన రామకృష్ణుడును పేర్లను బట్టియు, గురువులను బట్టియు, బిరుదములను బట్టియు, గ్రంథ తాత్పర్యములను బట్టియు భిన్ను లని యొక వాదమున్నది. తల్లిదండ్రులను బట్టియు, కులగోత్రములను బట్టియు, మరియు తెనాలి వంశమువారైన కవుల సాక్ష్యములనుబట్టియు వారిరువురును ఒకరే యగుదు రని దానికి ప్రతివాద మున్నది. మరియు నీ ప్రతివాదమున రామకృష్ణుడు మొదట శైవుడై రామలింగమనుపేర ఉద్భటారాధ్యచరిత్రమును రచించి, ఆ పిమ్మట వైష్ణవుడై రామకృష్ణ డను పేరు పెట్టుకొని పాండురంగమాహాత్మ్య ఘటికాచలమాహాత్మ్యము లను రచించెననియు, అందువలననే గురువులపేర్లలో భేదము కనిపించు చున్నదనియు, చిన్నతనమున కుమారభారతి యైనవాడు పెరిగి పెద్దవాడు కాగా శారదాకృతి యైనాడనియు- అందువలన రామలింగ రామకృష్ణు లొక్కరే యనియు సిద్ధాంతము రూపొందింపబడినది.

తెనాలి రామలింగ మని మరియొక తెనుగుకవి "ధీరజనమనో (విరాజిత) రంజనము" అను కృతిని రచించినవాడు గలడు. ఆయన విశ్వబ్రాహ్మణుడు. తెనాలి రామకృష్ణునకు గల రామలింగ మను పేరునకును, ఆ విశ్వబ్రాహ్మణకవి పేరునకును ఆ పేరుకు మించి మరెట్టి సంబంధమును లేదు.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారును[1], చాగంటి శేషయ్య గారును[2] మొదలయిన పండిత పరిశోధకు లింతకుమును పే రామలింగ రామకృష్ణుల ఏకత్వమును నిర్ణయించిపెట్టి పోయినారు. ఇప్పు డావిషయమున క్రొత్తగా చెప్పదగిన దేమియు కానరాదు.

## 4. రామకృష్ణుని కృతులు - ముందువెనుకలు :

రామకృష్ణుని కృతులు మూడు లభించుచున్నవి. మొదట శైవుడుగా నున్నపుడు ఉద్భటారాధ్య చరిత్రమును రచించినాడనుటలో తగాదాలేదు. వైష్ణవుడై రచించిన పాండురంగమాహాత్మ్య, ఘటికాచలమాహాత్మ్యము లలో ఏది ముందై యుండునన్నప్పుడే అభిప్రాయభేదములు పుట్టుట మొద

1. ఉద్భటారాధ్యచరిత్ర పీఠిక.
2. ఆంధ్రకవితరంగిణి సంపుటము 8, పుట 6.

లయినది ఈ మూడుకృతుల లోను ఘటికాచలమాహాత్మ్యమున కొక విశిష్టత యున్నది. అది ఆ గ్రంథముజాతకము నుబట్టి వచ్చినది మిగిలిన రెండు గ్రంథములను రామ(లింగ) కృష్ణుడే స్వయముగా దేచమంత్రికిని[1] వేదాద్రి మంత్రికిని[2] అంకితము చేసినాడు. ఈ ఘటికాచలమాహాత్మ్యము నెవరికిని ఆయనఖయ్యలేదు. కొందరభిప్రాయపడుచున్నట్లు పాండురంగమాహాత్మ్యమునురామకృష్ణుడుతనచరమదశలో రచించినచో[3] తానంతకుమునుపురచించిన ఘటికాచలమాహాత్మ్యము నట్లేయుంచి క్రొత్తగా పాండురంగమాహాత్మ్యమును వ్రాసి వేదాద్రి కంకితము చేసినా డని చెప్పవలయును. అతనికే ఈవైష్ణవగ్రంథ మేల ఇచ్చియుండలేదు? ఆయనకాకపోయినఆమాత్రము కృతిపుచ్చుకొనువాడే నాడు రామకృష్ణునకు లభింపలేదా? దానినిన రాంకితము చేయుటకు రామకృష్ణున కిష్టము లేదా అన్నచో రెండుగ్రంథములను నరాంకితములు చేయనేచేసెనుగదా! అట్లుగాక ఘటికాచల మాహాత్మ్యము రామకృష్ణుని తొలి కృతి అగియు దానియందాయ కే అంత ఆదరము లేక మూల పారవేసినాడన్నచో అదియు నంతగా పొసగదు. అట్లగుచో రామకృష్ణుడు మొదట వైష్ణవుడుగా ఉండి ఘటికాచలమాహాత్మ్యము వ్రాసి, శైవుడై ఉద్భటారాధ్యచరిత్రమును వ్రాసి, తిరిగి వైష్ణవుడై పాండురంగమాహాత్మ్యమును రచించినా డని చెప్పవలసివచ్చును. ఇది వట్టి అసందర్భము. ఇక మిగిలినది - పాండురంగమాహాత్మ్యమును రచించి వేదాద్రి కంకితము గావించి, చరమదశలో ఘటికాచలమాహాత్మ్యమును రచించి దాని నెవరికిని కృతి యియ్యకుండగనే రామకృష్ణుడు పరమపదించియుండు ననుట దీనికిట్లు శంకను చూపవచ్చును. గ్రంథరచనాభ్యాసము పెరుగుకొలది ప్రతిభావ్యుత్పత్తులలో ప్రౌఢిమ, సాంద్రతగోచరింపవలయునుగదా? అన్నివిధములను ఉద్భటారాధ్య చరిత్రమున కంటె పాండురంగమాహాత్మ్యము పైచేయిగానున్నది - అట్లే ఘటికాచలమాహాత్మ్యము పాండురంగమాహాత్మ్యమును మించి యుండవలయును కాని లేదు. మరి దాని సంగతియేమి యని - నిజమే. ఘటికాచలమాహాత్మ్యము పాండురంగమాహాత్మ్యమునకు తీసికట్టే. వయసుముదిరి రెంటవబాల్యము పైకొన్నప్పుడు ప్రతిభావ్యుత్పత్తులు రెండును మందగించును ఆ మందగించిన

1. ఉద్భటారాధ్య చరిత్రము.

2 పాండురంగ మాహాత్మ్యము

3 పాండురంగ మాహాత్మ్యము శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి పీఠిక. పుట 13.

కాలమున తిరుగుటకలవాటుపడినకాలు కుదుటబడి యొకచో నిలువనట్లు ఏదో వ్రాయుట కలవాటువడిన బుద్ధి అపనిచేయకుండ నుండలేక చేయును. అట్లు చేయుటవలన నైనకావ్యమును భరించుట అంత సుఖమైనపనికాదు. రామకృష్ణుడాస్థితిలో ఘటికాచలమహాత్మ్యమును వ్రాసివదలి పరమపదించినాడు. ఇంకొక వాదమునుగూడ చూపవచ్చును, రామకృష్ణుడు ఈ ఘటికాచలమాహాత్మ్యమును రచించి ఏదైవమునకో అంకితముగావించినాడు. ఆయన చనిపోయినతరువాత ఆయన మనుమడు ఆకృత్యాదిని తొలగించి ఖండోజీకి అమ్ముకొనియుండవచ్చును[1] – అని. కావచ్చును. అట్లమ్ముకొనువాడు వీలున్నచో మిగిలినవాని నెందుకు విక్రయించినాడు కాదు? అందువలన అదిపొసగదు. పాండురంగమాహాత్మ్యమున కిది తరువాతి దని యూహించినపు డిది రామకృష్ణుని కృతులలో చివరిదియే యగును[2]. ఘటికాచలమాహాత్మ్యమే రామకృష్ణుని కృతులలో కడపటిది [3]

మరొక్కవిషయముగూడ నిచట చెప్పవలసియున్నది. రామకృష్ణుడు పాండురంగ మహాత్మ్యము కాక పాండురంగవిజయ మను మరొకగ్రంథమును రచించినట్లును అనుకొనుటకలదు. తమ చిన్నతనమున తమ తాతగారు పాండురంగవిజయములోనివని చెప్పుచు చాలపద్యములు చదివి వినిపించెడివారనియు, ఆ వినుకలి వలనతమకు వచ్చిన పద్యములలో ప్రస్తుత మొకటిమాత్రమే అసంపూర్ణముగా జ్ఞాపకమువచ్చుచున్నదనియు పూజ్యులు శ్రీ బి. రామరాజు గారు చెప్పుచున్నారు. ఆ పద్య మిది –

"మారామాజనకాంబుజాంబుజజరామారామ భూభృద్వరా
మారామార్త్య సరిత్కగిద్గణ విరామారామపోత్రిత్రియా
........................................................
మారామాభయశస్కపిత్థలపురీశామ్మాలోక రక్షామణీ!"

శ్రీ చాగంటి శేషయ్యగారు పాండురంగమాహాత్మ్యమునే పాండురంగ విజయ మందురనియు, కొందఱీ రెండుగ్రంథములును వేఱనిచెప్పు వాదము

---

1. ఆంధ్ర కవి తరంగిణి, సం. 8. పుట. 11.
2. పాండురంగమాహాత్మ్యము. శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి ఉపోద్ఘాతము. పుట 23.
3. వాఙ్మయ వ్యాసమంజరి. పుట 116.

విశ్వాసార్హము కాదనియు చెప్పుచున్నారు [1] "దశావతారపద్యములు - సటీకములు" అను పేర నొక కాగితపుఁ వ్రాతప్రతి మద్రాసులోని ప్రభుత్వ ప్రాచ్యపుస్తక భాండాగారమున కలదు.[2] ఆకాగితపు ప్రతికి మూలమైన తాళపత్రప్రతి విశాఖపట్నముజిల్లా పీరవల్లి తాలూకా పాతనపూడిఅగ్రహార వాస్తవ్యులయిన కోటి రామమూర్తి శాస్త్రులుగారిది. ఆ పద్యములకు టీక వ్రాసిన పండితుడు చివర తన "గద్య" వ్రాసికొనినాడు.

"ఇతి శ్రీవత్సగోత్రపవిత్ర శ్రీమదాపస్తంబసూత్ర శ్రీమద్రఘునాథ భట్టరాచార్యకృపాపాత్ర శ్రీమత్కోదండ రామాచార్యవర్యపుత్ర దుర్వాది గర్వలతాలవిత్ర శ్రీమద్భాష్యాదిగ్రంథప్రబంధాధ్యయనాధ్యాపనవిచిత కృష్ణమాచార్యగోత్రవిరచితాఖండపండితమండలదుర్విజ్ఞేయతాత్పర్యపర్యా యపిచండిల పాండురంగవిజయప్రబంధమధ్యనిధేయ హృద్యతమదశావ తారపద్యమాలికా టీకానిగూఢార్థ చంద్రికా శరద్రాకాసమాప్తా"-ఈ గద్య పాండురంగవిజయప్రబంధ మున్నదనుటకు సాక్ష్యమేగాని అది తెనాలి రామకృష్ణుడు రచించినదే అనుటకుకాదు. క్యాటలాగులో దానినిగూర్చి ఆంధ్రాంగ్లములలో వ్రాయువారుమాత్రము "తెనాలి రామలింగకవికృత పాండురంగవిజయ మందలి దశావతార పద్యములు" "These stanzas form part of the Pandurangavijaya composed by Tenali Ramalingakavi" అని స్పష్టముగా వ్రాసిరి.[3] ఈ వ్రాతలో నింకొక విశేషము కనిపించుచున్నది. రామకృష్ణుడు రామలింగడుగా నున్నప్పుడే పాండురంగవిజయమును రచించినాడా? తెలుగులోపాండురంగవిజయము ఆంగ్లములోపాండురాంగవిజయమనబడినదేమి? ఈపాండురాంగ-పాండురంగ విషయము తరువాత రామకృష్ణుని వైష్ణవమునుగూర్చి వ్రాయుచోట మరి కొంత వ్రాయబడును. - ఈ దశావతారపద్యములు పాండురంగమాహా త్మ్యమున లేవు గనుక, టీక వ్రాసినయతడు ఈ పద్యములు పాండురంగ విజయమధ్యముననున్న వనుచున్నాడుగనుక, పాండురంగమాహాత్మ్యమునే పాండురంగవిజయమనుట కుదురదు-అవి రెండు వేఱు వేఱు గ్రంథములగు

1. ఆంధ్రకవితరంగిణి. సంపుటము 8. పుట 12, మరియు వీరేశలింగముగారిఆంధ్ర కవుల చరిత్రము. రెండవ భాగము. పుట 175.

2. A Triennial Catalogue of Manuscripts Volume III Part III. Telugu. R. No. 542.

3. ఈ పద్యములు ఎలకూచి బాలసరస్వతి మహోపాధ్యాయుడు రచించినవని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్యమణిమంజరిలో వ్రాసినారు. పుట. 13.

టయే నిజము. పాండురంగ విజయకర్తృత్వము తెనాలిరామ (లింగ) కృష్ణునిదని ప్రాచీనులసాక్ష్యముండుట చేతను, అందలి పద్యములు నోటికి వచ్చినవారు పాతికముప్పది సంవత్సరముల క్రితము వరకు ఈ తెలంగాణ మున నున్నట్లు చూచియెరిగిన సాహిత్యోపాసకులు వచించుటచేతను, ఇంకను దేశము నలుమూలలనుగల తాళపత్రగ్రంథముల సేకరణము జరుగలేదు గనుకను, తెనాలి రామకృష్ణుకు పాండురంగవిజయ ప్రబంధమును రచించి యుండుననుట కేవల మనృతము గాజాలదనియు, ముఖ్యముగా తెలంగాణము నందలి తాళపత్రగ్రంథ సేకరణము సంపూర్ణముగా జరిగినప్పు డది లభింపవచ్చు ననియు విశ్వాసముతోనుండుటయే మంచిది. అంతవరకు పాండురంగవిజయప్రబంధములోనివి రెండుపద్యములు మనకున్నవనియే తృప్తిచెందవలయును. అసంపూర్ణముగా నున్నపద్య మింతకుముందుదాహరింపబడినది. రెండవది సంపూర్ణముగానున్నది. ఈక్రిందనీయబడుచున్నది.[1]

సీ. ప్రౌఢ దీర్ఘ సమాసపదములగూర్చి శ్రీ
    నాథుండు కూలార్చె నైషధంబు
దానితల్లిగ నల్లసాని పెద్దన చెప్పె
    ముదిమదిదప్పి యాముక్తమాల్య
దూహించి తెలియరాకుండ సూరపరాజు
    భ్రమఁ గళాపూర్ణోదయము రచించె
నతిశ్లేష శబ్దవాగాడంబరంబొప్పఁ
    బస ఘటించెను మూర్తి వసుచరిత్ర
నిట్టికవులకు నేను వాకట్టుకొఱకు
చెప్పినాఁడ మదీయ వైచిత్రి మెఱయ
పాండురంగవిజయమును పటిమదనర
విష్ణువర్ధిష్ణుఁ డగు రామకృష్ణకవిని.

పాండురంగవిజయము లోనిదని మనము దీనిని గ్రహించుచున్నాము గాని దీని వలన చాల చిక్కులున్నవి. అందువల్లనే బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు "రామకృష్ణకవి తన పాండురంగవిజయప్రబంధములోని కవిత్వ పటుత్వమును గూర్చి చెప్పికొనినపద్యము" అని చెప్పుచునే "ఈ పద్యము

1. చాటుపద్యరత్నాకరము. పుట. 47.

శైలినిబట్టియు తెనాలి రామకృష్ణకవికి తరువాతివాడగు సూరనను పేర్కొనుటంబట్టియు నంత విశ్వసనీయముగ తోపదు" అని జ్ఞాపిక వ్రాసిపెట్టిరి. కాని ఈపద్యమునందలి 'దానితల్లిగ' అన్నప్రయోగము రామకృష్ణునిదే కావలయుననిపించుచున్నది. ఈ అర్థముననే ఘటికాచలమాహాత్మ్యమున "నిండుజాబిల్లి తల్లియైనిగ్గుదేరు మోము" (2-134) అని ప్రయోగించి యున్నాడు. పాండురంగమాహాత్మ్యమునను "శైవాలవల్లికిం దల్లియై చెలువారు నూగారును" (3-179) అని ప్రయోగించినాడు. పుస్తకము లభింపలేదుగనుక చిక్కులున్న వనుకొనుచున్నాము. అది బయటపడినప్పుడు చిక్కులెట్లో సవరింపబడును మిగిలినకృతులతోపాటు ఈ పాండురంగ విజయప్రబంధ రచనాకాలమును నిర్ణయింపబడును. అందుకు కాలము కలిసిరావలయును.

మరికొన్నికృతులు రామకృష్ణుడు రచించినట్లుగా వినుకలియేగాని కనుకలి లేదు, అవి యివ్వి: (1) లింగపురాణము, (2) ఆదిపురాణము, (3) కందర్ప కేతువిలాసము (4) హరలీలావిలాసము. ఈ చివరి రెండు గ్రంథములలోని వని కొన్ని పద్యములను రామప్రెగడ జగ్గన తాను సమకూర్చిన యుదాహరణగ్రంథములో ఉటంకించినాడు.[1]

ఉద్భటారాధ్యచరిత్రము, పాండురంగమాహాత్మ్యము, ఘటికాచలమాహాత్మ్యము మాత్రమే క్రమముగా రామకృష్ణుని ప్రస్తుత మున్న కృతులు.

## 5. రామకృష్ణుడు హాస్యగాడు కాదు :

తాను రచించినగ్రంథాలనుబట్టి అయినదానికంటె, తనకు సంబంధించిన సంబంధింపజేయబడిన, హాస్యప్రసంగకథావిశేషములచేత రామకృష్ణు డెక్కువగా నీదేశమున ప్రసిద్ధుడు, హాస్యచతురుడుగా నయిదు వందలసంవత్సరాలనుండి ఆంధ్రప్రదేశ ప్రజానీకమునకు సన్నిహితుడై ప్రవర్తించుచున్న రామకృష్ణుడు తానురచించిన గ్రంథములలో నెక్కడ కూడ ఆ వాసనకలవాడుగానే కనిపించడు. నిత్యజీవితమున అలవోకతనమున కలవాటుపడిన ఈయన, కావ్యజీవితములో జాగృతుడు. మరియు గంభీరుడు. ఇందు కవవాదముగా, కవిస్వభావము కావ్యమున ప్రతిబింబించు ననుసిద్ధాంతమున కనుకూలముగా కొందరు వాని కృతులనుండి ఒకటి రెండుపద్యములను, సన్నివేశములనుండి ఎత్తి చూపుదురు. అవి హాస్యా

1. ఆంధ్ర కవితరంగిణి సంపుటము 8. పుటలు. 27, 28.

స్పదము:లుకానివక్యములు. అయినచో అనుచితములయినవి. అనుచితములు హాస్యములుకావు. పరిహాసదృష్టి కవికున్నదని మనమనుకొనుటకాదు ప్రధానము. ఆగ్రంథమున అసన్ని వేశమున ఆవర్ణ్యవస్తువుయొక్క అంతర్యము తదభిముఖమైయున్నప్పుడు-ఆవక్తచిత్తవృత్తితద్రూప పరిణామశీలమయినప్పుడు-అచటి వాచకముల కాభావమునందింపగలశక్తియున్నపుడుగాని ఇచట ఇది హాస్యము అని చెప్పవలనుపడదు. అందేయొకటిలోపించినను ఆమాటచెప్పరాదు పరిహాసదృష్టిలేనివాడెవడు? చమత్కారమంతయునది ప్రకటింపబడుటలో నున్నది. రామకృష్ణుని గ్రంథములుపరిహాసదృష్టిని సహింపనివి. ఆసంగతి రామకృష్ణునకు తెలియునుగనుకనే ఆప్రయత్నము చేయలేదు. అతడుచేయని ప్రయత్నమును, అతనికిని తెలియకుండగనే చేయబడినదని నిలువదీయవలసినంత అక్కర మనకుమాత్రమేమి? చతురోక్తిమయమైనకవిత్వమున విపరీతముగా హాస్యమునాశింపనేల ? అన్ని రసభావములును అన్నికావ్యములయందును లభింపవలెననుకొనుట మంచిదికాదు. ఏది యదభిముఖముగానున్నదోదానిని తదభిముఖముగానే చూడవలయును. మనప్రాచీనసాహిత్యముతాత్పర్యమునకును, ఇప్పుడు మనమనుకొను హాస్యమునకును చుక్కయెదురు. అట్టిచో నచటహాస్యమున కఱ్ఱులు సాచుటయెట్లు? క్వాచిత్కముగా కన్పించినచో అది వేరువిషయము.

## 6. వికటత్వము హాస్యముకాదు :

రామకృష్ణునకు వికటకవి అని బిరుదమువంటిపేరుకూడ ఒకటికలదు. ఆయన హాస్యస్వభావమే ఆయన కాపేరువచ్చుటకు హేతువని అందరును అనుకొనుచున్నారు. కాని అదికాదు వికటత్వము హాస్యముకాదు [1] అదియౌదార్యమునకుపర్యాయపదము. ఉదారముయొక్కభావ మౌదార్యము కావ్యగుణములలో నదియొకటి. కావ్యమున ఉదారతయనగా - కావ్యము శృంగారాద్భుతయోజితమై, అనేకభావబంధురమై, దివ్యభావపరీతమైయుండుట[2]. తాదృశమైనదాని భావార్థమున కౌదార్యము వాచకము. ఏది

1. వికటమనగా వికృతము-సుందరము పరస్పరము వ్యతిరిక్తములగు రెండర్థములకాశబ్దము వాచకముగా మన్నది. మరియు వికటకవియనగాహాస్యకరుడని ఆంధ్రవాచస్పత్యమును, శబ్దరత్నాకరమునుబట్టి సూర్యరాయాంధ్ర నిఘంటువును అర్థముచెప్పుచున్నవి. ఇట్లు చెప్పుచో రామకృష్ణుడుమిట్టపండ్లవాడును కావచ్చును.

2. నాట్యశాస్త్రము. పుట. 458. డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావు.

యౌదార్యమో అనెడియే వికటత్వము. ఏతద్వికటత్వలక్షణలక్షితముగా కవిత్వము చెప్పుటయందు నేర్పరియైనవాడు వికటకవి. రామకృష్ణుడు వికటకవి.

ఇతని కృతులు మూడును దివ్యభావ బంధురములు ఉద్భటారాధ్య చరిత్రము శివదేవపారమ్యతాత్పర్యబుద్ధికలది. మిగిలిన రెండును విష్ణుపారమ్యరమ్యములు. దివ్యభావ మెప్పుడును ఆశ్చర్యకరమై అద్భుతావహము గనే యుండును. సకలకల్యాణగుణగరిష్ఠుడయిన పరమేశ్వరుడు పరమ శృంగార భావాకృతి ఈవిధముగా రామకృష్ణుడు రచించిన కావ్యములు ఉదారతాగుణ మహితములు అనగా వికటత్వలక్షణలక్షితములు ఈ వికటత్వమర్థగుణము ఇదియే శబ్దగుణముగా గూడ నున్నది. అది లీలాయమానత్వము అనగా నిబద్ధశబ్దములు అక్షరఘటనావిశేషముచేత విచిత్రచేతనములై శ్రవణేంద్రియ సంతర్పణద్వారా మనోమయకోశమునుదాటి ఆనందమయత్వమున జీవుని భజించుట యేదికలదో అది. ఇచట గుర్తుపెట్టుకొనవలసిన విషయ మొకటి యున్నది. ఈచెప్పబడిన శబ్దగుణము ప్రౌఢోక్తిమాత్రముచేతనైన ఓజస్సు అనగా రసానుసంధానవిరహితమైన ఓజోగుణాత్మకతకల రచన యనియర్థము రామకృష్ణుడు రచించిన గ్రంథములు మూడును మాహాత్మ్యములు కావ్యముల యందువలె మాహాత్మ్య గ్రంథములయందు రసభావనైరంతర్యముండుటకు వీలుకాదు. అందుకని తాదృగ్రచనావిధానముమీదనే కవి తనశక్తియుక్తులను కేంద్రీకరించి.అంది నంతవరకు సొమ్ముచేసికొనగల నేర్పుగలవాడుగా నుండవలయును ఆనేర్పరితనమునుండి ఒకవేగవంతమయిన ఔద్ధత్యశాలిశైలి రూపు గట్టకొనును. అశైలియే శ్రోతలనుగాని పాఠకులనుగాని విస్మయావిష్టులను చేయును. హృష్టరోములనుగాచేయును. అపుడు వారిచిత్తములకు విస్తారరూపమైన దీప్తికలుగును ఆదీప్తియే పరమేశ్వరభావమును సమాకర్షింపగలది. ఈ జాతి గ్రంథములతాత్పర్యమంతమాత్రమే. తానుగ్రహించిన కావ్యప్రక్రియా వైలక్షణ్యమును గుర్తెరిగి అందుకవసరమైన శబ్దార్థోభయశోభాత్మకమైన వికటత్వముమీద సాధనచేసి చేసినాడుగనుకనే మాహాత్మ్యగ్రంథములు వ్రాసిన రామకృష్ణుడు మహాకవిపదస్థుడైనాడు. అదే వికటత్వము.

ఇంతవరకు చెప్పబడినదానివలన రామకృష్ణుని కృతులు వ్యవస్థితము లయిన ఉభయ కావ్యముల కోటిలోనివి కావని తెలియుచున్నది ఇచట ఉభయ కావ్యములనగా వ్యంగ్యసంబంధి ప్రధాన గుణ భావముల చేత

నయిన కావ్యములు, తదన్యములు చిత్రములు. అవి రసభావాది తాత్పర్య రహితములు. కేవలవాచ్యవాచకమాత్రాశ్రయమున నుపని బద్ధమై ఆలేఖ్యప్రఖ్యమున భాసించును, అదేచిత్రము. శబ్దార్థభేదముచేత తచ్చిత్రము ద్వివిధము. రామకృష్ణు డంగీకరించిన వికటత్వమును శబ్దార్థ సంబంధముచేతద్వివిధము కాదా! అదేచిత్రము. అందువలన నేఇట్టి మాహాత్మ్య గ్రంథముల యందంగిరస విషయమై తాత్పర్యముతోడి వివక్ష ఉండదనుట.

మరి యీమాటనంగీకరించినచో రామకృష్ణునివంటి మహాకవికృతులు రసనిష్యందులు కావని చెప్పటయే యగునుకదా యన్నచో అగును. అట్లు కారాదన్నచో ఆయన కృతులయందు అద్భుతము రసమనిచెప్పవచ్చును. భక్తిని చెప్పరాదా? రాదు ఏమనగా నది వేఱి లేని వ్యవహారము కాదు. అదియునుగాక దాని పర్యవసానమును అద్భుతమునందేజరుగును అసలీలక్ష ణము మాహాత్మ్యప్రక్రియకే కలదు గనుక, ఆ రెండింటిని కలిపి "అద్భుత భక్తి" మాహాత్మ్యమున నంగిగా నుండదగినది అని చెప్పిన సరిపోవును. అన్య రసభావములచేత నదియే పరిపోషింపదగినది. అట్లుగా నీజాతి కావ్య చ్ఛవి నిలుప దగినది. రామకృష్ణునకీ రహస్యముకూడ తెలియును. అందు వలననే శబ్దార్థోభయాత్మకమైన వికటత్వమును చిత్రముగా సాధించుటను లక్ష్యముగా పెట్టుకొని పనిచేసినాడు. ఈ విషయమున రామకృష్ణు డెంత జాగ్రత్త కలవాడో పాండురంగమాహాత్మ్యము చివర చూచినచో తెలి యును. అయుత నియుతోపాఖ్యానమును ముగించి "అద్భుతరసైకపాత్రం బయ్యె నిట్లు" (5-317) అని సమాప్తము చేసినాడు. ఆమాట ఆ ఉపా ఖ్యానమునకుమాత్రమే సంబంధించినది కాదు. మొత్తము గ్రంథము నుప లక్షించునది, మరియు పుండరీకునకు ప్రత్యక్షమైన శ్రీ విష్ణుదేవుని గవి ఆ కృపా పరతంత్ర లక్షణమునకు భూతవ్రాతములు ప్రభూతాద్భుతరసమ సృణమానసంబులయినట్లు (4-111)ను, పుండరీకుడు భగవంతుని కోరిన కోరిక అద్భుతార్థమనియు (110) రామకృష్ణుడు చెప్పినాడు. మాహాత్మ్య గ్రంథ ప్రక్రియాతాత్పర్యము వివక్షయే యది. రామకృష్ణుని వికటత్వము తాదృశమైన తాత్పర్యమును వెలిగించినది కనుక వికటత్వము హాస్యము కాదు.

## 7. రామకృష్ణుని ఆత్మప్రత్యయము :

ఉద్భటారాధ్యచరిత్రమును రచించినప్పు డాయన కుమారభారతి అనివిషయమును గద్యలోఁ జేర్చి చెప్పుకొన్నాఁడు. మరియు సమగ్రసహజసాహిత్య మాధురీ సంయుతాత్ముఁడు. కావ్యనిర్ణయధురీణుడు (1-24) విలసదయాతయామ బహుళవేదవివేక పవిత్రభావ సంకలితములయిన వాక్యముల కావ్యము చెప్ప నేర్చినవాఁడు. ఆదికావ్యుల కవితానిగుంభనసమున్నతి గాంచినవాడు అభినవరఘునచోవిలాసుడు (1-26). ఈవిధముగానున్న తన కవివ్యక్తిత్వము నిఁకను పెంచుకొని రామకృష్ణుడు పాండురంగమాహాత్మ్యము రచించువాడు తనను తాను చూచుకొనఁగా నిట్లున్నాఁడు-(1) కవిజనసహకారావళీవసంతోత్సవ సూక్తినిధిగా (1-22) (2) సంస్కృతాంధ్రములయందు వ్యాసాబిగా (3) చతుర్విధకవితల నల్లుటయందు ఘనుడయ్యును అనువ్రనందించు మేటిగా (4) శైవ వైష్ణవ పురాణగాథార్థములతో పటిష్ఠరచ్యారచనాసమర్థుఁడుగా (5) సరసకవిగా (1-23), (6) బుద్ధిని బృహస్పతిగా (7) అఖిలకావ్యరససుధామండనకుండలుడుగా (1-24) (8) మృదువిశదోక్తులవాడుగా (1-25) (9) నవ్యకవిత్వకళాకలాపకుశలుడుగా (1-21), (10) మహాంధ్ర కవితావిద్యాబలప్రౌఢిని మించినవాడుగా (11) సరసార్థబోధఘటనాహేలాపరిష్కార శారదాకృతిగా (1-27) వెలిగిపోవుచున్నాఁడు. మొదటినుండియు తనదైన ఆంధ్రమగు భాషాపద్ధతి సజ్జనతావర్ణితరీతి (ఉ 1-30)యైయున్నది భాగవతచరిత్రములను చెప్పుకావ్యములే సత్కావ్యములు (ఉ 1-30,పాం. 1-18) తాను సత్కావ్యరచనయే చేసినాడు. మరియు కవిత్వతత్త్వ(పాం 1-13) మును విచారించి చేసినాడు.

## 8. అతడు చేసిన కవిత్వతత్త్వ విచారము :

కవిత్వతత్త్వ మెప్పుడును రసమయమే.[1] కవియైనవాడు మంచి రసజ్ఞుడై యుండవలయును. మరియు నాదిమగ్రంథము లుగ్గడించి వ్యాకరణశాస్త్రమున మంచిదిట్ట కావలయును. కవివాక్కు లోతైన అర్థము గలిగి గంభీరముగా నుండదగును.[2] వాల్మీకి పుట్ట తేనియచవితోఁ పుట్టినాడు. వాని వాక్కునకాచని యున్నది గనుకనే అది సత్కవిత్వమైనది.[3] మహాకవిత్వమునకు సూక్తివైభవ మొక అత్యవసరమైన గుణము. కావ్యపాఠకు డెప్పుడును పరసమానసుడుగా నుండవలెను. మనస్సునకు రసరూపమున

1. పాండు 1-13  2. ఉద్భ. 1-12  3. పాండు 1-10

పరిణమించి వృత్తి యున్ననే కావ్యము అస్వాద్యమగును కనుక కావ్య పాఠకు డట్టివాడు గావలెను.[1] రసవంతముగా కవిత్వమల్లు ప్రయత్నమున కొన్నిదోషములుచేయుట అనివార్యమే కాగలదు దోషమునుండియే గుణముపుట్టును.[2] సహనము వహించి పసిగట్టవలసిన గుణమది. మరియు లోకమున దోషభూయిష్టమైన కవులకవిత్వమును నుండనే వలయును. దాని వలన కవిరాజుకావ్యమహిమ గరిమవహించుట కవకాశ మేర్పడును.[3]

కవిత్వతత్త్వమునగల గరిమ ముదంచితమైనది. కవికిదాని పరిశీలనా జ్ఞాన మెంతయేని యవసరము [4]. కావ్యనిర్మాణ మొక కళాకలాపము[5]. కవియెప్పుడును అభినవప్రబంధనిర్మాణ కౌతూహలచిత్తుడై యుండవల యును.[6] అభినవత్వము వస్తువరణమునుండియు రచనావిధానమునుండియు సంపాదింపబడవలయును రచన అతిస్నిగ్ధవర్ణముగ్ధాకృతియు, చతురపద విన్యాసధన్యాసికయునై [7] యుండవలయును.

ఇది స్థూలముగా రామకృష్ణుడుచేసిన కవిత్వతత్త్వవిచారణ దీని మీద సూక్ష్మసూక్ష్మముగా విచారించుచు పోయినచో రామకృష్ణుని కావ్య సిద్ధాంతనిర్ణయ రూపమైన విమర్శబుద్ధి వైశిత్యము బోధపడగలదు. అది ఇంకొకపని.

## II

### 9. ఘటికాచలక్షేత్రవైభవవివేకము :

(1) శ్రీ మహావిష్ణువుయొక్క దశావతారములలో నాల్గవది శ్రీనర సింహావతారము. హిరణ్యకశిపునిసంహరించుటయే ప్రయోజనముగానెత్తిన యవతారమగుటచేత సహజముగా నాకృతి భయంకరముగా నుండును. ఉన్నను ధ్యానపరులు, ఉపాసకులుగ్రహించు ఇష్టదైవతములలో నరసింహు డొకడు. ఈ నరసింహవిగ్రహముకూడ మిగిలిన యవతార విగ్రహముల వలెనే బహువిధములుగా నుండును. నిలువబడినట్లు, కూర్చున్నట్లుగా మాత్రమేయుండును. పండుకొనినట్లుండదు. యోగనరసింహుడగుచో

1. పాండు 1-12 2. పాండు 1-14 3. పాండు 1-15
4. పాండు 1-16 5. పాండు 1-17 6. పాండు 1-19
7. పాండు 5-192

సుఖాసనమునగాని, యోగాసనమునగాని, కూర్చున్నట్లుండును.[1] లక్ష్మీ నరసింహుడుగా నుండుటయు నొకవిధము అప్పు డమ్మవా రెడమ తొడ మీద నుండును. ఉగ్రనరసింహాకృతి మరొకపద్ధతి. నాలుగునుండి పదునారు వరకు చేతులుకలిగి ఆలీఢపాదుడు, వివృతాస్యుడునై దైత్యుని తొడల మీద వేసికొని చీల్చుచున్నట్లుండును. గరుడునిగాని ఆదిశేషునిగాని అధిష్ఠించినట్లును నరసింహుడుండును

నరసింహక్షేత్రములు చాలయున్నవి అహోబలమున శ్రీనరసింహ దేవుని నవరూపములును వెలసియున్నవి సింహాచలమున వేంచేసియున్నది వరాహ నరసింహస్వామి. మంగళగిరిని పానకాలనరసింహుడు. వేదాద్రిని లక్ష్మీనరసింహస్వామి ఇట్లే మహాప్రసిద్ధమైన యోగనరసింహస్వామి దివ్య క్షేత్రము ఘటికాచలము

(2) ఘటికాచలమునకు నరసింహస్వామి వేంచేయుటనుగూర్చి ఒక రెండు మూడు కథలు వినబడుచున్నవి. (i) శ్రీమహావిష్ణువు హిరణ్యకశిపుని సంహరించి ఆ యవతారరూపముతోనే క్షీరసముద్రమునకు పోయి యోగనిద్రలోనుండెను. ప్రహ్లాదుడు స్వామినిజేరి దేవా మీరీయోగరూపమును విడనాడకయే ఘటికాచలమునకు వేంచేసి పవిత్రము చేయవలయును - అని - ప్రార్థించగా ఆయన ఘటికాచలమును చేరినాడు[2] (ii) దేవేంద్రునికొరకు ఇంద్రద్యుమ్నుడనురాజు రాక్షససంహారమునకు పూనుకొనెను. ఇంద్రుడు తనసైన్యమునంతయు నారాజునకు సహాయముగా నిచ్చెను. మరియు నృసింహుని ప్రార్థించి హనుమంతుని గూడ వానికి తోడుపడపంపెను. ఇంద్రద్యుమ్నుడు కుంభనికుంభాదులను ఘటికాచలముననే సంహరించెను అంతవరకు కుంభునిబారిని పడియున్న ఆ పురము వాని మరణతో విముక్తమైనది నరసింహుడు ప్రీతుడై వెలసెను హనుమంతుడు చేసిన సహాయమున కాపురమునకు హనుమత్పురమనియు పేరు వచ్చెను.[3] (iii)హింసనచణుడైన నరసింహుడు సాత్వికుడును అహింసాపరుడును అను

1. A Hand Book of South Indian Images P. 47, 48.
—By Sri T. N. Srinivasan.

2. శ్రీ సన్నిధి పంచాంగం దేవరాజ పెరుమాళ్లయ్యవారి విశ్వగుణాదర్శము. పుట 254 మరియు మునులకు ప్రత్యక్షమైన నరసింహుడు ప్రహ్లాదుని కథను స్మరించుట (3-13) గమనింపదగినది.

3. ఇది సంస్కృత ఘటికాచల మహాత్మ్యకథమ పోలియున్నది.

అర్థమును చెప్పునది మూడవది. రెండవకథయొక్క రూపాంతరమిది ఉత్తరమధురానగర పాలకుడు ఇంద్రద్యుమ్నుడు లేళ్లను వేటాడుచు వేటాడుచు ఘటికాచలప్రాంతారణ్యమునకు వచ్చెను ఒకదానిని గురిచూచి బాణము విడువబోవుచుండగా వాని కొక పెద్ద జ్యోతి కన్పించినది. అపుడారాజుకు తాను చేయుచున్నది జీవహింస యనియు, అది పాపకార్యమనియు స్ఫురించినది అత డానాటినుండి జీవహింస మానివేసెను ఆఘటికాచల ప్రాంతముననుండువాడు కుంభోదరు డనువాడు, పరమక్రూరుడు, రాక్షసుడు. క్రమముగా బుద్ధిమారి సత్వసంపన్ను డయ్యెను. దానితో తత్ప్రాంతముప్రజలు సుఖవంతులైరి. ఇట్లాయిరువురను హింసామార్గము నుండి తప్పించి వారిని, ఆ క్షేత్రమును మంచిగా చేసిచూపినది ఆంజనేయుడు ఆయన శ్రీ నరసింహదేవుని ఆజ్ఞచొప్పునఅట్లుచేసినాడు. ఆజంనేయుడు చేసినదానికి శ్రీనరసింహుడు సంతోషించి తనతోపాటు తనసమీపమున నుండుట కాతని నాహ్వానించి వానికి చతుర్భుజములను శంఖచక్రములను బహూకరించి ఆదరించెను [1]

శ్రీమహావిష్ణువునకు ప్రీతికరములయిన మూడు స్థలములలో రెండవది ఘటికాద్రి. (3-24) మొదటిది నారాయణగిరి. మూడవది వృషభాద్రి.

(3) ఘటికాచలక్షేత్రము నేటి ఉత్తరఆర్కాడుజిల్లా, వాలాజా తాలూకాలోని చోళలింగపురము (షోళింగపురము, షోళింగర్ Sholinghur)అనుస్థలము చోళసింహపురమని ఇటీవలయ వ్వటివైష్ణవులందురుగాని యది యప్రసిద్ధ నామకరము[2]. ఈషోళింగర్ ఎస్. ఐ. రైల్వే. అరకోణం స్టేషనుకు పశ్చిమర 18 మైళ్ళదూరమున నున్నది ఇది చిత్తూరికి తూర్పున 25 మైళ్ల దూరముననున్నది. ఈషోళింగరుకు వేలూరు, చిత్తూరు, అరకోణము, తిరుత్తణి, కంచి మున్నగుచోట్ల నుండి బస్సుల రాకపోకలుగలవు. ఈషోళింగరునకు దక్షిణమున $1\frac{1}{2}$ మైలు దూరముననున్న కొండకు ఘటికాచలమని పేరు. అందుపెద్దకొండ[3], చిన్నకొండ అనురెండుకొండలు పడమర

1. Venkatam Muthal Kumari Varai Vol. I. P.
2. Venkatam Muthal Kismari Varai — By Sri T. M. Bhaskar Tondiman — అను గ్రంథమున (పుటలు 30-39) చోళసింహపురమే ప్రాచీన నామమనియు శివలింగమును బట్టి వచ్చిన చోళలింగపురమన్న పేరినడుమను శైవులు కల్పించినదనియు కలదు
3. ఆ పెద్దకొండనుగూర్చిన పురాణకథ: భైరవేశ్వను డాపర్వతమును పై కెదుగవలసి నదిగా ఆజ్ఞ యిచ్చినాడు. అది పెరిగిపెరిగి దేవలోకమును తాకబోయినది. అపుడు ఇంద్రుడు బలరామునివద్దకుపోయి అయనసహాయముతో ఆపర్వతము పెరుగుదల నాపినాడు — "వెంకటమ్ ముథల్ కుమారివరై".

తూర్పు దిక్కులం దొకదానికొకటి యభిముఖముగానున్నవి. పెద్దకొండ యందు యోగలక్ష్మీనరసింహస్వామియు, చిన్న కొండయందుచతుర్భుజశంఖ చక్రములతో యోగాంజనేయస్వామియువెలయుచున్నారు. ఈరెండుదైవ ములునుయోగారూఢులై శాంతివిగ్రహులై భక్తజనసమస్తవాంఛాప్రదులై భాసిల్లుచున్నారు ఈ కొండలకు మెట్లున్నవి[1]. కొండక్రింద కొండపాళె మను చిన్నగ్రామముకలదు. ఇయ్యది గొప్ప సేవాస్థలము. సప్తర్షి ప్రముఖు లీక్షేత్రమున వసించిరని, సప్తర్షులను సనకసనందనాదుల ననుగ్రహించుటకు నరసింహస్వామి యందుప్రత్యక్షమయ్యెనని దీని మాహాత్మ్యము తెలుపు చున్నది. ఇం దనేకతీర్థ రాజములు కలవు. అవి వ్యాధిహరములు. స్వాదు జలపూర్ణములు. ఈ స్థలమున భక్తులెల్లప్పుడు కొండలలో సేవచేయుచుం దురు సేవచేయువారికి అనివార్యములనదగిన సమస్తవ్యాధులు, శాకినీ ఢాకిన్యాది పిశాచగ్రహబాధలు, అభిచార క్షుద్రప్రయోగములచే గల్గు చిత్తభ్రమాది సంకటములు పూర్తిగానశించునని, సంతానాది సమస్తకామి తము లచిరమున సిద్ధించునని కీర్తి. పూర్వ మీ ఘటికాచలమునకు షోళిం గరునకు సంబంధము లేదు. చోళరాజుచే లింగస్థాపనచేయబడి కట్టబడిన యూరగుటచే చోళలింగ పురమను పేరుగలిగె[2]. రెండవ మైసూరు యుద్ధము[3] షోళింగరులో జరిగిన కాలమున పైకొండలలోని యుత్సవ విగ్రహముల దాచియుంచిరట తర్వాత నరసింహస్వామి యుత్సవమూ ర్తిని షోళింగరుదేవాలయమున స్థాపించిరట. నాటి నుండి షోళింగరు ఘటి కాచలము లొక్కటైనవి. నేడు ఘటికాచలదేవస్థాన కార్యాలయాదులు షోళింగరు దేవాలయముననే యున్నవి............ఈక్షేత్రాన నరసింహ స్వామివారిదేవి 'అమృతఫలవల్లీశ్వరి'నాబరగును. —షోళింగరులో నున్న యుత్సవమూర్తికి భక్తోచితాఖ్య ప్రసిద్ధము * ఈవిధముగా నీక్షేత్రవిషయ మును చెప్పినది శ్రీయుతులు రావూరి దొరసామిశర్మగారు[4].

---

1. కొండ యెత్తు 400 అడుగులు. మెట్లు కట్టించినది రాయోజి అను నతడు.

2. ఆ శివాలయ మిప్పటికి చోళేశ్వరాలయమనుపేర కలదు.

3. సెప్టెంబరు 27. 1781.

* భక్తవత్సలమను పేరే భక్తోచితాఖ్య. శ్రీ శివ అష్టోత్తరశతనామావళిలో భక్తవత్సలనామము పదునేడవది.

4. భారతి. సెప్టెంబరు 1955. పుటలు. 90, 92

(4) సంస్కృతమైన ఘటికాశబ్దమే తమిళమున "కడిగై" అనిదైనది. అందుదానియర్థము కొంతవిలక్షణముగా నున్నది. ఇరువదినాలుగు నిమిషములకాలమను అర్థముతోపాటు వేదము అనియర్థమున్నది మరియు కేవలము బ్రాహ్మణులు నివసించు పేట[1] "కడిగై". మరియు బ్రాహ్మణ గురువులు, బ్రాహ్మణశిష్యులకు మతతాత్త్వికశాస్త్రాది విద్యలనుబోధించు ప్రదేశమునకును "కడిగై" అనిపేరు. గ్రంథగౌరవనిర్ణయసమర్థమైన విద్వత్పరిషత్తునకును "కడిగై" అనిపేరున్నది. పల్లవులు తొండైమండలమున స్థిరపడి కాంచీపురమును రాజధానిచేసికొని పాలించినకాలమున పైన పేర్కొనబడిన అన్నియర్థములు సమకూడునట్లుగా కడిగై స్థానములనుపోషించిరి. ఈవిషయమునింకను విపులముగను సప్రమాణముగను శ్రీ సి. టి. శ్రీనివాసఅయ్యంగారు ఈవిధముగా వ్రాసినారు [2]

"About the end of the fourth century A. D. there existed at Kanci (Kanchi) a college for the teaching of Vedic and other Sanskrit lore, where studied Mayura Sarma, who afterwards founded the Kadamba dynasty of Banavase, says the Talagunda inscription[3] of his great-grandson, Kakustavarma. Mayura Sarma with his precepter, Vira Sarma, went to the city of the Pallava lords and, eager to study the whole sacred lore, quickly entered the Ghatika (college) as meandicant. I imagine that the ghatika was not a new one started when the Power of the first Pallavadynasty of Kanchi was decaying but was an institution which existed ever since Kanchi became a centre of Aryan learning..."

---

1. Ghatika a settlement of learned Brahmans. History of Tirupati Vol.1. Page 120. By Dr. S. Krishnaswamy Aiyangar.
2. History of the Tamils - (From the earliest times to 600 A.D.) Page 333.
3. యః ప్రయాయ పల్లవేంద్రపురీం గురుణా సమం వీరశర్మణా
   అధిజిఘాంసుః ప్రవచనంనిఖిలం ఘటికాం వివేశాసౌ తరక్కుకః.

   Eq. Ind. VIII P. 32. V. 10.

   శ్రీ ఆర్. సత్తినాథయ్యర్ గారి శాసనమును పేర్కొని వ్రాయుచు నిట్లనిరి.
   "The usual interpretation of the above story is that Mayura-Sarmae went to Kanchi, a famous center of higher learning (perhaps the seat

పల్లవులలో ఎనిమిదవరాజు పల్లవమల్లబిరుదాంచితుడు, నందివర్మ రాజ్యకాలమున ఘటికాచలమున నొక "కడిగై" ఉండెడిదనియు,మరియు నది వైష్ణవ బ్రాహ్మణమయమైయుండెడిదనియు శ్రీమతి డాక్టరు మీనాక్షి తిరువల్లంశాసనమును, బ్రహ్మదేశముశాసనములను బట్టి నిరూపించినది. మరియు నామె నార్తు ఆర్కాట్ జిల్లాలోని షోలింగపురమునకే కడిగాచలము అనగా ఘటికాచలము అన్నపేరున్నదని కూడ నిర్ణయించెను.[1] బహుశః ఆ "కడిగై" ఉండుటను బట్టియే అది కడిగాచలము – ఘటికాచలముగానై యుండును

ఈ పైవిషయమునుబట్టి ఈ ఘటికాచలక్షేత్రము కనీసము పల్లవుల కాలమునుండి, ముఖ్యముగా నందివర్మకాలమున (క్రీ శ. 710-755) ఒక మహాప్రసిద్ధిని పొందిన విద్యాస్థానమై మహావిద్వాంసులయిన గురువులతోడను బుద్ధిమంతులయిన శిష్యులతోను వెలిగినది. మరియు నప్పటినుండియే అచట వైష్ణవుల సంచలనము ఎక్కువైనదిగా కనిపించుచున్నది పేయాళ్వార్లు, తిరుమంగైయాళ్వార్లు ఘటికాచలమునెరిగి కీర్తించినట్లు శ్రీభాస్కరతొండైమాన్ గారు చెప్పుచున్నారు.

ఈమాహాత్మ్యగ్రంథమున రామకృష్ణుడు "కడిగై" విషయమెత్త లేదు. మామూలు పురాణధోరణిలో నొక ఘటికాకాలమాత్రజపమునకే భగవంతుడు ప్రత్యక్షమగుటవలన ఘటికాచలమని క్షేత్రము సార్థకనామమును పొందినదన్నట్లుగా చెప్పినాడు (2-162)

సప్తమహర్షులఘటికాచలగమనసందర్భమున రామకృష్ణుడు కంచికది మూడుయోజనములదూరమున నున్నదని చెప్పెను. ఆసత్యము నేటికినిఅట్లే

---

of a Brahmanical University), and that his object was frustrated by his quarrel with a Pallava horseman. But this is doubtful...ghatika does not seem to be a college or any place of higher learning, but the Brahmana quarters of Kanchi whch he entered for GurukulaVasa..." (The classical Age. P. 271).

"There were also other organisations of which only the names have come down to us." Sri K. A. Nilakanta Sastri-THE COLAS. Page 633.

1. A History of Tamil Literature – Satva Literature. By Avvai. S. Doraiswamy pillai. Page 25.

యున్నది. మరియు రామకృష్ణుడు నరసింహస్వామికాక్షేత్రమున అమృత ఫలాఖ్య భక్తోచితాఖ్య లెందుకువచ్చినవో చెప్పినపుడు (3-22) అమృతవల్లీ శ్వరి పేరెత్తలేదు నరసింహస్వామికి కళ్యాణోత్సవముగూడ చేయించినాడు అపుడుకూడ అమ్మవారిని "ఇందిరాదేవి" (3-64) అనియే పేర్కొనెను. శ్రీ రావూరు దొరసామి శర్మగారా క్షేత్రమున అమ్మవారిపేరు అమృతవల్లీ శ్వరియనిచెప్పుచున్నారు మరియు కొండమీద రెండుతీర్థములుగలవనియు వానిలోనొకటి అమృతఫలతీర్థమనియు, రెండవది భక్తోచితతీర్థమనియు రామకృష్ణుడు చెప్పెను శ్రీ దొరసామిశర్మగారివిషయమును ఔననలేదు. కాదనలేదు ఇందనేకతీర్థరాజములు కలవనిమాత్రమే అనిరి. శ్రీ నరసింహ స్వామి కల్యాణమహోత్సవము తొమ్మిదిదినములు ఆగమవిధిసమ్మతముగ జరిగినట్లు రామకృష్ణుడు చెప్పినదాని విషయమును శ్రీశర్మగారు స్మరింపను గూడలేదు. మరియిప్పు డచట ఆమహోత్సవమర్యాద యెట్లుసాగు చున్నదో-?

(5) ఘటకాచలము నూటయెనిమిది దివ్యతిరుపతులలో నొకటి. ఆళ్వారుల మంగళాశాసనములకు పాత్రమైన పవిత్రస్థలమది. నాలాయిర ప్రబంధమున పేయాళ్వార్ల చేతను, తిరుమంగై ఆళ్వార్లచేతను, ఒకటి రెండుసార్లు ప్రశంసి ప బడిన దివ్యక్షేత్రము ఘటికాచలము. మొత్తము మీద పన్నెండుమ ది ఆళ్వారులచేత అనగా నందులో నేయొక్కరిచేతనైనను మంగళాశాసనము సాయించబడి యున్న దైవక్షేత్రము దివ్యతిరుపతి. ఈ నూటయెనిమిది దివ్యక్షేత్రములను గూర్చి వారు నాలుగువేలపాశురము లనుసాయించియున్నారు. నాలాయిరప్రబంధమనగానదియే. చోళనాడున- నేటి తంజావూరు జిల్లా ప్రాంతమున - గల దివ్యక్షేత్రములు నలుబది; పాండ్యనాడు — నేటి మధురామండలము-పరిసరమునపదునెనిమిది; మలై నాడనబడు కేరళ ప్రాంతమున పదుమూడు; రామనాథపురం తిరునల్వేలి జిల్లాల ప్రదేశమున - నడునాడున- రెండు; చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాట్ జిల్లాల ప్రదేశమున తొండైనాడున ఇరువదిరెండు; వెరసి తొంబదియైదు దివ్యతిరుపతులు దక్షిణదేశమునగలవు. తొంబదియైదవది ఘటికాచలము. ఆంధ్రప్రదేశమున తిరుపతి. అహోబలము రెండే దివ్యక్షేత్రములు మిగి లినవి ఉత్తరదేశమున నున్నవి. నూటయెనిమిదవది తిరునాడు పరమ పదము.

పేయాళ్వార్లు(725 A. D.) ఘటికాచలమును పేర్కొనుచు సాయిం చిన పాశురము (3వ ఆయిరం పుట 33.)

*పండెల్లాం వేంకటమ్ పొర్కడల్ వైగుందమ్
కుండంగ్‌గురై వార్కు కోయిల్‌పోల్ - వండు
వళంగ్ కిళరుం నీళ్ పొత్తై వణ్పూంగ్ కడిగై
ఇలంగ్ కుమలన్రన్ విణ్ణగర్.

తిరుమంగై ఆళ్వార్లు (776 A. D.) శ్రీ ఘటికాచలనృసింహుని పేర్కొనుచు చెప్పిన మంగళాశాసనము (రెండవ ఆయిరం పుట 126.)

*మిక్కానై మత్తైయామ్ విరింద విళుక్కై ఎన్నుళ్
పుక్కానై ప్పుగళ్ సేర్ పొలిగిన్రపొన్‌మలైయై
తక్కానై కడిగై కడిగై త్తడంగ్ కున్రిన్ మిసై యిరుంద
అక్కారక్కని యై అడైందు ఉయ్ందు పోనేనే.

మరియు నింకొకచోటకూడ తిరుమంగై ఆళ్వార్లు ఘటికాచలమును స్మరించిరి.

"*కారార్ కుడందై కడిగై కడన్‌మల్లై...."(3వ ఆయిరం పుట 93)

(6) తాళ్లపాక తిరువెంగళానాథుడు (16వ శతాబ్దము) పరమయోగి విలాసమున నూటయెనిమిది తిరుపతులను వర్ణించుచు ఘటికాచలమును గూర్చి చెప్పినతీరు (పుట 332)

మనుజసింహుడు మున్ను మహిసప్తమునులు
వనిబూనిగడియ తపంబుగావింప
నటవచ్చి ప్రత్యక్షమైనట్టివాడు
ఘటికాచలేశుండు కలహంసగమన.

(7) రామకృష్ణునకు పూర్వమునను, అతనిసమకాలమునను ఆపిమ్మటనుకూడ ఘటికాచలక్షేత్రము వైభవోపేతముగనే యున్నది. పదునేడవ శతాబ్దమున కాంచీమండలమువాడు వేంకటాధ్వరి విశ్వగుణాదర్శమున (303 నుండి 312 వరకుగల శ్లోకములు) ఘటికాచలమాహాత్మ్యమును పేర్కొనుచు శ్రీ నరసింహస్వామివారిని కీర్తించియున్నాడు.

---

*శ్రీ కారప్పంగాడు శ్రీ గోపాలాచారియర్ సంపాదించి 1959 లో ప్రచురించిన నాలాయిర ప్రబంధము.

కంఠోపరి కంఠీర శుచి
దంష్ట్రారుచి విచిత్రచంద్రికయా
స్ఫటికాచల ఇవ నయనే
ఘటికాచల ఏష సంప్రతి ధినోతి.

వరకేతుస్థ తార్క్ష్యాయ
స్మరకేళివుషే శ్రియః
నరకేతుణ విఘ్నాయ
నరకేసరిణే నమః.

స్థిరశంఖాదిచిహ్నాయ
సురసంఘార్చితాంఘ్రయే
పరసంహారదక్షాయ
నరసింహాయ మంగళమ్

జంభదంభహరశ్రే మా
రంభలంభకమూర్తయే
శంభుసంభావనీయాయ
స్తంభడింభాయ మంగళమ్

అపుణ్యధౌరేయ హిరణ్యదూన
త్రిలోకశోకక్షపణాయ శౌరిః
కాయాధవాయాసనిరాసదంభాత్
స్తంభా దిహోజ్జృంభత సంభ్రమేణ.

మనుష్యతిర్యక్త్వ ముపేత్యసద్యో
దేవ స్వయం స్థావరతోఽభ్యుదంచన్
విచిత్రశక్త్యస్వయ మత్రవేద్యైః
ప్రతాయ్యమానం ప్రకటీకరోతి.

ఘటికాచలం వపురవేత్య తత్త్వతో
ఘటికాచలం సమధిరుహ్యా భక్తితః
నరకేసరీంద్రచరణౌ విలోకయన్
నరకే నసరిష్యతిజాతుమానవః.

(8) ఘటికాచలము అహోబలమువలె నొక గురుపరంపర కాస్పద మైనమఠము. ఆ మఠాచార్యులలో దొడ్డయాచార్య నామధేయు లిద్దరు ముగ్గురు కలరు. చక్రపురి రాఘవాచార్యుడు "కందాళ దొడ్డయాచార్యులకు శిష్యుఁడైనట్టి వైష్ణవాచారతత్ప"రుడు. ఇతడు తన విష్ణుభక్తచరిత్రావతారికలో తన గురువైన దొడ్డయాచార్యుడు అప్పళాచార్యుని కొడుకని చెప్పినాడు. ఆ తండ్రికొడుకులపేర్లను కలిసికట్టుగా చెప్పిన శాసనము, క్రీ. శ. 1545 సంవత్సరమునాటిది, కలదు. దాని యాంగ్లానువాదమున దొడ్డయాచార్యుడు ప్రసిద్ధుడైన మఠగురువనియు నతడు షోలింగరులో నివసించుననియు కుండలీకరణములలో వ్రాయబడి యున్నది. ఈ యాధారముఁ ననుబట్టి ఆచార్య యస్వీ జోగారావుగారు[1] ఈదొడ్డ యాచార్యులే రాఘవాచార్యుల గురువులై యుందురని ప్రతిపాదించుటతోపాటు దొడ్డయాచార్యుల తండ్రి అప్పళాచార్యునకును తెనాలిరామకృష్ణునకును గల సంబంధమును విచికిత్సచేసిరి.

అదెట్లనగా - రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము సంకితము గొన్న వేదాద్రిమంత్రీశ్వరుని గురువు కందాళయప్పగారు అనగా కందాళ అప్పలాచార్యులుగారు. దొడ్డయాచార్యుల తండ్రియైన అప్పళాచార్యులుగారే ఈ యప్పళాచార్యులు కావచ్చును. అగుచో "ఒకవేళ రామకృష్ణకవి ఘటికాచల మాహాత్మ్య రచన కతని ప్రోత్సాహమే కారణమేమో" అని. కావచ్చును.

రాఘవాచార్యుని నలచరిత్ర రచనము క్రీ. శ. 1620 అయియుండునని బ్రౌనుదొర వ్రాసిపెట్టినట్లు తెలియుచున్నది[2] దొడ్డయాచార్యులు క్రీ శ. 1545 లో ఉన్నట్లు శ్రీజోగారావుగారుచూపిన శాసనముచెప్పుచున్నది అందువలన రాఘవాచార్యుడును అప్పటివాడే కావలయును. ఇచట గమనింపవలసినది మరొక విషయముకలదు. దొడ్డయాచార్యుడన్నది పేరుకాదు అది బిరుదనామము. మహాచార్యుడే దొడ్డయాచార్యుడు. ఆ బిరుదము మోసినవారు చాలమందికలరు. 1519 ఏప్రెల్ 13 నాటి ఒక శాసనమున వేదాంతాచార్య అను దొడ్డఅయ్యంగార్ అప్పై్ప నాబడు మఠాచార్యుడొకడు ఘటికాచలమున నివసించినట్లుఁ గలదు[3]. అదియట్లుండె

1. ఆంధ్రయక్షగానవాఙ్మయచరిత్ర. ద్వితీయభాగము. పుటలు 2-7.
2, డి. సం. 1064. పుట. 1397.
3 తిరుపతి దేవస్థానము శాసనములు. సంపుటము, 3. పుట, 278.

చక్రపురిరాఘవాచార్యుడు నలచరిత్రము, విష్ణుభక్తచరిత్రము అను రెండు ద్విపదకావ్యములను, విప్రనారాయణచరిత్రమను యక్షగానమును, రచించి ఘటికాచలనరసింహునకంకితము గావించెను.

*నలచరిత్రము:*[1]

శ్రీ సతీహృదయేశుఁ జిరకృపావేశు
వాసవనుతవేషు వరభక్తపోషు
నిరుపమ జయవాణు నిత్యకల్యాణుఁ
గరుడాసముల్లాసు ఘటికాద్రివాసు
అమితగుణోపేత యఖిలైకమాత
అమృతవల్లమ్మమాయమ్మపూగొమ్మ
చరణారవిందముల్సన్నుతిఁజేసి

* * *

నలువైన ఘటికాద్రినారసింహునకు
వెలయనంకితముగా ద్విపదరూపమున
సలలిత సౌరాంధ్ర శబ్దసంగతుల
వలనొప్ప నలచక్రవర్తిచరిత్ర
విరచింతు నానేర్చువిధమెల్ల దెలియ
గర మొప్పఁ దత్కథాక్రమమెట్టిదనిన.

*విష్ణుభక్త చరిత్రము:*[2]

శ్రీ కమలాధారుఁ జిరకీర్తిహారు
పాకారిరిపుశిక్షుఁ బద్మపత్రాక్షు

* * *

ఘనరూపసంకాశు ఘటికాచలేశు
సేవించి పూజించి చెలగికీర్తించి
శ్రీ వనితాదేవి సిరులపూతావి

* * *

1. డి. నం. 1064. ఆర్. నం. 145, 315 ఇట్లున్న మూడుప్రతులలో రెండవది అసమగ్రము. మొత్తముమీద మూడును ఏకరూపమున లేవు. శ్రీ సి. పి. బ్రౌనుగాక మరిరెండు సంస్థలు దీనిని ప్రచురించినవి. ఈ ఉదాహరింపబడినది డి. నం. 1064. 2. డి. నం. 1182.

అలరుబంగరుబొమ్మ అమృతవల్లమ్మ
నాతతభక్తితో నర్చించిమ్రొక్కి-

*　　*　　*

వలనొప్ప ఘటికాద్రివాసుడైనట్టి
నలినాక్షుడోంకార నారసింహునికి
వెలయనంకితముగా ద్విపదరూపమున
బలువైన శ్రీవిష్ణు భక్తచరిత్ర
విరచింతునానేర్పు విధమెల్ల దెలియ
కరమొప్ప తత్కథాక్రమమెట్టిదనిన....

*విప్రనారాయణచరిత్ర:*[3]

వ. అని మఱిన్ని ఘటికాద్రినారసింహునకు
షష్ఠ్యంతాలుచెప్పె నటయెటువలెను
అర్ధ చంద్రికలు-
నలినజుచదువులు విలిపిన హరికిన్
మూపున కుధరము మోసిన హరికిన్
అరసి హిరణ్యుని నడచిన హరికిన్
కరుణ బ్రహ్లాదునింగాంచిన హరికిన్
వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన విప్రనారాయణ
చరిత్రంబను యక్షగానంబునకు కథాక్రమంబెట్టిదనిన.

*　　*　　*

వనజారిపేర మందరధారుపేర
సురపోషణునిపేర సుస్థిరముగను
వలనొప్ప ఘటికాద్రివాసుడైనట్టి....

## 10. ఘటికాచలమాహాత్మ్యము - ప్రతులు:

(1) తాళపత్రప్రతి;- D. No. 158, 159 సంఖ్యలతో వరుసగా సమగ్రమును, అసమగ్రమును అయిన రెండుప్రతులు తంజావూరు సరస్వతీ

3. డి. నం 1939

మహాలు గ్రంథాలయములో నున్నట్లు క్యాటలాగున[1] చూపబడియున్నవి. నిజమునకవి రెండుప్రతులుకావు. రెండునుకలిసి యొక్కటియే. కథాప్రారంభమునుండి తుది దాకకలది మొదటిది. కృష్ణావతారిక మాత్రమే కలది రెండవది కట్టలు కట్టుటలో రెండైనవితప్ప అవియొకటియే. ఆ ప్రతి మొత్తముమీద చాలవరకు మంచిస్థితిలో నున్నది. ఒకటిరెండుచోట్లఆశ్వాసాద్యంతపద్యములందును గ్రంథమధ్యముననుతప్ప మిగిలిన దంతయు సమగ్రముగనేయున్నది.

(2) D. No. 258. వేంకటాచలవిలాస మొకటి ఎక్కువ గ్రంథపాతమును, కొంత శైథిల్యమును కలిగి – ఆద్యంతములులేనిది, తప్పులంతగాలేనిది, అసమగ్రమైనది, కవిపేరు తెలియనిది – తంజావూరు గ్రంథాలయమునకలదు.[2] వెంకటాచలవిలాసమని పేరేకాని, ఉన్నంతవరకు ఆగ్రంథము ఘటికాచలమాహాత్మ్యమే. ఘటికాచలమాహాత్మ్యములోని ద్వితీయాశ్వాసము డెబ్బదియారవపద్యమునుండి రెండువందలనలుబదియొకటవపద్యమువరకు గలగ్రంథము శిథిలమై గ్రంథపాతములతో నున్నది- వేంకటాచలవిలాస మనుపేర కట్టగట్టబడినది. అంతమాత్రమే.

(3) కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తు గ్రంథాలయమున ఘటికాచల మాహాత్మ్యమను పేరుతో కొద్దిపాటి తాటియాకుల పుస్తక మొకటి యున్నది పరిషత్తులోని ఘటికాచలమాహాత్మ్యమునకును రామకృష్ణుని ఘటికాచలమాహాత్మ్యమునకు పేరులో తప్పించి మరెట్టి సంబంధమును లేదు

(4) సూర్యరాయాంధ్రనిఘంటువునందు ఘటికాచలమాహాత్మ్యమునందలిపద్యము లుదాహరింపబడినవి గలవు. అవి ముద్రితప్రతినుండి గ్రహింపబడిన వని చెప్పుటకు వీలున్నను, ఒకటిరెండుచోట్ల భిన్నపాఠములు కనిపించుచున్నవి అందువలన వారికడ మరొక తాళపత్ర ప్రతియున్న విషయమనుమానాస్పదము.

(5) పూర్వముద్రితప్రతి: క్రీస్తుశకము 1902వ సంవత్సరమున రాజమహేంద్రవరమున కళావతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

1. (D.CT) A Descriptive Catalogue of The Telugu Manuscripts in The Tanjore Maharaja Serfoji's Sarasvati Mahal Library. (Andhra University) P. 34.
2. దీని విషయమును నాదృష్టికి తెచ్చినది శ్రీ రావూరి దొరసామిశర్మగారు.

మొదటి కూర్పు అయిదు వందలు ప్రకాశకు లెవరైనదియు నందులేదు. ఆ ముద్రణమును గురించి వారేమియు వ్రాయలేదు. ఆ గ్రంథమును ప్రకటించినది శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారని - అనగా ఐయుందురని - శ్రీ నేదునూరి గంగాధరముగారు చెప్పినారు ఆ ముద్రితప్రతి సమగ్రము కాదు. కొన్నిచోట్ల పద్యములులేవు. మరికొన్నిచోట్ల రూపుమారియున్నవి. కాగితము మంచిదికాదు. చాలపెలుసు. అచ్చుతప్పులెక్కువ ఆ ముద్రిత ప్రతికి మూలమైన తాళపత్రప్రతి తంజావూరుప్రతియేయనుటకు వీలులేదు.

(8) ప్రకృతప్రతి: ముద్రితప్రతినిబట్టి ఎత్తివ్రాయబడిన వ్రాతప్రతిని, తాళపత్రప్రతినిబట్టి ఎత్తివ్రాయబడిన వ్రాతప్రతిని రెండింటిని పోల్చుకొనుచు ఉచితమనిపించుపాఠములతో పద్యములను క్రమముగా వ్రాయుచు, పాఠాంతరములను క్రిందచూపుచు, ఈ ప్రకృతప్రతి సిద్ధముచేయబడినది. పూర్వముద్రితప్రతిలోని దోషములన్నియు బుద్ధికందినంతవర కింద తొలగింపబడినవి.

ఈ ఘటికాచలమాహాత్మ్యమును రచించినది తెనాలిరామకృష్ణుడు[1]. సాధుపాఠములతోడి ఈ గ్రంథసంపాదనము నందుపయోగింపబడిన సంకేతములు (1)తా(2)పూ.ము. అనగా తాళపత్రప్రతి, పూర్వముద్రణము-అని. పుట అడుగున జ్ఞాపికలో "తా" యను సంకేతముతో పాఠాంతర మీయబడినచో పైనున్నపాఠము పూర్వముద్రణములోని దనియర్థము, ఇట్లే ఆ సంకేతములు తలక్రిందైనప్పుడును తదనుగుణముగా గ్రహింపవలయును. "తా.పూ.ము"- ఈమూడుసంకేతములతో పాఠాంతరములుచూపబడినప్పుడు పైనున్నపాఠము సంపాదకుడు భావించినదిగా నెరుగవలయును.

కొన్నిపద్యములు అర్థసమన్వయ మవగతము కానివికలవు. అట్టిచోట్ల క్రొత్తమార్పులను ప్రవేశపెట్టక ఉన్న దున్నట్లుంచబడినవి.

ఎంతప్రయత్నముచేసినను నాల్గైదుచోట్ల గలగ్రంథపాతము తొలగింపవీలుగాక ఆయా భాగముల నట్లే అసమగ్రచిహ్నములతో ముద్రించుటయైనది.

---

1. ఈమాహాత్మ్యమును నీతరువాత గిరిశేషులు కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు పద్యకావ్యముగను, ఇటీవల లాక్షణికకవులు శ్రీ రావూరి దొరసామిశర్మగారు పద్య గద్య కావ్యములుగను రచించియున్నారు.
దక్షిణ: దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము. పుట 229. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు.

## 11. ఘటికాచలమాహాత్మ్యము - అవతారిక :

ఇది రామకృష్ణుడు వ్రాసినదికాదు. వేంకటగిరీంద్రు డనుకవి వ్రాసినది. షష్ఠ్యంతములను కలుపుకొని ఇందు మొత్త మరువది గద్యపద్యములు. ఖండోజీ కీకృతి అంకితము గావింపబడినట్లుగా నున్నవి – వేంకటగిరీంద్రుడు ఇష్ట దేవతా నమస్కారాదులు గావించుకొని ఖండోజీక్షోణీమండలాఖండలునిపై నొక మహాప్రబంధము రచియింపబూనియుండ నొకనాడు తిరుమణి నుదుట గల విప్రుడొకడు నూతన కావ్యము నొకదానిని గైకొనివచ్చి ఖండోజిని దర్శించి చెంతకు జని యాశీర్వదించి యిట్లు మనవిచేసెను. "అయ్యా, నీవుతప్పకావ్యరసాస్వాదన చేయగలవాడు మరిలేడు. రామకృష్ణకవి ఘటికాచలమాహాత్మ్యగ్రంథమును రచించి తగినకృతిపతిలభింపమిని దానినట్లేయుంచి పోయెను. నీవున్నావనివిని నేనుదానిని ఆయనయభీష్టము తీరునని నీకు సమర్పింప గొనివచ్చితిని" - అని. ఖండోజి దానిని గైకొని ఆ తెచ్చినవాని కిష్టసిద్ధి గావించి పంపించెను. ఆపిమ్మట తన యాస్థానకవియైన వేంకటగిరీంద్రుని రావించిగౌరవించి "రామకృష్ణకవి కల్పిత కావ్యమొకండుతెచ్చి సద్భావముతోడ నా కతనిపౌత్రు డొసంగె. మదంకితంబుగా....మదీయ వంశావళిచెప్పి కూర్పుము" అని యాదేశించినాడు. వేంకటగిరీంద్రు డట్లొనర్చినాడు, ఈ అవతారిక యిట్లయినది.

(1) ఈకృతిని తెచ్చి ఖండోజీకి సమర్పించిన రామకృష్ణుని మనుమని ఊరు పేరులు తెలియవు. ఆ మనుమని కేవిధము గా "ఇష్ట సిద్ధి" ఖండోజి గావించినా డన్నదియును తెలియదు. పౌత్రుడనుటనుబట్టి కేవలము రామకృష్ణున కతడు కొడుకుకొడుకనుకొనుటకు వీలులేదు పనునారవశతాబ్దము చివరి సగము పూర్తిగా చూడకుండగనే కన్నుమూసిన రామకృష్ణుని మనుమడు పదునెనిమిదవశతాబ్దమును చూచిన ఖండోజివద్దకు పోయియుండుట సంభావ్యము కాదు. రామకృష్ణుడు చనిపోయినతరువాత నూరు-నూటపాతికసంవత్సరములకు గాని ఖండోజీ పుట్టలేదు. అప్పటిదాక రామకృష్ణుని మనుమడు బ్రతికియుండుటకు వీలులేదు. కావున పౌత్రుడన్నది వట్టియౌపచారికపదము. దానినిబట్టి రామకృష్ణునివంశములో నాలుగైదుతరముల తరువాతివా డెవడో ఒకడై యుండు ననుకొనవలయును.

(2) వేంకటగిరీంద్రుడు కొన్నిగ్రంథము లింతకుపూర్వమే రచించి ఖండోజీకిఅంకితముచేసియున్నాడు. ఇతనికృతులు మూడు.[1] (i)రుక్మాంగద

1. దక్షిణ. పుట. 226.

చరిత్ర (ద్విపద) (ii) అభినయదర్పణము (iii) ఘటికాచలమాహాత్మ్యకృత్యాది. రుక్మాంగదచరిత్రములో నితడు తనవంశమును వర్ణించుకొనినాడు.[1] ఇతనిది లోహితసగోత్రము, ఆపస్తంబసూత్రము, ఇంటిపేరు దర్భ. తండ్రి ఔబళుడు. తల్లి జానకమ్మ. వీరు నలుగు రన్నదమ్ములు. గోపన, గిరిరాజు, వేంగన, కవిగిరి (వేంకటగిరి). గిరిరాజు[2] తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజులలో సంస్కృతాంధ్రకవితావిలాసచతుర్ముఖుడైన శహాజీయాస్థానము నలంకరించిన తెనుగుకవులలో నొకడు. తరువాతి శరభోజీయాస్థానమునందును ఇతడుచేరెను. వేంకటగిరికి కవిగిరిఅనియు వ్యవహారమున్నది. "విచిత్రరాయచంద్రవతంసు"డనునది బిరుదము[3] వేంకటగిరి తన అభినయదర్పణమును ఖండోజికేఅంకితముచేసినాడు. అసలది విచిత్రరాయ(చంద్ర)వతంసప్రణీతమనియే యున్నది[4] శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారొకచోట "ఈ విచిత్రరాయవతంస బిరుదాంకితుడు గిరికవి (వేంకటగిరి) యని భావించుటకు కారణము కృతికర్త దీనిని ఖండోజిరాయనికంకితము కావించుటయే" అని వ్రాసిరి. ఈ ఘటికాచలమాహాత్మ్యకృత్యాదిలోనిపద్యము (13) వెంకటగిరియే విచిత్రరాయచంద్రవతంస బిరుదాంచితు డని విస్పష్టముగా చెప్పుచున్నది ఖండోజీ తనతండ్రిపేరునే తన కతిముఖ్యుడైన కవికి బిరుదుగాచేసినాడు. ఎంతముఖ్యుడనగా నర్ధసింహాసన మిచ్చి గౌరవింపదగినంత ముఖ్యుడు (అవతారిక 16).

ఈ యవతారికను వ్రాసిన వేంకటగిరీంద్రుడు ఈ కృతి రామకృష్ణునిదే యని నమ్మెను. రామకృష్ణుడే ఒకవేళ ఈకృతి కవతారిక వ్రాసినచో నెట్లు వ్రాసియుండునో దానిని వేంకటగిరీంద్రుడుభావించినాడు. రామకృష్ణుని వైష్ణవమునకు శ్రీకృష్ణ డిష్టదైవము కనుకనే పేరుమార్చుకొనవలసివచ్చినపుడు ఆపేరునే తనకుపెట్టుకొనినాడు. పాండురంగమాహాత్మ్యమున మొదట కృష్ణుడే ప్రార్థింపబడినాడు. ఇట్టిచో ఘటికాచలమాహాత్మ్య

1 D.C.T. పుటలు 123. 124 మరియు ఆచార్య యస్వీ. జోగారావుగారి ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర పుట 314.

2. దక్షిణ. పుట 219.

3 ఘటికా: ఘటికాచలమాహాత్మ్యము. అవతారిక 18.

4. దక్షిణ. పుట 228.

5. భారతి. విజయ. మార్గశీర్షము, పుటలు. 501, 502.

మునను అట్లేయుండవలయును. గిరికవి అట్లేచేసినాడు. మరియు రామకృష్ణుడెంత వైష్ణవమును కౌగలించుకొన్నను జన్మతోడిదైన శైవము వానికి ప్రాణలింగముగనే యున్నది. ఈ సంగతియు గిరికవి యర్థముచేసికొనినాడు. పాండురంగమాహాత్మ్యమున మొదటి యారుపద్యములందును ప్రార్థింపబడిన (1) కృష్ణుడు (2) లక్ష్మి (3) విధాత (4) వాణి (5) శంకరుడు (6) పార్వతి-ఈయార్గురను ఈక్రమముననే గిరికవి తానును తన వ్రాసిన అవతారిక మొదట ప్రార్థించినాడు. ఒక్క శంకరుని విషయమున తప్ప మిగిలినవారి విషయమున పాండురంగమాహాత్మ్యములోని ఛందస్సులనుగూడ అట్లే అనుసరించినాడు. ఇంతజాగ్రత్తగా కృతికర్తహృదయమెరిగి అవతారిక రచించుకవి కాలాంతరమున తనకృతి కబ్బుట రామకృష్ణుని పూర్వపుణ్యవిశేషము.

వేంకటగిరీంద్రునకు కావ్యప్రక్రియా పరిజ్ఞాన మున్నది అన్ని ప్రక్రియలును ప్రబంధ శబ్దముచేత పేర్కొనబడుటలో ఆయనకు దోషము కనిపించలేదు ఆతని దృష్టిలో ప్రబంధము గ్రంథసామాన్యవాచి మాత్రమే. (అవతారిక 11)

కావ్యమును కుసుమముతో పోల్చి దాని సౌగంధ్యమే దానిపరమార్థమని వేంకటగిరీంద్రుడు చెప్పినాడు. (13) కావ్యరసమును గాక కావ్యసుమనోలీలా సుగంధమును పేర్కొని యా సుగంధప్రమోదముచేత అఖండీకృతమానసు లయినవారే సహృదయచక్రవర్తులన్నట్లుగా ప్రతిపాదించినాడు.

తెనాలి రామకృష్ణుని కవితారీతినిగూర్చి వేంకటగిరీంద్రుడు అది విచిత్ర వాక్సరణి.బోల్చినదిగా చెప్పెను (14).

తాను పుంభావశారద అనియు, పదసందర్భవిశుద్ధి, ప్రౌఢతరశబ్దక్రియాబుద్ధి, చతుర్విధప్రథితకథారాసిద్ధి - ఈమూడును మహాకవిత్వ లక్షణములనియు వేంకటగిరీంద్రుడు భావించెను. (17)

మరియు రామకృష్ణుడు ఘటికాచలమాహాత్మ్యమును కల్పించి వ్రాసినాడు గాని, ఏయొకసంస్కృతమూలమునో పట్టుకొని తెనుగు చేయలేదనియు వేంకట గిరీంద్రుడు ప్రకటించెను. (20) తాత్త్వికముగా నితడు పరిణామవాదమువాడుగా కన్పించుచున్నాడు. (25) ఒకటి తక్కువగా సప్తసంతానముల ప్రశంసకూడ చేసినాడు. (48)

(3) ఖండోజీ: ఇతడు మహారాష్ట్ర రాజులలో నొకడనుకొనుట కవకాశము కన్పించుట లేదు. శ్రీ నిడుదవోలు వెంకటరావుగా రిచ్చిన[1] తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజుల వంశవృక్షములో నీతని పేరులేదు. మరియు "శహాజీ మహారాజుబంధువులలో నొకడును, విచిత్ర రాయని కుమారుడును నగు ఖండోజీరాయ[2]డ"ని వ్రాయబడియుండుటను బట్టియు నితడు ఆ మహారాష్ట్రరాజులలో నొకడుగాక వారిబంధువును సామంతుడును అయిన ఒక కొద్ది పాటి దొరయైయుండునని చెప్పవచ్చును. ఇత డెంతపాటిప్రదేశముమీద నధికారియో, ఇతనియాస్థాన వైభవమెట్టిదో అంతగా తెలియుటలేదు * ఇతని వంశవృత్తాంతాదిక మితని కంకిత మీయ బడిన కృతులనుండి గ్రహింపవలెను. "అభినయదర్పణ" గ్రంథావతారికలో ఖండోజిరాయడు కౌశిక గోత్రుడనియు, ఖండోజిరాయనిపుత్రుడగు విచిత్రరాయావతంసుని కొమరుడనియు, తల్లి భాగాంబయనియు[3] కలదు.

ఈఘటికాచలమాహాత్మ్యమునకు వ్రాసిన అవతారికలో వేంకట గిరీంద్రుడు మరికొన్ని వివరములతోచెప్పినాడు. ధాత-కుశికుడు - కుశనా భుడు-గాధి-విశ్వామిత్రుడు- ఆతరువాత ఆపరంపరలో చాలమంది జనిం చిరి. చివరకు మాలియను వానితో నావంశము మాలివంశమైనది. మాలికి కృష్ణరాజుపుట్టెను. కృష్ణరాజు భార్యపేరు గంగాయి. వారికి సరసరాజు పుట్టెను. వానిభార్యపేరు గురుజాయి. వారికిద్దరుకొడుకులు. పెద్దవాడు సుందరరాయడు. చిన్నవాడు విచిత్రరాయుడు. విచిత్రరాయని కొడుకు ఖండోజీరాయడు. ఖండోజి తల్లి పేరు భాగాంబ, ఖండోజికిరువురుభార్యలు మానాయి, పీరాయి అని.

---

1. దక్షిణ: పుటలు. 174, 175, గమనిక : ఈవంశవృక్షమును మొదట సిద్ధముచేసి ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో ప్రకటించినది జయంతిరామయ్యపంతులుగా రని గురువులుచెప్పుటచేత నీవిషయమువిచార్యము.

2. దక్షిణ. పుట 226.

* ఖండోజితండ్రి "మల్లవడి"పురీశ్వరుడనియు,ఆతడు ముత్తాపఖాను మొదలయిన నలుగురు మహమ్మదీయవీరుల నోడించినాడనియు వెంకటగిరీంద్రుడు చెప్పెను. ఘటికా, అవతారిక. 38, 39. నేటి మహాబలిపురమునకు మామల్లపురమని పూర్వకాలమున పేరుండెడిది. దానితో నీ మల్లవడికి సంబంధములేదేమో.

3. దక్షిణ. పుటలు, 227, 228.

అభినయదర్పణావతారికలోని ఖండోజీవంశవిషయములలో నొకటి యైన ఖండోజీ తాతగారిపేరు ఖండోజియగుటను ఈ ఘటికాచలమాహాత్మ్యవతారిక ఖండించుచున్నది. ఖండోజితాతగారిపేరు నరసరాజని యిం దున్నది. ఇందులో ఏదోఒకటియేగదాసత్యముకావలయును? ఇక రామ కృష్ణుని గ్రంథమునుగూర్చి.

12. ఘటికాచలమాహాత్మ్య కథా స్వరూపము :

నైమిశమున మునులు పద్మాదీశసద్మములలో నుత్తమమైన దానిని గూర్చి చెప్పవలసినదిగా సూతునికోరిరి. ఆవిషయమున నారదభృగుసంవాద మొకటి యున్నదని సూతుడు దానినిట్లు వివరించెను.

మానససరసీతటమున భృగ్వాశ్రమమున్నది. భృగువు నిత్యము శ్రీహరినిభజించును. ఒకనాడు నారదు డచటకు వచ్చెను. భృగువు వానిని తగురీతిగా పూజించి "వైష్ణవోత్తమపవిత్రవిశేషకథలు"దయయుంచి చెప్ప వలసినదిగా ప్రార్థించినాడు. నారదుడంత తానుదర్శించిన వైకుంఠమును, శ్రీమహావిష్ణువును మరియు భూలోకమునగల నూటయెనిమిది తిరుపతులను పేర్కొని వర్ణించినాడు. ఆవర్ణించి చెప్పుటలో ఘటికాద్రిప్రసక్తి కూడ వచ్చినది. అప్పుడు భృగువాఘటికాద్రినిగూర్చి వివరింపవలసినదిగా కోరి నాడు. నారదు డిట్లుపక్రమించినాడు.

సరయూతీరమున అయోధ్యకలదు. దానినిపాలించురాజుపేరు ధవ శాంగుడు. ఒకనాడు సింహాసనమున కొలువుకూటమున నున్నవాడున్నట్లుగా కిరాతుడైపోయినాడు. పూర్వపు తెలివి నశించి, యొక్కడే రాజ్యమును వదలి అడవులుబట్టి పోయినాడు. కొంతకాలమట్లే బోయతనమున తిరిగి తిరిగి ఒకనాడు వసిష్ఠాశ్రమమున ప్రవేశించినాడు. ఆమహర్షి దివ్యదృష్టిని వాని దుర్దశ విషయమెరిగి వానితో "రాజా! పూర్వము నీవు వేటాడుచు విశ్వామిత్రుని యాశ్రమ ప్రదేశమున తిరిగితివి అత డాగ్రహించి నీకిశాప మిచ్చెను. కానిమ్ము, ఇక నీకు క్షేమమగునులెమ్మ"నినాడు. అంత కిరాత వేషముపోయి ధవశాంగుడు యథాప్రకారము రాజైనాడు. "అరుదా సాధుసమాగమంబున శుభంబౌటల్ జటిగ్రామణీ!" "విను మిన్నియునేటికి మజ్జనకథాకథనమే ప్రశస్తోత్తరమై యనఘా తగు" నని నారదుడు తన జన్మవృత్తాంతమును చెప్పదొడంగెను – ఇది ప్రథమాశ్వాసము.

హరిచక్ర మనుపేర నొకపట్టణమున్నది. అందు గోవిందశర్మ యను విష్ణుభక్తు డొకడున్నాడు. ఆయన భార్యపేరుభద్రాంగి. ఆదంపతులకు నలుగురు కొడుకులు. వారునలుగురును కృతాధ్యయన సంపన్నులు. పితృవాక్యము నౌదల ధరింతురు గోవిందశర్మ కాయమెత్తిన వైష్ణవధర్మము. ప్రతిదినమును భగవదారాధనము, అతిథిసంతర్పణము చేసి బాలరామాయణ పారాయణము ముగించి, అర్ధాంగి ఇచ్చు విడెమునుసేవించి విష్ణుకథలందు మనసు లగ్నముచేసి కాలముబుచ్చును వారియింట నొకపనిమనిషికలదు. ఆమెపేరు తరళ ఆ యింటిప్రక్క బ్రాహ్మణుడొకడు హరిశర్మ యనువాడుండెను. వానికిని ఆ తరళకును సంబంధమేర్పడినది. నారదుడు పుట్టినాడు అనగా నారదుని పూర్వజన్మపు వ్యక్తియన్నమాట నారదుడు ఆగోవిందశర్మయింటనే పెరుగుచున్నాడు. ఒకయేటి వర్షాకాలము వచ్చినది, జడివానలు సాగినవి కౌండిన్యు డనుముని సంచారార్థ మరుగువాడొకనాడా హరిచక్రపురమునకు వచ్చినాడు. గోవిందశర్మ ఎదురేగి ఆమహర్షిని తనయింటికి గొనిపోయి అర్చించి వర్షాకాలము వెళ్ళువరకు నుండవలసినదిగా ప్రార్థించెను మహర్షి అంగీకరించెను.

నారదుడు నిత్యము నా వచ్చిన కౌండిన్యుని చుట్టుకొని యుండెడివాడు. ఆ మహర్షి బాలునకు నెమ్మదిగా వైష్ణవమాహాత్మ్యమును ప్రబోధించినాడు నారదునకు కొంత జ్ఞానము కలిగినది. కౌండిన్యు డచటు వీడిచనినాడు. దైవకృతమున తరళ మరణించినది. అంత నారదుడు గోవిందశర్మ యనుమతినిబడి ఘటికాద్రికి చేరుకొని హరినిగూర్చి తప మారంభించినాడు. శ్రీమహావిష్ణువు గరుడాళ్వారు మీద ప్రత్యక్షమగుచునే రథసగతి నేగినాడు. అందువలన నారదుడు హరిని సరిగా దర్శింపలేదు సరిగా హరిని కనవలెనని ఘోరతపమున కుపక్రమింపగా నాకాశవాణి జన్మాంతరమునమాత్రమే అది సాధ్య మని చెప్పినది జన్మాంతంబు పర్యంత మీతను వేలయని యోగసంగతివి నారదుడాతనువును త్యజించి వనజోద్భవ నందనుడుగా దివ్యమూర్తి నై కొనినాడు.

ఇంతదాకవిన్న భృగువు తృప్తితీరనివాడై యింకను ఘటికాచల మాహాత్మ్యము నుగ్గడింపవలసినదిగా కోరినాడు నారదుడు మరల యిట్లు మొదలుపెట్టెను సప్తమహర్షులు శ్రీహరిని దర్శించు పూనికతో శతశృంగ పర్వతమున తపము సేయదొడగిరి. ఆసంగతిదేవేంద్రునకుతెలిసినది. స్వర్గాధిపత్యము కొరకే తపించుచున్నారని వాని గుండె గుభిల్లుమన్నది. వెంటనే

రంభను పిలిపించినాడు. అమెవచ్చినది ఇంద్రుడు సంగతిచెప్పినాడు. ఆమె సరేయనినది. మేనకాద్యప్సరసలతో శతశృంగమునకు దిగినది తదాగమన మున తత్ప్రాంతమున వసంత మలముకొన్నది రంభాద్యప్సరోగణము మహర్షులను సమీపింప జాలక కొంతదూరమునుండియే ఆటపాటల విలాస ములుజూపెను. జలక్రీడలుసలిపెను. సూర్యాస్తమయమైనది. చిమ్మచీకటు లాశల నలముకొన్నవి. చంద్రోదయమైనది మహర్షులు చలింపలేదు అప్స రసలు వ్యర్థప్రయత్నులయి వచ్చినజాడంజనిరి. తెల్లవారినది. రమాజాని ప్రత్యక్షముకాకపోవుటనుగూర్చి మహర్షులు చింతింపగా నాకాశవాణిగా "ఘటికాద్రి కరుగుడు, అచట ఘటికామాత్రమున మీకు కాంక్షితమెల్లను ఘటియిల్లు"నని వినబడినది. ఆమాటమీద మహర్షులు బయలుదేరి గంగా స్నానముచేసికొని,జగన్నాథుని సేవించి, శ్రీకాకుళాంధ్రదేవుని పూజించుకొని కృష్ణవేణియందు కృతావగాహులై, తిరుపతి చేరుకొని తన్మయులై అట సంచరించి. కాంచికాపురముచేరి వరదరాజులను కొలిచి, మూడుయోజ నములు పయనించి ఘటికాచలము చేరుకొనిరి. వీరు పోవునప్పటికే అచట కొందరుమునులు తపించుచుండిరి వారితపస్సుగూర్చి సప్తర్షులు వారిని ప్రశ్నించిరి. "కృతయుగమున సప్తర్షులు ఘటికాచలమున తపమాచరించి శ్రీహరిని దర్శింతురు. మీరును హరినప్పుడే చూడగలరు. అచటికే పొండని ఆకాశవాణి చెప్పగా తామచటికివచ్చి యున్నాము" అని ఆ మునులు సప్తర్షులకు సమాధానము చెప్పిరి ఆపిమ్మట అందరును శ్రీహరిగూర్చితపము చేయగా నరసింహదేవుడై ఆయన ప్రత్యక్షమాయెను. వారు నృసింహుని స్తుతించిరి. - ఇది ద్వితీయాశ్వాసము.

నారదుడు భృగువునకు మరల ఇట్లుచెప్ప మొదలుపెట్టెను. ఆ ముని పుంగవు లానరసింహాకృతిని చూడజాలక శాంతాకారమున కనిపింపవలసి నదిగా ప్రార్థించిరి. వెంటనే విమానమొకటి కన్పించినది. అందుప్రమథ వైభముతో నున్న ప్రసవాయుధవైరిని మరియు సౌమ్యాకారముననిల్చిన శ్రీనరసింహదేవునిచూచిరి. స్తుతించిరి. అంత వరమేశ్వరుడు తానుప్రహ్లాదుని రక్షించిన విధముచెప్పి వారిని వరములు కోరుకొండనెను. మూడుయోజ నములదాక నిగ్గిరిమీద ఝురులు, దీర్ఘికలు, ఏరులు, మడువులు, మోక్షద ములు కావలెననియు, ఇందు జనులకు శాంతిదాంతులతోడి ధర్మబుద్ధి కలుగ వలెననియు, మృగములన్యోన్యమైత్రి నుండవలెననియు, శబర యవన పుళిందాదిజనములు జ్ఞాన వైరాగ్య ధర్మచిత్తులు కావలెననియు, నెలకు మూడు వానలతో ధరణి సస్యసమృద్ధము కావలెననియు, సర్వజనులు

సుఖముండవలయు ననియును ఋషులు కోరిరి. శ్రీనృసింహ దేవు డన్నే అన్నింటిని కరుణించెను.

ఆటుతరువాత వైఖానసులు ఘటికాద్రికి అజుదువం పగావచ్చి అమృతఫల సరస్సునను భక్తోచితసరస్సునను స్నానముచేసి శ్రీహరి నావాహనము గావించి పూజించిరి. అని నారదుడుచెప్పగా భృగువు శ్రీహరివిషయమున ఆవాహనము ఉద్వాసము ఎట్లని యడిగెను. శమీగర్భమున అగ్నియున్నట్లు శ్రీహరి సమస్తమునకు నంతరాత్ముడుగా నుండుటవలన నని నారదుడు చెప్పెను. మరల భృగువు వైఖానసు లెవ్వరని యడుగగా బ్రహ్మవీర్యజనితుడయిన విఖనసుని సంతానము వైఖానసులనియు వారు సమస్తమంత్రార్థ రహస్యనిధులు అని నారదుడు చెప్పెను. పంచబేరార్చనతెర గెట్టిదని భృగు డడుగగా నారదుడుచెప్పెను. ఆతరువాత ఒకనాడు వైఖానసులు వసిష్ఠుని వలన ఘటికాద్రిని నివసించుట శ్రేస్సయని విని అది విషమప్రదేశముగా నున్నందున సమతలముగా చేయుటకావలెనని శ్రీనరసింహదేవుని ప్రార్థించిరి ఆయన ఆంజనేయుని తలంచెను. ఆయన వచ్చి శ్రీహరి ముందు నిలచెను. ఈభూమిని సమతలముగాజేసి నివాసయోగ్యమగు నట్లొనరింపుమని భగవంతు డాదేశించెను. హనుమంతు డాపనిజేసి ఒక గ్రామము నచట ఏర్పాటుచేసెను దానికి హనుమద్గ్రామమని పేరు. వైఖానసులా గ్రామమున శ్రీనృసింహస్వామికి కల్యాణమహోత్సవముచేసిరి. ఆయుత్సవమునకు దేవతలు వచ్చిరి. భూలోకమునయందలి రాజులందరునువచ్చిరి. ఇందిరానరసింహుల పరిణయమహోత్సవము తొమ్మిదిరోజులపాటుజరిగినది అప్పటినుండి వైఖానసులల్లే ఆనృసింహస్వామిని సేవించుచున్నారు. ఆయనసుఖాబ్ధినోలలాడుచు భక్తాభీష్టముల దీర్చుచున్నాడు. అదిఅల్లే ఎల్లకాలమునుసాగును అని నారదుడు చెప్పగా విని భృగువు సుకృతినైతినని నారదుని నుతించెను. ఇది మూడవ యాశ్వాసము. గ్రంథము ముగిసినది.

## 13. సంస్కృత ఘటికాచలమాహాత్మ్యము :

బ్రహ్మకైవర్తపురాణము, ఉత్తరఖండమునగల భృగు పరాశర సంవాదమున ఇరువది రెండధ్యాయములుగా పదునెనిమిదివందల యెనుబదియారు శ్లోకములతో నొక ఘటికాచలమాహాత్మ్యమున్నది.* కాని అది

* ఈ సంస్కృత మూలమును మొదటనాదృష్టికితెచ్చి ఎప్పుడో 88 సంవత్సరముల క్రితము విక్రమసం॥న ముద్రింపబడినదానిని సంపాదించి నాకందజేసినది శ్రీ బి. రామరాజుగారు. శ్రీఘటికా: శ్రీఘటికాచలమాహాత్మ్యమ్. సంస్కృతము.

రామకృష్ణుని ఈ తెలుగుకృతికి మూలమనిచెప్పదగినట్లుగా లేదు. ఘటికా చలమున వేంచేసియున్న దైవము నృసింహుడగుటయందును హనుమంతునితో నాస్థలమునకు కించిత్తు సంబంధ ముండుటయందును మాత్రమే రామకృష్ణునికృతి పురాణముతో సంవదించుచున్నది. ఇంతకుమించి మరియే యితరవిషయములందను రామకృష్ణుని మౌలికత నాపురాణముతగ్గించుట లేదు. మరియు పురాణము భృగు పరాశర సంవాదము ఈకృతి భృగు నారద సంవాదము. సాధు సమాగమమాహాత్మ్యమున కుదాహరణముగా రామకృష్ణుడు ప్రథమాశ్వాసమున చెప్పిన ధవళాంగునికథ పురాణమున లేదు. అసలు ధవళాంగుని పేరే అందులేదు. నారదునిపూర్వజన్మ వృత్తాంతముకాని సప్తసంయముల తపోభంగవిషయముగాని ఆపురాణమునలేవు. ఒక్క నారదుని జన్మవృత్తాంతముతప్ప మిగిలిన యంశములను రామకృష్ణుడీ ఫలానామూలనుండి గ్రహించినట్లు చెప్పుట కాస్కారములేమిని* ఆయన కల్పనములుగనే వానినిగూర్చి చెప్పవలయును. వేంకటగిరీంద్రుడు చెప్పినదే నిజముకావచ్చును. ఘటికాచలమని ఆకొండకు - క్షేత్రమునకు పేరువచ్చుటకు చెప్పబడిన హేతువు రామకృష్ణుని కృతియందును 1 ఈ బ్రహ్మ కైవర్తపురాణమునందును ఒకవిధముగ నేకలదు.

"ప్రకృత్యా ఘటికా మేకాం
కుర్వంతాం తపఉత్తమం
వామదేవ ముఖర్షీణాం
ముక్తయేవ నృకేసరీ."

"యతో హేమశిలా వృక్షే
హరిరావిర్బభూవహ
ఘటికాతోషిత స్తస్మాత్
ఘటికాచలనామభాక్." 2

---

* ఈ ఘటికాచలమాహాత్మ్యచరిత్ర "నిఖిలపురాణేతిహాస విఖ్యాతంబు" అని ఫలశ్రుతిలో చెప్పినాడే కాని ఆ పురాణేతిహాసములు ఫలానా అని యనలేదు. చూడు. ఘటికా 3—68.

1. ఘటికా 2—232, 237.
2. శ్రీఘటికా. అధ్యా 22. శ్లో. 9. 10. పుట 110.

## III

### 14. మాహాత్మ్యప్రక్రియా వైలక్షణ్యము :-

ఇతిహాసము, పురాణము, కావ్యము రూపకము, ఉదాహరణము, ప్రబంధము, శతకము, కథాకావ్యము ఇత్యాది వివిధములైన కావ్యప్రక్రియలలో మాహాత్మ్యమును[1] ఒకటి ఇది పూర్తిగా పురాణేతిహాసములలోని మాహాత్మ్యవృత్తాంతముల నాధారము చేసికొని తెనుగున నొక స్వతంత్ర కావ్యప్రక్రియగా నవతరించినది ఎఱ్ఱాప్రెగడకృతమైన నృసింహపురాణము తెనుగులోని మొదటిమాహాత్మ్యగ్రంథ మన నంతగా వీలుకానప్పటికిని తచ్ఛాయాన్వయిని అని మాత్రము చెప్పవచ్చును. మాహాత్మ్యప్రక్రియను గ్రంథనామమునుబట్టియే గుర్తించునట్లు సంపూర్ణాకృతి కల్పించు ప్రయత్నముచేసినది శ్రీనాథుడు. శివరాత్రి మాహాత్మ్యమే కాక భీమఖండ కాశీఖండములును మాహాత్మ్యములనియే చెప్పదగియున్నవి. ఈ మాహాత్మ్యప్రక్రియను తరువాత నెమ్మదిగా శ్రీరంగమాహాత్మ్యమును వ్రాసి భైరవుడు, శ్రీకాళహస్తీశ్వరమాహాత్మ్యమును వ్రాసి ధూర్జటి, పాండురంగ, ఘటికాచలమాహాత్మ్యములను వ్రాసి తెనాలిరామకృష్ణుడు క్రమముగా పుష్టివర్ధనము చేసినారు. ఆ పిమ్మటివారి కీప్రక్రియారచనావిధానము కొట్టినపిండియై చాల మాహాత్మ్యగ్రంథములు వెలసినవి.

మాహాత్మ్యగ్రంథములందు వస్తువైవిధ్యమును కలదు. ముఖ్యముగా స్థల, దైవ, తీర్థ మాహాత్మ్యములు వ్యస్తముగాగాని కలగాపులముగాగాని ఈప్రక్రియకు ఇతివృత్తములగుచుండును. ఇవికాక మరియు ననేకములు మాహాత్మ్యములు గలవియు నితివృత్తములగును. అనగా పురాణప్రసిద్ధములయిన మంత్ర మాహాత్మ్యములు - మాస మాహాత్మ్యములు - వారమాహాత్మ్యములు- పర్వదినమాహాత్మ్యములు-భగవద్వస్తు మాహాత్మ్యములు-భగవద్భక్తజనమాహాత్మ్యములు-ఈమొదలైన వస్తుజాతమెల్లను ఈప్రక్రియకు కథావస్తువే. శ్రీనాథునిశివరాత్రిమాహాత్మ్యము పర్వదినమాహాత్మ్యము కార్తీకమాఘమాహాత్మ్యములు మాసమాహాత్మ్యములు. సోమవారమాహాత్మ్యము వారమాహాత్మ్యము. ఉద్భటారాధ్యచరిత్రము భగద్వవస్తు మాహాత్మ్యము. స్థల, దైవ, తీర్థ, మాహాత్మ్యములు మూడునుకలది పాండురంగమాహాత్మ్యము. రామకృష్ణుని చేతిలో నీప్రక్రియ చేరవలసిన

1. దీనిని స్థలపురాణమనుటయు కలదు.

స్థాయికిచేరినది. ఘటికాచలమాహాత్మ్యము స్థలమాహాత్మ్యము, పద్మపురాణము ఉత్తరఖండమునబహుతీర్థ మాహాత్మ్యకథనముతోపాటు శ్రీభగవద్గీతామాహాత్మ్యమునుకలదు. పురాణేతిహాసములయందు కొన్నికథలచివర ఫలశ్రుతి చెప్పుటయున్నది కదా! అది దాని మాహాత్మ్యకథనమే. భగవద్వస్తువులన్నవానిలో సాలగ్రామములు - రుద్రాక్షలు - భస్మము - తులసి ఈమొదలైన సమస్తమును చేరును. ఈ విధముగా ఈమాహాత్మ్యప్రక్రియ వస్తుబాహుళ్యముచేత విరివిగా కన్పించుచున్నది. వస్తుబాహుళ్య మింత యున్నను స్థల, దైవ, తీర్థ మాహాత్మ్యములే ఎక్కువగా కావ్యవస్తుయోగ్యతకలవి.

మాహాత్మ్యప్రక్రియకు సూత్రాత్మయగుభావ మాయాస్థలములు, ఆయాతీర్థములు అత్యంతము మోక్షప్రదములనియు, ఆయాదైవతములు భక్తసులభములనియును, ఈ ప్రధానభావము ననేకకథలచేత ప్రపంచించి చూపుటలో గ్రంథము పెరుగును ఈప్రక్రియయొక్క పరమప్రయోజనము మోక్షమునకు సులభమార్గముగా భగవద్భక్తిని ఆకర్షవంతముగాచూపి ప్రచారముచేయుటయే ఇందులో కవి ఎంతకవితాశక్తి చూపినను అది భగవద్భక్తికి లొంగియుండవలయునే కాని అతిశయించరాదు కమ్మర్షియల్ ఆర్టులో ఆర్టుకుఎంతప్రాధాన్యమో మాహాత్మ్యకావ్యములలో కావ్యత్వమున కంతమాత్రమేయుండును ప్రాధాన్యము కమ్మర్షియల్ ఆర్టు, ఆర్టు అయినట్లే మాహాత్మ్యగ్రంథములును ప్రబంధములు, కావ్యములు నగుచున్నవి. ఈప్రక్రియారచనకు భక్త్యావేశమే ప్రధానకారణము. భక్తి, శివవిష్ణుభేదముచేత స్థూలముగా ద్వివిధాభూతముగానున్నందున మాహాత్మ్యములలో శివమాహాత్మ్యములుకొన్ని విష్ణుమాహాత్మ్యములు కొన్ని వైష్ణవమాహాత్మ్యములే యెక్కువ. శ్రీ మహావిష్ణువునకున్న అవతారవైశిష్ట్యము శివునకు లేకపోవుట అందుకొకకారణము కావచ్చును. గ్రంథమే మాహాత్మ్యమును చెప్పునదియైనను అందలి కథలన్నియును ఆయామాహాత్మ్యవిషయనిరూపణములయందు పర్యవసానముకలవి కావలయును. నదీనదములు సముద్రమున కెక్కినట్లు మాహాత్మ్యగ్రంథములయందలి కథ లన్నియును ఆయా దైవతముల యొక్కయో, తీర్థములయొక్కయో, స్థలముల యొక్కయో మాహాత్మ్యమును ప్రకటించి సార్థకము కావలెను. సరిగా నున్నచో మాహాత్మ్యప్రక్రియ యిట్లుండవలయును కవితాశక్తి ఎక్కువై భక్తిభావము చిక్కిపోయినపుడు మాహాత్మ్యగ్రంథము రక్తి చెడిపోవును. కవి తలపెట్టినపని సక్రమముగా చేయజాలని వాడగును రక్తి చెడిన

మాహాత్మ్య గ్రంథములు ప్రబంధ కవితా విలాస మహనీయములను ప్రశంసకు నిజమున కర్హములు కావు. ఈ మాట ఎందుకు చెప్పబడు చున్నదనగా నిబిడబంధముగల మాహాత్మ్య గ్రంథములు చాల తక్కువ. మహాకవుల కోటిలోని వారు రచించినవే చాల చోట్ల శిథిల బంధములై యున్నవి ఇక సాధారణుల మాట చెప్పనే అక్కరలేదు.

15. రామకృష్ణుని కథా నిర్మాణ కౌశల్యము :

వైష్ణవమహాత్మ్యమునుచెప్పి విష్ణుపారమ్యమును తాత్పర్యభూతముగా ప్రతిపాదింప నుద్దేశించిన ఘటికాచలమాహాత్మ్యమును భృగు నారద సంవాదరూపమున వెలయించుటను భావించుటయందు రామకృష్ణుని బుద్ధి వైభవము ప్రకాశించుచున్నది. భృగు నారదుల సమావేశ మాయా పురాణములం దెచ్చటను కానవచ్చుటలేదు. బ్రహ్మవిష్ణు మహేశ్వరులను మువ్వురను పరీక్షించి విష్ణువుయొక్క ఆధిక్యమును ప్రకటించినవాడు భృగువు[1]. మోక్షప్రదాత శ్రీమహావిష్ణువేనన్న దృఢవిశ్వాస మతనికి కలదు తాను స్వయముగా పరీక్షించి తెలిసికొన్నవాడుగనుక మహావిష్ణువునం దాతనికి ప్రత్యయబుద్ధి యుండుట సహజము. అట్టివానిని విష్ణుమాహాత్మ్యకథా శ్రవణమునకు శ్రోతగానెన్నుకొనుట ఎంతయుప్రశంసింపదగినదిగానున్నది. శ్రోత ఇంతవైష్ణవభక్తిప్రపత్తులు కలవాడు. ఇక వక్త ఎట్టివాడు కావలయును? శ్రోతకంటె తప్పనిసరిగా విష్ణు విషయవిజ్ఞానమున అత్యధికుడు కావలయును. అట్టివాడెవడుకలడు ?

నారదునకు వైష్ణవముతో మొదటినుండియు సంబంధముగలదు. వాసుదేవుని చుట్టుకొని యున్నదనజడిన ఏకాంతికధర్మమార్గమున మొదటి "పరమైకాంతి" నారదుడు[2]. వానిఏకాంతికభక్తి నిరతికి నెఱి ప్రత్యక్షమైన విష్ణువు స్వాత్మతత్త్వమును ఉపదేశించినాడు.[3] ఆ విష్ణుని దివ్యవాక్య వితతిని విశ్వజ్జనములకు వినిపించుచు నారదుడు సంచారముచేసినాడు. శ్రీవైష్ణవుల కాగమమైన పాంచరాత్రమును శ్రీమన్నారాయణముఖ నిర్గతామృతమును, మొదటగ్రోలినది నారదుడే. ఆయనయే దానిని లోకమున కందించినాడు. శ్రీ వాసుదేవ పరబ్రహ్మమును వహించిననారదుడు. శ్రీ మహాభాగవతమునకు వ్యాసుని ప్రేరేపించినవాడు. అంతకుమునుపే వాల్మీ

(1) పూర్వగాథాలహరి పుట, 349.

1. భారతము శాంతిపర్వము 6–358,

2. ,, ,, 6–381 నుండి 388.

కికి శ్రీరామమహాత్మ్యమును జెప్పి రామాయణరచనకు పునాదిసిద్ధము చేసిన వాడు. మరియు వైష్ణవమున ప్రధానమైన భక్తిభావమును శాస్త్రీయ ముగా సూత్రబద్ధముగావించిన మహానుభావుడాయన, అట్టివాడు ఈ ఘటి కాచలమహాత్మ్యమునకువక్తగానుండుటయెంతయుసముచితముగానున్నది. ఈపని రామకృష్ణుడేగనుక చేసియున్నచో నిజముగా నతడు మహాబుద్ధిమదగ్ర గణ్యుడని చెప్పవలయును.

శ్రీమహావిష్ణువుయొక్క అర్చావతారవిగ్రహములు స్థానక, ఆసన, శయన మహితాకృతులుగా నుండును. ఈయాకృతిత్రయము తిరిగి ఒక్కొ క్కటి యోగ, భోగ, వీర, అభిచారికా భేదముచేత నాల్గువిధములు, ఈ యన్నిభేదములలోను పార్శ్వస్థితులుగా కొన్నింట భృగునారదులకు స్థాన మున్నది యోగస్వరూపుడయి విష్ణువు స్థానకమునగాని, ఆసనమునగాని ఉన్నపుడు భృగువు పార్శ్వమున నుండును భృగు నారదు లిరువురును కలిసియుండుట భోగ స్వరూపుడు విష్ణువు స్థానకమున (అనగానిలబడి) ఉన్నచో కుదురును ఈఘటికాచలమహాత్మ్యమున సింగపెరుమాళ్ యోగీశ్వ రేశ్వరుడు. మరి రామకృష్ణుడు భృగునారదులనుకలుపుట విశేషము. అందును యోగనరసింహుని మహాత్మ్యమును భృగువునకు నారదుడు చెప్పుట విశేషము యోగమూర్తిప్రక్కన నారదుడుండువాడుకాడు[1].

## నారదుని పూర్వజన్మ వృత్తాంతము

నారదుని పూర్వజన్మముల విషయము వరాహపురాణమునందును[2] భాగవతమునందును బ్రహ్మవైవర్తపురాణమునందును కలదు వరాహ పురాణము నందున్న సారస్వతుడనుపేరి బ్రాహ్మణుడగు నారదుని జన్మమంతవిశేషమైనది కాదు కొంతకాలము సంసారముచేసినాడు.పిల్లలను కనినాడు. సంసారము నుజ్జగించి శ్రీమహావిష్ణువునుగూర్చి సాయుజ్యము నకై తపించినాడు. బ్రహ్మ తనయుడవై పుట్టినగాని నీకది లభ్యముకాదని మహావిష్ణువనినాడు. ఇది విశేషము గానికథ.

నారదు డొకప్పుడు బ్రాహ్మణులయింట పనిపాటలుచేసి బ్రతుకువానికి తనయుడై పుట్టినాడన్నచో అది విశేషవిషయము శ్రీమద్భాగవతపురాణ

1. A Hand book of South Indian Images. Page: 41.
2. పూర్వగాథాలహరి పుట. 269.

మా విషయమును చెప్పుచున్నది.[1] రామకృష్ణుడుగ్రహించినదియు నదియే. తనబుద్ధి వైభవముననుసరించి ఆ మూలకథను కూర్పులతోడను మార్పులతోడను తనకు కావలసిన ట్లాయనదిద్దుకొనినాడు

(1) భాగవతమున నారదుడు దాసీపుత్రుడనిమాత్రమే యున్నది. తండ్రివిషయ మందులేనిది రామకృష్ణుడు సమకూర్చినాడు.

(2) వర్ష శరదృతువుల(చాతుర్మాస్య) వ్రతదీక్షితులయిన మహర్షులను దాసీపుత్రుడయిననారదుడు సేవించినట్లు భాగవతముననున్నది. రామకృష్ణుడు శరదృతువుసంగతి చెప్పలేదు.

(3) రాత్రిపూట పాలుపితుకపోవగా కాలిక్రిందపడినపాము కాటువేయుటచే నారదుని తల్లి మరణించినదన్న భాగవతము నూరకదైవకృతము క్రింద రామకృష్ణుడు మార్చినాడు.

(4) తల్లి చనిపోయినతరువాత నారదు డుత్తరాభిముఖుడై ప్రస్థానము చేసినట్లు భాగవతమున నుండగా ఘటికాద్రినిచేరి హరినిగూర్చి తపమొనరించినాడని రామకృష్ణుడు చెప్పినాడు.

(5) హరి నారదునితపస్సునకుమెచ్చి వాని హృదంతరమునతోచి పలికి నట్లు భాగవతమునందున్నదానిని గరుడారూఢుడై శౌరిప్రత్యక్షమైనట్లు రామకృష్ణుడుమార్చినాడు.

(6) ప్రారబ్ధము నశించి దేహము పతనమగువరకు నారదుడు వేచియున్నట్లు భాగవతము యోగసంగతిని అప్పుడే ఆయన శరీరమును విసర్జించినాడని రామకృష్ణుడు.

బ్రహ్మవైవర్తపురాణమునందలికథగూడ విశేషమైనదిగనే యున్నది[2] బ్రహ్మ తనకంఠప్రదేశమునుండి నారదుని బుట్టించి ప్రపంచమున జనులను సృజింపు మనెను నారదు డంగీకరింపలేదు. బ్రహ్మకు కోపమువచ్చినది. నీవు నామాటవినక జ్ఞానవైరాగ్యములను వివరించుచున్నావు గనుక వాటిని వదలి స్త్రీలోలత్వమునబడి తిరుగుదువుగాక అనిశపించెను. శాపమును

1. ప్రథమస్కం. 76-95. సప్తమస్కం. 472-476

2. అష్టాదశపురాణసారము. రెండవభాగము. పుటలు 79-93.

క్రమ్మరింపవలసినదిగా నారదుడు ప్రార్థించినాడు. దాని మీదట బ్రహ్మ కరుణించి ఉపబర్హణుడను గంధర్వుడై పుట్టి స్త్రీలోలుడవై, ఆపిమ్మట దాసీ పుత్రుడవై పుట్టి విష్ణుభక్తుడవై, కాయముత్యజించి, నాకుతనయుడవై పుట్ట గలవులెమ్మనెను అంత నారదుడు బ్రహ్మమాటప్రకారము క్రమముగా కన్యాకుబ్జమున దాసీపుత్రుడుగాపుట్టెను. ఆ పట్టణము నేలురాజు ద్రుమి లుడు. వానిభార్య కళావతి. వారికి పిల్లలులేరు. కాశ్యపుని వీర్యము ధరించి ఆమె గర్భవతియైనది రాజువిరక్తుడై భార్య నొక బ్రాహ్మణు నింట దిగవిడిచి తాను తపస్సుచేయబోయి కొంతకాలమునకు మరణిం చెను ఆతరువాత నామెకు నారదుడు పూర్వజన్మజ్ఞానముతోపుట్టి శ్రీహరిని ధ్యానించుచు కాలముగడుపుచుండెను అతడు వర్షములు లేనికాలమున పుట్టెను పుట్టగానే వానలుకురిసినవి. అందుకే నారదు డనబడినాడు. ఆ వర్షపుదినములలో తామున్న బ్రాహ్మణునియింటికి నలుగురు బ్రాహ్మ ణులువచ్చిరి. వారిభోజనములయినతరువాత వారి యెంగిలి నాబాలుడు (నారదుడు)తినెను. వారు సంతోషించి వానికి శ్రీకృష్ణమంత్రము నుపదే శించిరి. ఆపిమ్మట వానితల్లి పాముకాటున మరణించినది. నారదు డా బ్రాహ్మణుల వెంటబడిపోయి అడవులలో తపించి శ్రీహరిని ఆత్మయందు దర్శించి దేహత్యాగముచేసి బ్రహ్మలో లీనమయ్యెను ఇది పురాణముచం దలి నారదునిజన్మవృత్తాంతము ఇదికొద్దిగా భాగవతముతో సంవదించు చున్నది. ఇందులోని చాలవిషయములు తనకక్కరలేకపోవుటచేత రామ కృష్ణుడు త్యజించినాడు. నారదుని పూర్వజన్మకథను వ్రాయుటకు రామ కృష్ణుడు ఈబ్రహ్మవైవర్తపురాణముదాక రానక్కరలేదు వానికి భాగ వతముచాలును. అసలు నారదునికథ ఎందుకు ప్రసక్తమైనదో ఆ సాధుసం గమశుభవిషయముకూడ భాగవతములోనున్నది [1]. అదియే సత్సంగప్రశస్తి శ్రీకృష్ణుడు ఉద్ధవునకు చెప్పినాడు సత్పురుషులనగా భాగవతులు ధవ ళాంగునికథలో వసిష్ఠుడు భాగవతుడు. ఈనారదునికథలో గోవిందశర్మ భాగవతుడు. కౌండిన్యుడు భాగవతుడు. గోవిందశర్మయొక్క దైనందిన చర్యయు, కౌండిన్యునిమర్యాదచేయుటయు (2-47-48) పరమభాగవత లక్షణములు. భాగవతమట్లు ప్రశంసించినది.[2]

ఈవిధముగా నాయాపురాణములలోగల నారదపూర్వజన్మవృత్తాంత మును గ్రహించి తనయుద్దేశించినఫలమును సాధించిపెట్టునట్లుగా నాకథను రామకృష్ణుడు నిర్మించుకొనినాడు.

---

1, ఏకాదశస్కంధము. అధ్యాయము. 12.

2. ఏకాదశస్కంధము, 103. అవనము.

పురాణములనుండి వలసినవిషయమును పరిగ్రహించినట్లుగనే రామకృష్ణుడుద్రావిడప్రబంధవాఙ్మయమునుండియు కొంతవిషయముగ్రహించి ఈ మాహాత్మ్యగ్రంథమున కథానిర్మాణముగావించినట్లుకనిపించుచున్నది. తాళ్ళపాక తిరువేంగళనాథుడు రచించిన పరమయోగివిలాసము ఆళ్వారులయొక్కయు యామునాచార్యాది వైష్ణవప్రవక్తలయొక్కయు దివ్యచారిత్రములను వర్ణించు గ్రంథము అది దాదాపురామకృష్ణుని సమకాలపు రచన అది ద్రవిడ ప్రబంధముచూచి తెనుగున వ్రాయబడినది. ఆ గ్రంథముచూచినచో రామకృష్ణుడు ద్రావిడప్రబంధవాఙ్మయము నెంతగా నుపయోగించుకొనినాడో తెలియును.

భృగువు నారదుని నీవుచూచిన ఆ కమలాధిపలీలావాసములనుగూర్చి వివరించిచెప్పు మని యడుగుట(1-19,27) పరమయోగివిలాసమున గోదాదేవి తనతండ్రిని విష్ణుని అర్చావతారనిలయములనుగూర్చి యడుగుటను (పుట 321) పోలియున్నది. ఆప్రశ్నకుసమాధానముగా ఆమెతండ్రి నూటయెనిమిది తిరుపతులనుగూర్చి చెప్పినట్లుగానే ఇందు నారదుడును నూటయెనిమిదగుతిరుపతులనుగూర్చి చెప్పెను. ఆనూటయెనిమిదితిరుపతులలో నొకటి ఘటికాచలము

ఈ నూటయెనిమిదితిరుపతుల వర్ణన ముగియువరకు అనగా ప్రథమాశ్వాసమునడెబ్బది పద్యములవరకు పరమయోగివిలాసమునో దానికిమూలమైనద్రవిడప్రబంధవాఙ్మయమునో రామకృష్ణుడువినియోగించుకొనియుండునని చెప్పవచ్చును.

మరియు పరమయోగివిలాసమున వైకుంఠ మహిమాభివర్ణనమునున్నది. ఆవర్ణనముతోడనే ఆగ్రంథముమొదలగుచున్నది. రామకృష్ణుడు తానును ఈ ఘటికాచలమాహాత్మ్యమున క్షీరాబ్ధిని-శ్వేతద్వీపమును - వైకుంఠమునువర్ణించినాడు. ఈవర్ణనములుచేయుట కాగ్రంథమును రామకృష్ణుడు చూడనక్కరలేదు. ఎఱ్ఱాప్రెగడ రచించిన నృసింహపురాణమునందును ఆయా వర్ణనములున్నవి రామకృష్ణుడు దేనినిబట్టి తానట్లుకల్పించుటకు నాలోచించినదియు మనము చెప్పలేము. ఆయన సొంతముగానే ఆపని చేసియుండవచ్చును పరమయోగివిలాసము నెత్తుటయేలనగా రామకృష్ణుని భావము లొకటిరెండు ఆగ్రంథముతో సంవదించుచున్నవి. ఆదిశేషుని గూర్చి "నునుగాలిదూదిపానుపు" (1-25) అని రామకృష్ణుడనెను "నెరయ తెమ్మెరదూదినించిచూపట్టుపరపు" అని పరమయోగివిలాసమున(పుట 101) కలదు.

ముఖ్యముగా దివ్యతిరుపతులు నూటయెనిమిదింటి వర్ణనము విషయ మున పరమయోగివిలాసము స్మరణమునకు వచ్చుచున్నను, నాలాయిర ప్రబంధమునే రామకృష్ణు డుపయోగించుకొని యుండునని చెప్పుటయే ధర్మము. శ్రీమద్రామానుజు లీక్షేత్రములను పరమపవిత్రములుగా భావించి దర్శించిన తరువాత శ్రీవైష్ణవుల కివి మరియు సేవ్యము లయినవి అందు వలన రామకృష్ణుడు ద్రావిడ ప్రబంధమునుండి గ్రహించి నూటయెనిమిది తిరుపతులను వర్ణించినాడు. ఆవర్ణనమువలన తనగ్రంథమునకు వైష్ణవ గౌరవ మధికమగునుకనుక చేసినాడు.

ఇక రామకృష్ణుడు కథానిర్మాణావసరమున కల్పించిన విశేషముల నీవిధముగా పేర్కొనవచ్చును.

(1) ఘటికాచలము మహిమాభివర్ణనము, సాధుజనసంగఫలవిశేష మున కైన ధవళాంగునికథ రామకృష్ణుడు స్వయముగా కల్పించినట్లు కన్పించుచున్నవి.

(2) నారదుని పూర్వజన్మవృత్తాంతమును పురాణముల నుండి సంగ్ర హించి దానికి ముందువెనుకలను తాను కల్పించినాడు. గోవిందశర్మ - హరిశర్మ - రామకృష్ణుడు సృష్టించినవారే.

(3) సప్తమహర్షులకు ఘటికాచలముతో సంబంధము రామకృష్ణుడు కల్పింప నవసరములేకుండగనే సిద్ధమైయున్నది. వారు శతశృంగమున తపస్సుచేయుట - తపోభంగముచేయుటకు రంభాదులువచ్చుట మొదలైన కథ కల్పింప బడినది. ఈకల్పనకు మూలాధారము అక్కరలేదు.

(4) శతశృంగమునుండి ఘటికాచలమునకుపోవు సప్తసంయముల మార్గగతినిచెప్పుచున్నట్లు ఇతరవిషయములతో గ్రంథమును నింపుకొను టయు రామకృష్ణునిసొంతమే.

(5) వైఖానసులవిషయముకూడ రామకృష్ణుని స్వతంత్రకల్పనమే. వారివలననేస్వామిఅర్చనజరుగుచున్నది. వారినందుకుతీసుకొనివచ్చినాడు.

ఈవిధముగా రామకృష్ణుడు ఈఘటికాచలమాహాత్మ్యమునందలి కథావస్తువును కొంతకొన్నిపూర్వగ్రంథములనుండిగ్రహించియు,మరికొంత తాను తనఉపజ్ఞచేత కల్పించియు ఇంకకొంతను వర్ణనలచేత నింపియు మొత్తముమీద రూపుగట్టించినాడు.

## 16. రామకృష్ణుని కథాకల్పనమున యందౌచిత్యము :

(1) సాధు సంగమ శ్రీవర వైభవమున కుదాహరణముగా రెండు కథలు చెప్పబడినవి. ఒకటి ధవళాంగుని కథ. రెండు నారదుని పూర్వజన్మ కథ. మొదటికథలో సందర్భ శుద్ధి లేదు. ఎప్పుడో విశ్వామిత్రుడిచ్చిన శాపము ఫలితముగా నొకనాడు హఠాత్తుగా కొలువు చేసిన ధవళాంగుడు కిరాతుడగుట అంతగా పొసగియున్నట్లు కానరాదు. కిరాతుడయిన ధవళాంగుడు వసిష్ఠుని ఆశ్రమమున కరిగినందున సాధుసమాగమము సిద్ధించినది. కిరాత రూపము పోయినది తుదియున్నంత సరిగా మొదలులేదు ఈ సందర్భమున గ్రంథపాతము గలిగియుండునని శ్రీ దొరసామిశర్మగారు సంశయించుచున్నారు [1] కాని సంశయించుటకు తాళపత్ర ప్రతి చోటిచ్చుట లేదు

రెండవదైన నారదుని జన్మకథ సాధు సంగమము వైభవమును తెన్నగా కీర్తించుచున్నది. నారదుని కథతో గోవింద శర్మ కేమిసంబంధము? పైకంతగా కనిపించదుగాని లోపలయున్నది. గోవిందశర్మయింట ఉనికియే నారదుని భావ్యభివృద్ధికి మూలము గోవిందశర్మ హరిసేవా తత్పరుడు, ధార్మికుడును, సత్వసంపన్నుడును అగుటచేతనే కౌండిన్యుడు వారి యింట చాతుర్మాస్యము నెరపుటకు వచ్చినాడు. నారదుని తల్లి తగళ, గోవింద శర్మయింట సేవకురాలుగా నుండుటవలననే నాలుగైదు శరత్తులు నిండీనిండని నారదుడు వానియింటికి పోయివచ్చు చనవుగలవాడైనాడు గోవింద శర్మ యిల్లు వైష్ణవవాసనా వాసితమగుట వలననే నారదుని చిత్తము చిన్నతనము నుండియు నటు మొగ్గినది. కౌండిన్యుడు రెండు నెలలు మకాము చేయుటను సమర్థించుటకే వర్షాకాల వర్ణన చేయబడినది. ఆ మహర్షి రెండు మాసము లున్నాడు గనుకనే నారదుని కాతనిపట్ల చనవును, గౌరవమును, భక్తియును, మహర్షి కీతడన్న వాత్సల్యామును గాఢముగా నేర్పడుటకు వీలు కలిగినది. అట్లది కలిగినది గనుకనే నారదునకు వైష్ణవ మంత్రోపదేశము జరిగినది. అందువలననే తల్లి మరణించిన పిదప నారదుడు శ్రీ మహావిష్ణువునుగూర్చి తపించుటకు పోయినాడు ఈ నారదునకు ఇరువురు సాధువుల సమాగమము కలిగినది. గోవింద శర్మ యొక్కయు, కౌండిన్యుని యొక్కయు సాంగత్యము వలననే నారదుడు ఘటికాద్రికి పోగలుగుట, గాత్రముత్యజించి దివ్యమూర్తిని

1. భారతి సెప్టెంబరు 1955.

గ్గైకొనుట, సంభవించినవి. ఈ కథ ఎందుకొరకుద్దేశింపబడినదో ఆయుద్దేశము నంపూర్ణముగా నీడేర్చుచున్నది.

(2) సప్తర్షుల తపోభంగ ప్రయత్నము : ఋషుల తపములనుభగ్నము చేయుటకుగాను రంభాద్యప్సరసలను ప్రేరేపించుట ఇంద్రుని విషయమున సామాన్యము మాత్రమే. రంభాదులంతటను సాధారణముగా జయించుకొని వత్తురు ఇచట వచ్చినవారు సప్తర్షుల తపములకు భంగము కలిగింపజాలక పోయినారు. అనగా ఏ ప్రయోజనమాశింపబడి వారీగ్రంథమున ప్రవేశ పెట్టబడినారో వారాప్రయోజనమును సాధించి పెట్టలేదు. వారి వ్యర్థ ప్రయత్నములు సుదీర్ఘముగా వర్ణించుట వట్టి గొడ్డుతాకట్టును వలెనున్నది. కథాగమనము కుంటువడినది. ప్రాబంధికమైన వర్ణనలుచేయుట వృథా. వాచాలతకారాదు. ఇచట అట్లే అయినది.

(3) కాంచీపురవర్ణనము: ఘటికాచలమునకు బయలుదేరిన సప్తర్షులు కాంచీపురమును దర్శించిరి వసిష్ఠుడు నగర వర్ణన చేసినట్లుగా వ్రాయబడిన భాగమంత ఉచితముగాలేదు. కవి తాను స్వయముగా చేసి యుండవలసినది, వక్త వసిష్ఠుడగుటతో కొన్ని మర్యాదలు పాటింపబడవలయును. ఆయనమాటలును ఆయన యౌన్నత్యమునకు తగినవిగా నుండవలయును. ఆ వర్ణన మట్లులేదనిపించుచున్నది. పరమ భాగవతులయిన మహర్షులట్లు లౌకిక విషయము లందాసక్తులై పగులబడి పలుకుట వాంఛనీయముకాదు. ఇదియు ప్రబంధ మర్యాదకొరకు వచ్చిన నగరవర్ణనమున కవకాశము చూచుకొని చేయవలసివచ్చినది. ఆ పనిని రామకృష్ణుడు వసిష్ఠుని చేత చేయించినాడు. తాను వ్రాయుచున్న దాని తాత్పర్యమును విస్మరించినపుడిట్టివి సంభవించును.

(4) శ్రీ నరసింహదేవుడు ప్రత్యక్షమగుట : ఘటికాచలమున తపము చేసిన మహర్షులకు శ్రీ నరసింహస్వామి ప్రత్యక్షముకాగా ఋషులు శాంతాకారమున కరుణింపవలసినదిగా ప్రార్థించిరి అపుడొక విమానము కనవచ్చినది. అందు ప్రమథవైభవమున ప్రసన్నాయుధవైరి వారికి దర్శనమిచ్చెను. ఆయనతో నరసింహస్వామి. వైష్ణవక్షేత్రమునకు శివునిరప్పించుటయేగాని ప్రయోజనము వివరింపబడలేదు.

ఘటికాచలమాహాత్మ్యమునన్నున్న ఇతివృత్తమును చూడగా నది ఉండవలసినంత నిబిడముగాలేదు. ఇందున్నకథలు మూడింటిలో ధవళాంగుని సందర్భశుద్ధి లేనిదిగానున్నది. సప్తమహర్షులకథ అనవసరవిషయములతో కూడుకొనియున్నది. నారదుని జన్మకథ మేలుగానున్నది.

## 17. ఘటికాచలమాహాత్మ్యమున వర్ణనవైభవము :

కావ్యమంతయు నేదోవిధముగా వర్ణనమే అయినను ఈవర్ణనశబ్ద మొక కొన్ని అంశములకుమాత్రమే వాచకముగా రూఢమై కావ్యవిమర్శన మున ప్రవర్తించుచున్నది. విమర్శనమున ప్రవేశించుటకంటెమునుపు కావ్య లక్షణమున ప్రవేశించినది. ఏయే అంశము లాలంబనముగా వర్ణనమన్నది ప్రవర్తించునో మొదట ఆవిషయమును చెప్పినవాడు దండి[1]. క్రమముగా పదునెనిమిదినుండి ఇరువదిరెండు వరకు ఆవర్ణనలు పెరిగినవి.[2] సంస్కృ తాంధ్రకావ్యప్రబంధముల యందవి ప్రభుత్వముచేయుచు బ్రతికినవి, రాయల వారిప్రభుత్వముననే వాటి ప్రభుత్వమును స్థిరపడినది. రామకృష్ణుడా ప్రభుత్వములోనివాడు

అది యట్లున్నను మొత్తముమీదకవియన్నవానికి వర్ణనవిషయమున అభినివేశము మిగిలినవిషయములయందుకంటె ఎక్కువగానుండుట సాధార ణముగా కన్పించుచున్నది. ప్రతిభావంతులయిన మహాకవులయందే ఈఅభి నివేశ ముత్కటముగానుండుటను దర్శించిన సాహిత్యతత్త్వజ్ఞులు ఆయా వర్ణనముల లోకోత్తర చమత్కారలక్షణముచే సమాకృష్టులై తల్లక్షణ మును గుణముగానే స్వీకరించిరి. వారిది దోషమన్నను విడువజాలనిస్థితిలో నున్నకవులు, గుణముగాస్వీకరింపబడు చున్నదానిని విడువనేవిడువరుకదా ! అందువలనను కావ్యప్రబంధములయందు వర్ణనముల ప్రభుత్వము చెల్లుబడి యైనది.

రామకృష్ణుడు కథానిర్మాణమర్మజ్ఞతచేతను, రసభావపరిపోషణ ప్రాభవముచేతను, మానవమనఃప్రపంచముయొక్క నిమ్నోన్నతముల పరి జ్ఞానముచేతను మహాకవియైనవాడు కాదు.[3] ఇట్లు కాదనుట ఆయనమర్మ జ్ఞతను ఆయన ప్రాభవమును, ఆయనపరిజ్ఞానమును ఆయనకున్నదానిని కాదనుటకాదు.

ఘటికాచలమాహాత్మ్యమున కథావస్తువు విస్తారముగా లేదు, అన్ని వర్ణనలు సాంగోపాంగముగాచేయుట కవసరమైనంత విస్తారముగాకూడ లేదు. అందువలన రామకృష్ణుడు కొంత ఔచిత్యమునకు కొంత ముఖము తప్పించి తనవర్ణన వైశారద్యమునిందు ప్రకటించుకొనవలసివచ్చినది,

1. కావ్యాదర్శే ప్రథమపరిచ్ఛేదః 16, 17.

2. అప్పకవీయము 1-28.

3. తెలుగు విజ్ఞానసర్వస్వము. పుట. 1003.

దండికాని అప్పకవిగాని చెప్పిన ఆయావర్ణలములన్నియు అన్ని ప్రబంధములయందును ఉండవు. ఏమహారాజుకథయో ఇతివృత్తముగా ప్రబంధము నడుచుచున్నప్పుడే ఆ అన్నివర్ణనములకు నవకాశముకలుగును. ఇతివృత్తము అన్యులనాశ్రయించినచో కొన్నివర్ణనములు నిరవకాశములై లేనివగును. అందువలన ఆయావర్ణనములన్నియుకలదియే సలక్షణమైన మహాకావ్యమని యనరాదు. లాక్షణికులయుద్దేశ్యమును అట్లనుమనికాదు. ఈయావర్ణనాంశములను నీవు దృష్టిలోపెట్టుకొన్నచో ప్రబంధకథనల్లుకొనుటగాని ఎన్నుకొనుటగాని నీకు సులభమగును అనిచెప్పుట మాత్రమే వారియుద్దేశ్యము. కనుకనేఅప్పకవి, దండి చెప్పినపదునెనిమిదింటికి మరి నాలుగు (1) వేట (2) మౌనీంద్రపుణ్యాశ్రమము (3) కన్యాంగసౌందర్య కథనము (4) దౌహృదము తానుచేర్చినాడు. లాక్షణికుడు చెప్పిన అన్నిలక్షణము లుండుటమాత్రమే మహాకావ్యలక్షణముకాదు, ప్రబంధము నందలి ఇతివృత్తము ఎన్నివర్ణనాంశములను సహజముగాతనలోనిముడించు కొనగలదో అన్నింటినేఇముడ్చుకొని ఆరోగ్యముగానుండుటయే ప్రబంధముయొక్కగాని, కావ్యముయొక్కగాని మహత్వలక్షణము. కాని కవులబుద్ధి నిరంతరమా మహత్వముమీదనే చూపుపెట్టుకొనియుండదు. వారుకూడ మనుష్యులే కదా !

మరియు నీఘటికాచలమాహాత్మ్యమున నాయకుడులేడు. ఉన్నచో ఆయన శ్రీనరసింహస్వామియే కావలయును. ఆయన గ్రంథాంతమునగాని అసలుకనిపించడు. అందువలనమాహాత్మ్యనిరూపణమున కేర్పాటుచేసికొను కథయందే ఈ వర్ణనావకాశమును రామకృష్ణుడు చూచుకొనవలసివచ్చినది. అట్లేచూచుకొనినాడు. కొన్ని అతికినవి. మరికొన్ని అతుకలేదు.

అతికియున్నవర్ణనలు (1) అప్పకవి కలిపినవానిలో నొకటియైన మౌనీంద్రపుణ్యాశ్రమవర్ణన- ఇరొక్కటే ఈజాతిగ్రంథములయందు నప్పి గ్రంథగౌరవమునుపెంచునది గ్రంథారంభముననే రామకృష్ణుడు భృగుమహర్షి ఆశ్రమమును వర్ణించి (13-15) ఘటికాచలమాహాత్మ్యకథనమునకు భూమికపర్పాటు చేసినాడు కథాకథనము చేయు నారదుడు వైకుంఠమును, నూటయెనిమిదితిరుపతులను కీర్తించుటతో ప్రారంభించుటకూడ ఈగ్రంథతాత్పర్యమును గుబాళించు చున్నది. దివ్యక్షేత్ర వర్ణనముకూడ ఇరువదిరెండువర్ణనలకుచేరవలసియున్నది. కొందరకిదియునవసరముండును.

(2) రామకృష్ణుడు సముచితముగా ప్రవేశపెట్టి చేసిన మరొకవర్ణన వానకాలము (2.41-46) వానకాలము నారదునిజన్మకథాకథనమునకవసరము. అదివర్షాకాలముగనుకనే కౌండిన్యుడంతకాలముగోవిందశర్మయింట నున్నాడు. అతడట్లున్నాడు గనుకనే నారదునకు చనవేర్పడినది. ఆయనకు దయకలిగినది.

తరళాహరిశర్మల శృంగారభావాభివ్యక్తివర్ణన ముచిత రమణీయముగా నున్నది.

(3) అప్పకవిచెప్పిన కన్యాంగసౌందర్య వర్ణనమును రామకృష్ణుడు రంభనువర్ణించి (2-76-92) పూర్తిచేసినాడు. రంభాద్యప్సరసలు శతశృంగమునకు వచ్చునప్పటికే వసంత మచట విడిసినదనినాడే (2-101) కాని రామకృష్ణుడీఋతువునువర్ణింపలేదు (4)ఉద్యానవనవిహారము (5) జలక్రీడ, సూర్యాస్తమయము, అంధకారము, తారకలు, (6) చంద్రోదయము, వెన్నెల, వేగుజుక్క, చంద్రాస్తమయము, (7) సూర్యోదయము ఇత్యాదులన్నియు (2-103-158) మహర్షులతపోభంగముచేయు అప్సరసల కనుకూలమైన వాతావరణమును సృష్టించుటకు వర్ణించినాడు. ఇట్టిపరిస్థితిలోను ఆమహర్షులు చలింపకుండుట అది వారి ఆధిక్యము.

(8) నగరవర్ణనము చేయుటకు ధవళాంగునికథలో రామకృష్ణునకవకాశము వచ్చినది దాని నాతడు జారవిడిచినాడు. ఏదో కొద్దిపాటి కథయైనను పుట్టిన అయోధ్యను వర్ణించుట మాని ఘటికాచలమునకు పోవుచున్న మహర్షులకు త్రోవలో తగిలిన అనేక పురములలో నొకటియైన కాంచీపురమును సాంగోపాంగముగా వర్ణించుట నెందుకు పెట్టుకొనినాడో మనకు తెలియదు. బహుశః ఇదికావచ్చును. నూటయెనిమిది దివ్యతిరుపతులలో పదునాల్గు ఒక్కకాంచీపురములోనే కలవు. అన్ని దివ్యక్షేత్రముల తోడిపురము మరొకటిలేదు. అందువలన రామకృష్ణుడుదానిని ప్రత్యేకముగా ఎన్నికచేసి వర్ణించియుండవచ్చును.

(9) ఘటికాచలమాహాత్మ్యమే శైలముతోకూడినది. అదియును గాక సప్తర్షులు తిరుపతికి పోయినప్పుడు శేషశైలమునుకూడవర్ణించినాడు. (2-171)

(10) కుమారోదయమును నాయకపరముగా ఈగ్రంథమున చెప్పుట కవకాశమేలేదు. నారదుడుజన్మించుట కుమారోదయమైనచో అదియును వర్ణింపబడినట్లే.

(11) ఆలెక్కను తరళా హరిశర్మల నాలంబనముచేసి ఆయోగవిప్ర లంభముగూడ వర్ణింపబడినదని చెప్పవచ్చును

(12) తరళా-హరిశర్మలరతియు చెప్పబడినది

(13) సప్తర్షులు శతశృంగమునుండి ఘటికాచలమునకు ప్రయాణము చేయుట వర్ణింపబడినది రంభాదులు శతశృంగమునకువచ్చుటయు, తిరిగి పోవుటయు ప్రయాణముక్రింద నేవచ్చును.

(14) మహర్షుల తపస్సువిషయము దూతముఖముననేకదా ఇంద్రు డెరిగినది అందువలన దూతకూడ ఉన్నట్లె

ఈ విధముగా రామకృష్ణు డీగ్రంథమున తనవర్ణనసామర్థ్యమును ప్రదర్శించినాడు. ఆయన పూర్తిగాస్పృశింపక వదలినవర్ణనాంశములు అర్ణవము, మధుపానము, మంత్రాలోచనము ఆజి, వివాహము, వేట, దౌహ్యదము అను ఈపదుమాత్రమే అసలుగ్రంథము నాయకపురుషుడైన శ్రీనర సింహస్వామివారి కల్యాణమహోత్సవవర్ణనతో ముగిసినదిగనుక

(15) నాయకాభ్యుదయముగూడ వర్ణింపబడినదియే అనిఅర్థము.

ఈవిధముగా నిరువదిరెండుప్రబంధవర్ణనలలో పదునైదింటికింద రామకృష్ణు డవకాశము కల్పించుకొనినాడు.

ఇట్లష్టాదశవర్ణనవైభవమేగాక భగవద్వైభవవర్ణనవైభవమీగ్రంథ మున మిక్కుటముగానున్నది తదభిముఖమైనదియేగ్రంథతాత్పర్యము

రామకృష్ణుని కవితావైభవ మంతయు ఈ వర్ణనాంశములను బట్టు కొనియే విశృంఖలముగా ప్రకాశించును. రామకృష్ణు డెప్పుడును అభినవ మును అభిలషించు స్వభావము కలవాడు. వస్తువున నవ్యతలేనప్పు డాతడు ఆ ప్రాతదానిని బహువిధముల క్రొత్తగా రూపుగట్టించును. అష్టాదశవర్ణ నాంశము లెవరికైనను అవియే. అవి మార్చరానివి. వానిని రామకృష్ణుడు తనకవితాశక్తిచేత అభినవములుగా నిర్మించిచూపును. గ్రంథమున ఏవర్ణనము చూచినను అట్లేయుండును వానికావ్యరచనాకలాపమున ప్రతిపద్యమును పరమాశ్చర్యకరమైనహరువు లక్షణముకలది. అదితెలిసినచో రామకృష్ణుని తెలిసినట్లు.

## 18. పాండురంగ సుకవి పద్యంబుహారువు :

కృతిపతియైన శ్రీమహావిష్ణువు కలలోకనిపించి తనను ప్రశంసించి నట్లుగా కాకుమాని మూర్తికవి పాంచాలీపరిణయమున వ్రాసికొన్నపద్య మున ఈ పై ఆటవెలదిపాద మున్నది. మరియు నితరత్ర నిపించు నాపద్య మున ఈపాదము "పాండురంగ విభునిపదగుంభనంబును" అని కించిత్తు మార్పుగా నున్నది. పదగుంభనము-పద్యంబుహారువు ఈరెండింటిలో మొద టిది రెండవదానియందంతర్భవించును. పదగుంభనమనగా పదములకూర్పు. అట్టికూర్పువలన పాదములై పద్యములగుచున్నవి. అనగా పద్యముయొక్క మనోజ్ఞత్వమునకు సాధనభూతములయిన సహస్రవిషయములలో పదగుం భన మన్నదొకటి. ఇచట పద్యమునగా కవిత్వము - కావ్యము అని అర్థము చేసికొనవలయును. సంస్కృతమువారు వృత్తమన్నదానిని మనము పద్య మనుచున్నాము. కవిత్వము ఛందోవేద్య మని చెప్పిన తాతంభట్టు వృత్తౌ చిత్యమును భావించినవారికంటె నొక మెట్టు పైనున్న వానివలె కనిపించు చున్నాడు. ఒకానొకయర్థమునుచుట్టుకొని దానిదీప్తికి ఛందము కారణ మగుచున్నది. ఛందము లర్థదీప్తి కుపకరించుచు పద్యమునంతయు వ్యాపిం చుకొనియున్నది. అనగా అర్థదీప్తికిని పద్యరచనకును పరస్పరానురూపమైన సంబంధము విధివిహితమైయున్నదన్నమాట. ఆసంబంధము నెరిగినవాడు ఛందస్సు నెరిగినవాడు ఎవడు ఛందస్సు నెరిగినవాడో వాడు కవిత్వము నెరిగినవాడు తెనాలిరామకృష్ణుని పద్యంబుహారువును భావించిన సహృద యుడు వానికవిత్వ తత్త్వము పరమార్థమును పట్టిచూచినాడనియర్థము. చూచినాడన్నది వాస్తవమే కాని అదికేవలము అనుభవముమాట. వాచక ములయినశబ్దములు అన్నియనుభూతివిశేషములు వ్యక్తికిని సమర్థములు గావు. అసలుకవిత్వము విషయమున నూటికినూరుపాళ్ళు సహేతుకముచేసి ప్రతియంశమును అనగా తనహృదంతః ప్రీతికైనదానిని అట్లే నీకును అగు టకుగా వ్యక్తీకరించుట కుదురనిది. అట్లు కుదురని బహ్వంశములలో ఈ పద్యంబుహారువును ఒకటి. అందును తెనుగుపద్యములు విశిష్టలక్షణలక్షిత ములు, తద్వైశిష్ట్యము నానాప్రకారము. అట్టిచో ఏలక్షణ మేక్షణమున హృదయావర్జకమగునో సూత్రించుట అసాధ్యము. ఈవిషయమున ఎవరి చేత ఏమిచెప్పబడినను అది ఆయాస్థలములయందు మాత్రమే వర్తించుచు నొకానొకకొండగుర్తుగా పనికివచ్చిన పనికిరావచ్చునని గ్రహింపవలయును. ఆ గ్రహింపుగలిగి నీవు నీచిత్తముపెట్టి చూచినచో అనగా చూడగలిగినచో అపుడు దానిహారువు అనుభవమునకు రావచ్చును.

మనకు కొన్ని పద్యములు కొన్ని కారణములచేత సొగసుగానున్నట్లే కవికిని కొన్ని పద్యములు ప్రీతిపాత్రములగును అట్లయినవి తన పూర్వకృతుల లోనివియు కావచ్చును అట్టివాని ఛాయనుండిగాని కొద్దిపాటి మార్పులతోగాని కాక అట్లేగాని తరువాత తరువాత కవి పద్యములను కూర్చుకొనవచ్చును ఈఅలవాటు చాలామంది కవులకున్నది. తిక్కన్నగారికేయున్నది. అది అలసత్వము కాదు. అనుకరణముకాదు. ఆ పద్యములయందలి హారువు వానిచిత్తమును స్వాయత్తముచేసికొన్న దనిచెప్పవలయును. శ్రీనాథుడు, పెద్దన - రాయలవారు - ఈ ముగ్గురి పద్యరచనలయందలి వైశిష్ట్యములను రామకృష్ణుడు లెస్సగాగ్రహించినాడు. ఆవిశిష్టలక్షణము లతనికి ప్రీతిపాత్రములయినవి. ఆసామగ్రిమీద రామకృష్ణుడు సాధనచేసిచేసిన పద్యరచన ఆయనకృతులయందలి దీప్తిలక్షణమూలము మరియు తానుపూర్వపూర్వముగారచించిన గ్రంథములలోని బహురీతులనుత్తరోత్తర గ్రంథములందు నింకను దీప్తిమంతములుగా నవతరింపజేసికొనుటయు నాయన పద్యంబు హారువు సంపాదనలక్షణములో నొక భాగము. ఇది ఇంతవరకు పద్యంబు హారువు శబ్దముఖముగా విచారింపబడినది. రామకృష్ణుడు తన కృతుల పద్యంబు హారువును శబ్దముఖముగా సాధించినదానికంటె అర్థముఖముగా నిబ్బడిముబ్బడి సాధించినాడు. అనగా తన కవితాశక్తిచేత పద్యంబుహారువును ద్విగుణీకృతము చేసినాడన్నమాట.

(1) రామకృష్ణునిభావన మత్యుత్కటమైనది. అత్యుత్కటమనగా ఈభావనకిభాషచాలదనిపించునంత భావన. భావన మత్యుత్కటమౌటయనగా రక్తనాళములు చిట్లునేమో అన్నంత తీవ్రముగా భావించుట. ఆపద్యమునందలి మొత్తము భావమును చిత్తమునకు తెచ్చుకొను ప్రయత్నముచేసి నప్పుడాయుత్కటత్వము సంగతితెలియును.

(2) వాదప్రతివాదాత్మకము - సంవాదశైలీరమ్యము - అయిన పద్యంబు హారువు కొన్నిచోట్ల రామకృష్ణుని కృతులయందు పరమాద్భుతముగా దీపించుచున్నది.

(3) అనన్యసామాన్య రచనాచమత్కృతిగర్భమయ్యును పద్యంబుహారువు కొన్నిచోట్లకొట్టవచ్చినట్లుండును.

(4) వర్ణచిత్రరచనాశిల్పవిశేషముచేత సంపాదింపబడిన పద్యంబుహారువును కొంత ఎక్కువగనేకలదు.

(5) ధ్వన్యనుకరణములచేత - కాకువులచేత కొన్నియెడల రామకృష్ణుడు హారవుమ సృష్టించును.

(6) జాతీయతామహితమైన పలుకుబడి (లోకోక్తి) వైలక్షణ్యముచేత, రమణీయసూక్తివైచిత్రిచేత పద్యంబుహారువును వృద్ధిచేయుట ఒక పద్ధతి.

(7) యమకానుప్రాస ముక్తపదగ్రస్త శ్లేషాది శబ్దాలంకార వినియోగము చేత శ్రవణరసాయనమగునట్లు పద్యంబుహారువును దిద్దుట ఇంకొక పద్ధతి.

(8) స్వతంత్ర పరిశీలనముమీద ఆధారపడి ఉపమాద్యలంకారములనుకల్పించుటవలనిహారువుచేత పద్యమును రక్తిగట్టించుట మరియొక పద్ధతి

(9) ప్రసిద్ధార్థమును అల్లేపదిసార్లుచెప్పవలసిరాగా దానిని బహుముఖముల దర్శించి ఒక్కొక్కముఖముమీదనుండి దానినిచెప్పుటకు పదములను సమాసములను కల్పించి అపూర్వఘటనచేత పద్యమున హారువును పరిపోషించుట రామకృష్ణునిరచనాశిల్పమున ప్రత్యేకలక్షణము

(10) చదువవలసినట్లు చదువనిచో విపరీతార్థము వచ్చునంతప్రమాదభూయిష్టముగా పద్యమును, కావలయునని రామకృష్ణుడు రచించును.

(11) తెలుగును సంస్కృతమును - సంస్కృతమును తెనుగును చేయువాని నేర్పును వానిపద్యమునహారువుమూర్తికి మూలమైనది.

(12) ఉపమానమును మిక్కిలిగావర్ణించి ఉపమేయమును నెమ్మదిమీగదిప్తికి వచ్చునట్లుచేయువిలక్షణరచనావిధానము వలననురామకృష్ణునిపద్యంబు హారువుభాసించును. ఈవైలక్షణ్యమే చిత్రవిచిత్ర పదప్రయోగము లందును ప్రాతవడ్డమాటలనుచలామణీకి త్రిప్పుటయందునుకనిపించును. అటే సమాసములను కట్టుటయందును.

ఇంతవరకు పద్యంబుహారువుగా నేదిచెప్పబడినదో అదంతయును రామకృష్ణుని శైలినిగూర్చి చెప్పబడినట్లు రసభావముల నైరంతర్యమును కొనసాగించుటకనువైన ఇతివృత్తనిర్మాణముజోలి పెట్టుకొనక ఉత్తాలఫణి భుగ్గరుచ్చాలనమునువలె పద్యమునునడిపించుటమీద సిద్ధనిపొందుటవలన ప్రౌఢాంధ్రకవులలో నొకడైనవాడు రామకృష్ణుడు. అతనికవితావైభవమంతయును సర్వతంత్రస్వతంత్రమైన వానిశైలియై వెలుగుచున్నది ఆవెలుగే పద్యంబుహారువు. రామకృష్ణుని కృతులుమూడును పతాదృశములు - వెలుగులు.

19. ఘటికాచలమాహాత్మ్యమున విశేషములు :

(1) ఇందలి ఇతివృత్తము ఆఖ్యానోపాఖ్యానాత్మకముగానున్నది. నారదుని తిరుపతులతీర్థయాత్ర మరియు వానిజన్మకథ ఆఖ్యానరూపము మిగిలిన సప్తమహర్షులయుదంతము మొదలయినది ఉపాఖ్యానరూపము. మొదటిది స్వయందృష్టార్థకథనము. రెండవది శ్రుతస్యార్థస్యకథనము.

(2) సప్తమహర్షులకథ ఆదిచాక్షుషమన్వంతరాంతమందలిది (2-61) ఆది శబ్దము నటుంచినచో స్వాయంభువ స్వారోచిష ఉత్తమ తామస రైవత చాక్షుష మన్వంతరములుముగిసినవి. ఇప్పుడు నడుచునది వైవస్వత మన్వంతరము. ప్రతిమన్వంతరమునను ఇంద్రుడు సప్తర్షులు మారుచుందురు. రామకృష్ణుడు క్రొత్తగాప్రవేశించిన వైవస్వతమన్వంతరప్రారంభ విషయమును ఈమన్వంతరపు సప్తర్షులను (2-72) చుట్టుకొనియైన దానినిగా ప్రతిపాదించినాడు. ఈమన్వంతరముమొదటినుండియు ఘటికాచలము ప్రసిద్ధక్షేత్రమనుట దానిప్రశస్తినికృతయుగమునుండి (2-241) ప్రకటించుటకొరకు.

(3) ఈమాహాత్మ్యమును మొదట శ్రీమహావిష్ణువు రమాదేవికి చెప్పుచో నారదుడు విని భృగు మహర్షికి చెప్పెను. దానిని సూతుడు శౌనకాదులకు వినిపించెను. (1-77).

(4) ప్రబంధశబ్దమును ప్రక్రియావిశేషమన్న విశిష్టార్థమున రామకృష్ణుడు వాడలేదు. కావ్యప్రక్రియాభేదపరిజ్ఞానమాయనకు లేకపోలేదు. అయినను బిరుదావళి, ఉదాహరణ, మంగళాష్టకము, దండకము (2-249) ఈప్రక్రియలన్నియును ప్రబంధములనియే ఆయన చెప్పెను. శోభనము లను కూడ ఊరక పేర్కొనెను. (1-5)

(5) ఒకరగడ, (2-114) ఒకలయగ్రాహి (2-221) ఒక మహాస్రగ్ధర (2-232) ఒక దండకము (2-253) ఆశ్వాసాంతపు మాలిని, ఒక పంచచామరము (2-255)- ఈయారుమాత్రమే ఇందు రామకృష్ణుడు వాడినవిశేషచ్ఛందములు. లయగ్రాహి, దండకము రెండునుమాలికావృత్తములన్నతెగలోనివి. రగడ జాతిచ్ఛందములోనిది. మిగిలినవి మామూలువిశేషవృత్తములు.

రామకృష్ణ డిందు వ్రాసిన రగడ మధురగతి రగడ, చతుర్మాత్రా గణములు పాదమునకు నాలుగుండుట, రెండు గణముల తరువాత యతి. జగణము చతుర్మాత్రాగణమే అయినప్పటికిని అది లేకుండుట మధురగతిరగడ లక్షణము ఉన్నంతవరకు రామకృష్ణుని రగడ సలక్షణముగానే యున్నది.

లయగ్రాహి - మహాస్రగ్ధర-మాలిని - పంచచామరము అన్నియు నుండవలసినట్లు సలక్షణముగా నున్నవి.

దండకములక్షణ మొకవిధముగాలేదు. దాదా పిరువది దాక భేదము లున్నవి. ఇట్లు భిన్నచ్ఛందోమార్గానుగామియగు దండకమును రామకృష్ణుడు తన మూడు కృతులలోను మూడువిధములుగా రచించినాడు. ఉద్భటారాధ్య చరిత్రము లోనిది(3-28) మొత్తము తగణములతోడి సాధారణ పద్ధతి దండకము. పాండురంగమహాత్మ్యము లోనిది (4-77) రెండు నగణముల మీద రగణములు కలది రెండు నగణములమీద రగణములుండి యయ్యెడు దండకమున ఏ డెనిమిది భేదములున్నవి.

| | | | |
|---|---|---|---|
| 1. చండవృష్టి | నగణములు | 2+ 7 | రగణములు |
| 2. అర్ణము | ,, | 2+ 8 | ,, |
| 3 అర్ణవము | ,, | 2+ 9 | ,, |
| 4. వ్యాలము | ,, | 2+10 | ,, |
| 5. జీమూతము | ,, | 2+11 | ,, |
| 6. లీలాకరము | ,, | 2+12 | ,, |
| 7. ఉద్దామము | ,, | 2+13 | ,, |
| 8. శంఖము | ,, | 2+14 | ,, |

రామకృష్ణుడు వ్రాసిన దండక మీ భేదములలో నే యొక్కటియును కాదు రెండు నగణముల మీద దాదాపరువదింటిదాక రగణములను నింపి అపుడు తిరిగి నగణముల వద్దకు వచ్చినాడు. ఈ విధముగా నాల్గుపాదములు వ్రాసి దండకమును చేసినాడు. ఘటికాచల మాహాత్మ్యము నందలిది కేవలము రగణములతోనైన దండకము. ఇట్టిదానికి మత్తమాతంగ లీలాకరమని పేరు.

(6) భగవంతుడు యుగపత్ప్రవృత్త విశ్వావసు తుంబురునారద ప్రభృతి దివ్య గాయన గీత విజనామాంకిత బిరుదా వళ్యుదాహరణ మంగళాష్టకదండ

కాది ప్రబంధ సంరంభుడు. (2-249) భగవన్నిజనామాంకితముగా రామకృష్ణుడు దండకము వ్రాసినాడు. బిరుదావళి కూడ వ్రాసినట్లే కనిపించుచున్నాడు. (3-10,11) చక్రవాళము బిరుదావళి ఇత్యాదులు స్తుతులు. శ్రీ ప్రసన్న నరసింహస్వామిని మహర్షులు స్తుతించినట్లుగా రామకృష్ణుడు వ్రాసినపద్యము, పద్యము తరువాతి గద్యము రెండును కలిసి బిరుదావళి యగునను కొనుటలో దోషము లేదనిపించుచున్నది.

(7) రామకృష్ణుడు మంగళాష్టకము వ్రాయలేదు కాని ఇందిరా నృసింహుల పరిణయోత్సవ సమయమున మంగళాష్టకముల యులివు సెలగినది (3-64) అని చెప్పినాడు ఆళ్వార్లు పాయించిన మంగళాశాసన పాశురములనుగాని మనస్సునపెట్టుకొని రామకృష్ణుడు మంగళాష్టకము లనలేదుకదా? పేయాళ్వార్లు, తిరుమంగై యాళ్వార్లు ఘటికావల నృసింహుని విషయమున మంగళా శాసనముల నానతిచ్చియున్నాడు. రామకృష్ణుడు తిరుమంగయాళ్వార్లను స్మరించినాడుకూడ. (1-44)

(8) శ్రీనరసింహదేవర స్తుతిగా నొక సీస పద్యమును (2-252) సంస్కృతమున రామకృష్ణుడు వ్రాసినాడు.

(9) శ్రీ నృసింహ దేవ సాక్షాత్కార వచనము (2-249) ముక్త పదాలంకార సంశోభితమై మరియు తన పదగుంభన ప్రభావముచేత ఆ దేవుని ఆవిర్భావమును స్ఫురింప చేయుచున్నది. ఇట్లే సాక్షాత్కృతుడైన స్వామిమూర్తి విభవమును వర్ణించు వచనముకూడ (3-9) పరమ దీప్తి మంతముగా నున్నది. బిరుదావళి వచనమున (3-11) పరమేశ్వరుని కాల స్వరూప స్వభావ లక్షణముగా కాలావయవ నిరూపణము చేయబడినది

(10) నవ విధ భక్తి స్మరణమున్నది (1-78).

(11) నిత్యకృత్యములోని భోజన విషయవివరములను వర్ణించుట శ్రీనాథుడే కావచ్చును మొదలుపెట్టినది. రామకృష్ణుడును తీసిపోకుండ వర్ణించినాడు. (2-16,17,18) మరియు చిల్లరకొట్టు సరుకులు గూడ కొన్ని చెప్పినాడు (3-60).

(12) ఇందలి వైష్ణవము ఆగమ-వైదికముల కలగా పులగముగా నున్నది. (2-49,50; 3.2³; 2.244) సప్తర్షులు శ్రీ తిరుపతి వేంకటేశ్వర దర్శన మునకు ముందు స్వామిపుష్కరిణిలోను (2-173) తదనంతరము ఆళ్వారు తీర్థమునను (2-195) స్నానములాడిరి. గరుడాళ్వారు మీది విష్ణువు స్మరింప బడినాడు (2-148) రామకృష్ణుడు మార్జాల కిశోర న్యాయాభిమానము కలవాడుగా నున్నాడు. (2-68).

(13) రామకృష్ణునకు తన గోత్ర పురుషుడైన కౌండిన్యునియందలి భక్తి వైభవము చాలదొడ్డది. ఉద్భటారాధ్య చరిత్రమున ప్రమథేశ్వరుని అన్వయదేశికుడు కౌండిన్యుడు. మరియు నాతడు మహాత్ముడు ఆగమ పోషభూమి శ్రుద్ధస్వుడు. ఆత్మవేది. అతిదాంతిపరుడు.(2-65) ఆయన ఆశ్రమము భూరికైవల్య లక్ష్మికి పుట్టినిల్లు. పరమవిజ్ఞానసిద్ధికి పట్టు గొమ్మ (2-32). రామకృష్ణుడు మతము మార్చుకొనుటతో కౌండి న్యుడును మారినాడు. ఉద్భటారాధ్య చరిత్రమున శివమాహాత్మ్య మును తనశిష్యుడైన ప్రమథేశ్వరునకు ప్రబోధించిన కౌండిన్యుడు, వైష్ణవుడై ఘటికాచలమహాత్మ్యమున నారదునకు వైష్ణవము నుప దేశించినాడు. గోవిందశర్మకు వైష్ణవాగమ కథామర్మార్థ మేవం విధ మని బోధించినాడు, అతడు కేవలము విజ్ఞాన మానసుడు. (2-43,47) తనవలెనే తనగోత్ర ఋషినికూడ శైవ వైష్ణవములకు రామకృష్ణుడు త్రిప్పినాడు.

(14) పన్నిద్దరాళ్వార్లు మంగళాశాసనములు చేసిన ముఖ్యాతి ముఖ్యము లయిన దివ్యదేశముల సంఖ్యను నిర్ణయించునది ఘటికాచలము. కొందరు దీనినిచేర్చి ముప్పదిరెండందురు. కొందరు తీసివేసి ముప్పది యొక్కటిగా నుంచుదురు.

(15) మాటవరుస కన్నట్లుగా నూట యెనిమిది తిరుపతులని (1-73) అని నాడేకాని రామకృష్ణుడు వర్ణించిన దివ్యదేశములు మొత్తము క్షీర సాగర పరమ పదములు కాకుండనే నూటపదనాల్గున్నవి. నాలాయిర ప్రబంధము నందలి వానిలో ఉన్నవి కొన్ని విడువబడుటయు, లేనివి కలుపబడుటయు కూడ జరిగినట్లున్నది. కలుపబడిన వానిలో పండరి

(1-66) యొకటి. మొత్తముమీద రామకృష్ణుడు ద్రావిడ ప్రబంధము వరుసనే అనుసరించినాడు. అనుబంధము దివ్య దేశ వైభవము 1,2 సంఖ్యలతో నున్న పట్టికలు చూచిన ఆ విషయము తెలియును. నాలాయిర ప్రబంధము పేర్కొను నూట యెనిమిది దివ్యదేశములలో తొంబది నాల్గింటితో రామకృష్ణుడు చెప్పినవి సంవదించు చున్నట్లు తోచుచున్నవి. ఆ తొంబడి యొక్క ఔగాముల నిశ్చయమున కవస రమనిపించెడి చోట్ల దివ్యస్థల దైవతములుకూడ పేర్కొనబడిరి. రామకృష్ణుడు చెప్పిన వాటితో సంవదించుట లేదనిపించిన ప్రబంధ ములోని మిగిలిన పదునాల్గును వరుసక్రమసంఖ్యాపూర్వకముగా దివ్యదేశ వైభవము-2. అని ఈయబడినవి. సంవదించిన దివ్యదేశముల యందుగూడ కొన్నింట దైవతనామములు సమానముగా నుండుట లేదు.

## 20. రామకృష్ణుని కృతులలో పోలికలు:

ఒకకవి రెండుమూడుగ్రంథములు రచించినచో అన్యోన్యచ్ఛాయ లందుగానవచ్చును. ఈఛాయ స్థూలముగా మూడువిధములు. శబ్దము నను సరించిన పోలిక, భావము నుపలక్షించినపోలిక, పద్యపుయెత్తుగడలను దింపు గడలను అనుగమించినపోలిక యని సూక్ష్మముగా విచారించినచో నింకను బహువిధము లుండవచ్చును. భావము నుపలక్షించినపోలిక యున్నది చాల విషయముల నిముడ్చుకొన్నది పాండురంగమాహాత్మ్యమునందలి పుండరీ కునిపోలిక ఈ ఘటికాచల మహాత్మ్యమునందలి గోవిందశర్మయందు కాన నగును. ఇచటి కాంచీపురవర్ణనము పాండురంగమాహాత్మ్యములోని కాశీపుర వర్ణనమును, ఉద్భటారాధ్యచరిత్రములోని వల్లకీపురవర్ణనమును తలపించు చున్నది. సప్తర్షులుచేసిన నృసింహస్తవము దండకము-లోని దశావతార ప్రశంస పుండరీకుని విష్ణుస్తుతిని స్మరింపజేయును సప్తర్షులకు నృసింహుడు ప్రత్యక్షమైనప్పుడు విమానమునపరమశివుడును కానవచ్చుట, పుండరీక క్షేత్రస్థుడైన శ్రీమహావిష్ణువును శివుడుతానును కొలిచెదననుట వంటిదేమో అనిపించుచున్నది. స్వామి ప్రత్యక్షమైనప్పుడు సప్తర్షులు - పుండరీకుడును ఒకేవిధముగాకోరుకొనిరి

రామకృష్ణుడు తనరెండువైష్ణవగ్రంథములందును శ్రీ మహావిష్ణువును శివుడులేకుండనుండనీయలేదు. పాండురంగ దెట్లో అట్లేనృసింహుడును త్రిమూ

రాధ్యాత్మకుడు పాండురంగమహాత్మ్యమున సామిమలకు ప్రయాణముగట్టిన అగస్త్యమహర్షి మార్గమధ్యమున మాల్యవంతాదికమును తన భార్యకు చూపి వర్ణించి చెప్పుటవంటిదే ఇచట ఘటికాచలమాహాత్మ్యములో వసిష్ఠుడు కాంచీనగరమును అరుంధతికి వర్ణించిచూపుట. నిగమశర్మవంటివాడే హరిశర్మ. మరియు నుద్భటారాధ్యచరిత్రములోని మదాలసు డచ్చముగా నిగమశర్మను మించినవాడు.

మిగిలినపోలికలుకొన్ని ఝుడితిస్ఫూర్తికలవి "పద్యరచనాదికము-3" "ఛందోవిశేషములు-4" అని అనుబంధమున చూపబడినవి సూక్ష్మముగా విచారించుచో మరికొన్ని తోచగలవు.

## IV

### 21. వైష్ణవము పుట్టుపూర్వోత్తరములు:

విష్ణువునకుసంబంధించినది వైష్ణవము విష్ణువును పరదైవముగాభావించి భక్తిభావముతో నారాధించువిధము వైష్ణవము. అది హిందూమతమున నొక అవాంతరశాఖ.

విష్ణుశబ్దము నామవాచకముగాగూడ వేదవాఙ్మయమున నుపయోగింపబడినది. ఋగ్వేదమున విష్ణు ప్రస్తుతియున్నది.[1] విష్ణువుయొక్క అవతార కథలకుకూడ బీజములందున్నవి. కాని ఆకాలమున విష్ణువుసర్వాధికుడుకాడు ఇంద్రునిముఖ్యమిత్రులలో నొకడు.

శతపథబ్రాహ్మణమున[2] విష్ణువు యజ్ఞముగా ప్రస్తావింపబడినాడు. యజ్ఞముఖముననే దేవతలు పృథ్వ్యాదులను వశీకరించుకొనిరి. యజ్ఞరక్షకుడుగాగూడ చెప్పబడినాడు. ప్రజాపతికంటె ముందే నామరూపములచేత స్థిరపరుపబడిన దైవము విష్ణువు ఈదైవతముయొక్క ప్రాదుర్భావము విషయముమాత్రము చెప్పబడలేదు యజ్ఞసంబంధమే ఎక్కువ చెప్పబడియున్నది. యజ్ఞముయొక్క పూర్వార్థము అగ్ని. ఉత్తరార్థము విష్ణువు అనియు దేవతలయందున్నతుడనియుకూడ అబ్రాహ్మణమునందున్నది.

1. సర్వసిద్ధాంత సౌరభము. (అనుభవానంద స్వాములవారు) సంపుటము 7 పుట 34-36.

2. (R. M.) Religion and Mythology of the Brahmanas (Dr. G. V. Devasthali) pages 8.9.26. 167.

విష్ణునామముతరువాత నారాయణ, భగనామములు వైదికవాఙ్మయమున విష్ణుపరములుగా కలవు [1] మరియు క్రమముగా వాసుదేవ-కృష్ణ శబ్దములును తత్పరములుగా వ్యాప్తికి వచ్చినది. ఆవ్యాప్తినిబట్టియే వేదోపనిషత్పురాణేతిహాసములమీదుగా సర్వాంగసుందరమైన వైష్ణవము రూపుగట్టుకొన్నది.

క్రీస్తుపూర్వమునాల్గవశతాబ్దమునాటికే వాసుదేవ - బలదేవులు పూజింపబడుచున్నట్లొక బౌద్ధునివాక్యమున్నది[2]. వాసుదేవుని విషయము పాణినికితెలియును. క్రీస్తుపూర్వము వాసుదేవసంకర్షణపూజావిధానమున్నట్లునుఆధారములున్నవి. ఆకాలమునందాపూజచేయువారు భాగవతులనబడుచుండెడివారు. వారిది భాగవతమతము. ఆ వాసుదేవుడు వృష్ణివాసుదేవుడు. వానిని కేంద్రముగాచేసి చుట్టుకొన్నమతమునకు ఏకాంతికధర్మమనియుపేరు. శ్రీమహావిష్ణువు నారదునకుపదేశించిన ధర్మమది. భగవద్గీతలో అర్జుననకుపదేశించినదియు నీధర్మమే. పశువిశసనములేని యజ్ఞధర్మమిది. ఈఏకాంతికధర్మమున వాసుదేవనామము ప్రముఖమైనది. పరమసాత్త్విక మతమగుటను ఈ మతమువారు సాత్వతులనబడిరి. సత్వప్రాధాన్యముకలవారు వారు, అనన్యమైన భక్తిభావమున కేకాంతభావమనిపేరు. పాంచరాత్రాగమసిద్ధాంతము ప్రసిద్ధికివచ్చినపిదప ఏకాంతి.ధర్మము పాంచరాత్ర ధర్మమైనది. ఈవిధముగా భాగవత-సాత్వత-ఏకాంతిక-పాంచరాత్ర నామముల ప్రశస్తమైన వైష్ణవము ఉత్తరదేశమునుండి దక్షిణదేశమును ప్రవేశించినది[3]. కాని దక్షిణదేశముననే వైష్ణవము పుట్టినదనిపించిన మహానుభావులయిన వైష్ణవభక్తులు ఆళ్వారులు.వారువైష్ణవవాఙ్మయమునుద్రవిడ భాషనుసృష్టించిరి వారివలన వైష్ణవముభక్తిమతముగా స్థిరపడినది.కాని-

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారిఅద్వైతసిద్ధాంతదీప్తిక్రమముగా భాగవతభక్తిమతము వెనుక బట్టినది [4] అద్వైతమతము నెదుర్కొని

---

1. సర్వసిద్ధాంత సౌరభము. సంపుటము 7. పుటలు 37-52.
2. V. S. Vaisnavism Saivism (Sri R. G. Bhandarkar) Page 3.
3. సర్వసిద్ధాంత సౌరభము. సంపుటము 7. పుట 110.
4. Vaisnavism went on till about the end of the eighth century, when the doctrine of spiritual monism and world-illusion was promulgated and disseminated by Sankaracharya and his followers. This was considered as destructive of the Bhakti, or love, which vaisnavism enjoined V. S. Page 100.

న్నది వెనుకబట్టిన విష్ణుభక్తి పునఃసంస్థాపించుటకే శ్రీమద్రామానుజు లవతరించిరి. అందువల్లనే ఆళ్వార్లుచేయలేనివనులు శ్రీభాష్యరచనాదికమును శ్రీమద్రామానుజులు చేయవలసివచ్చినది.

శ్రీమద్రామానుజుల అనుయాయిజనము దక్షిణభారతదేశముననే ఎక్కువ ఈజనము వడగల - తెంగల అనిరెండువర్గములగానున్నది. శ్రీమద్వేదాంత దేశికులవారివల్లను, శ్రీమాన్ పిళ్ళై లోకాచార్యులవారివల్లను వైష్ణవులలోనీతెగ లేర్పడినవి.[1] ఇవి ఏర్పడినప్పటినుండియే వైష్ణవమున మతప్రచారము - అన్యులను తమమతములోనికి చేర్చుకొనుట ఇత్యాదులు మొదలైనవి రామకృష్ణున కొక వందసంవత్సరములముందునుండి వైష్ణవ మట్లయియున్నది,

## 22. రామకృష్ణుని మధ్యవైష్ణవము :

మధ్యవచ్చిన రామకృష్ణుని వైష్ణవమునుగూర్చిచెప్పుట కధికారము గల శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు "ఘటికాచలమాహాత్మ్యమున వైష్ణవము కొంతముదిరినసూచనలున్నవి శ్రీవైష్ణవులమతము" కాని గ్రంథమును కొంతయున్నదనియు "పాండురంగమాహాత్మ్యములోనిది ఇంకను శిథిలమైనవైష్ణవము"[2] అనిచెప్పియున్నారు. గ్రంథ రచనాక్రమమునుబట్టి శ్రీమాన్‌శర్మగారి యర్థమును మనమిట్లు గ్రహింపవచ్చును.

రామకృష్ణుడు వైష్ణవముపుచ్చుకొని పేరు మార్చుకొన్నాడేగాని పూర్తిగా మనసుమార్చుకొనలేదు. అజన్మసిద్ధమైనశైవమునాతడుపూర్తిగా త్యజింపలేదు అందువలననే ఆయనతాత్త్వికతయు అద్వైతమును సంపూర్ణముగా తొలగించుకొన్న విశిష్టాద్వైతము కాలేకపోయినది. ఈవిధముగానున్నరామకృష్ణుని శిథిలవైష్ణవబుద్ధి పాండురంగమహాత్మ్యరచనాకాలమునాడున్నదానికంటె ఘటికాచల మాహాత్మ్యమును రచించునాటికి మరికొంత శైథిల్యమును తగ్గించుకొని బిరుసెక్కి కొంతముదురుపాకమున పడినది - అని ఈ అనంతకృష్ణశర్మగారి యభిప్రాయము నిజముకావచ్చుననిపించుచున్నది అపుడే రామలింగడు మతముతోపాటు పేరుమార్చుకొని రామకృష్ణుడుగా నవతరించినాడన్నవార్తవము మరియు సోపపత్తికమగును.

1. తెలుగు విజ్ఞాన సర్వస్వము సంపుటము 3. పుట 584.
2. పాండు (సాహిత్య అకాడమి) ఉపోద్ఘాతము. పుటలు. 16, 17.

ఘటికాచలమాహాత్మ్యమున శ్రీవైష్ణవధర్మపారదృశ్వదనర్చు వాడు గోవిందశర్మ. ఇతడు పాండురంగమాహాత్మ్యము నందలి పుండరీకుని వంటి వాడు పుండరీకునకువలెనే గోవిందశర్మకును భార్యఅప్రతీపమతి. పుండరీకుని భార్యపేరు తెలియదు గోవిందశర్మ భార్యపేరు భద్రాంగి.

సమిధలకైపోయి తిరిగివచ్చు పుండరీకునివర్ణించినట్లే (2-17) నిత్యమును ప్రాతఃకాలమున నదీస్నానమునకుబోయి తిరిగివచ్చు గోవిందశర్మను (2-8) రామకృష్ణుడు వర్ణించినాడు. ఈరెండుపద్యములు రచించుటకును మూలమై రామకృష్ణునిమనస్సున మెదలినపద్యము మనుచరిత్రలోనున్నది. (1-54) పుండరీకుడు చక్రహస్తార్చనమునకుపక్రమించి చేయుటను వర్ణించినపద్యమునకు (2-21) గోవిందశర్మ అంబుజోదరపూజ యొనర్చుటను వర్ణించినపద్యము(2-12) రసభావ ఛందోఽలంకారవిశేషములచేతసంపూర్ణ. ప్రతిబింబముగా మన్నది గోవిందశర్మ హరికివందనమాచరించి యాడను గూడ యాడినాడు పుండరీకునికంటెను గోవిందశర్మ భక్తిచేత పరవశుడు, తిరుపవిత్రము, తిరుమణి, తిరుచూర్ణమును మేనధరించి కాయమెత్తిన వైష్ణవధర్మమా యేమి అనిపించునట్లుండువాడతడు (2-8) మరియు గీతా పారాయణముచేయువాడు. పుండరీకుడింతగా పైకికనిపించువాడు కాడు. గోవిందశర్మ భోజనవిషయమునుగూడ రామకృష్ణుడువర్ణించినాడు (2-16, 17, 18, 19) ఈ పద్ధతియు వానిముదిరిన భోగమయమైన వైష్ణవమును ప్రకటించుచున్నది.

వైష్ణవము సంస్కృతముఖమున ఎంతప్రకటితమైనదో అంతకేమాత్రమునుతగ్గకుండ తమిళముఖముునను అయినది. రామకృష్ణుడావైష్ణవము యొక్క తమిళముఖమును పాండురంగమాహాత్మ్యమున చూపకుండ ఈ ఘటికాచలమహాత్మ్యమున చూపినాడు. ఇందుకు కారణము ఘటికాచలము తమిళదేశములోనిది. పండరి మహారాష్ట్రములోనిది. రామకృష్ణుడు తనశైవగ్రంథములకు కథను ఆంధ్రభూమిలో జరిగినదానిని గ్రహించినాడు. వైష్ణవగ్రంథములకు కథలను ఇరుగుపొరుగురాష్ట్రములలో వెలసినవానిని గ్రహించినాడు ఇదొక వైచిత్రి.

నారదుడు తానునూటయెనిమిది తిరుపతులను చూచితినని వానిని పేర్కొనినాడు ఈతిరుపతులన్నియు వైష్ణవక్షేత్రములు శ్రీవైష్ణవుల కవ్విముఖ్యమైన యాత్రాస్థలములు. అవన్నియు ఎక్కువభాగము తమిళదేశముననేయున్నవి. అందుకనియే రామకృష్ణుడాయా తిరుపతులను వాటి

వాటి తమిళ నామముల తోడనే పేర్కొనినాడు. అందలి దైవతములను కూడ ఒకటిరెండుచోట్ల తమిళనామములనుంచియే చెప్పినాడు. మరియు శ్రీవైష్ణవుల నిత్యవ్యవహారములోని తమిళశబ్దములను అట్లె తెలుగున ప్రయోగించినాడు. పాండురంగమహాత్మ్యమున కీతమిళ శబ్దప్రయోగపు టక్కరలేదు, ఘటికాచలమహాత్మ్యమున కున్నది. ఇందువలనను ఇందలి వైష్ణవము కొంతముదిరిన ట్లగపడును. మరియు కౌండిన్యుడు గోవింద శర్మకు వైష్ణవాగమకథామర్మార్థమును బోధించినాడు. (2-4౹) వైష్ణవాగమములు పాంచరాత్రాగమాదివిషయములు, ఆగమనియమైన వైష్ణవము ముదిరియేయుండును. ఉండవలయునుకూడ.

గోవిందశర్మ వైష్ణవమంత్రదీక్షితుడువలె కన్పించుచున్నాడు. ఉచితాసనమ్మునకునుండి లోనిండినిశ్చలమైననిష్ఠ నాచార్యుదలచువాడుగా చెప్పబడినాడు (2-8). శ్రీవైష్ణవమున ఆచార్యునకున్నమర్యాద చాలగొప్పది. వైష్ణవదీక్ష- మంత్రోపదేశము-ఉన్నవిగనుక ఆచార్యుని అవసరమున్నది. చక్రాంకితత్వము-ఇత్యాదులను రామకృష్ణుడుచెప్పలేదు. ఆచార్యస్మరణ మున్నందున ఆయా వైష్ణవమంత్ర దీక్షావిధులు గోవిందశర్మ యందనుమానింపబడుచున్నవి. ఇట్లు వైష్ణవత్వమును సిద్ధింపజేసికొన్నందుననే అతడు కాయమెత్తినవైష్ణవము. వైష్ణవచిహ్నములు శంఖచక్రముల ముద్రలు వామదక్షిణభుజములందు కన్పించుచున్నవనియే దానియర్థము. అంతటి వైష్ణవుడుగనుకనే కౌండిన్యుడు వానినాదరించి వైష్ణవాగమకథామర్మార్థముల నిట్లిట్లు గ్రహింపవలయునని బోధించెను. బాలుడైననారదుని ముద్దు ముద్దుగాజూచి పలుకుచు చేరదీసి సుదర్శనశంఖచిహ్నములకు పాత్రునిగా జేసి కౌండిన్యుడు మంత్రోపదేశముచేసినాడు. (2-51) రామకృష్ణుడు నారదుని విషయమున వైష్ణవదీక్షను స్పష్టముగాచెప్పినాడు. గోవిందశర్మ విషయమున ఊహకువిడిచినాడు. మరియు బాహ్యచిహ్నములులేని విష్ణుభక్తి, అభ్యంతరభక్తిలేనిబాహ్యచిహ్నములు రెండును వృథాయనియు వైష్ణవముభయాత్మకమనియు పద్మపురాణము నందున్నది.[1] గోవిందశర్మ నిత్యానుష్ఠానమునుచెప్పుచోరామకృష్ణుడు వైష్ణవభక్తిస్వరూపనిరూపణాత్మకములయిన- విష్ణుపూజాపంచక నిరూపణాత్మకములయిన అంశములనేచెప్పెను.

పంచబేరార్చనమును (3-37) రామకృష్ణుడు స్మరించెను. మరియు వివరించెను.(38) పంచబేరములనగా అయిదు విగ్రహములు, విగ్రహము

1. ఉత్తరఖండము. పుట. 266.

లనుటకంటె పెరుమాళ్ళకు ప్రతికలన్న బాగుండును. ప్రతి ఆలయమునను మూలవిగ్రహము-ఉత్సవవిగ్రహములతోపాటు మరొక్కటికూడనుండును. మూలవిగ్రహము కదలదు. ఆ విగ్రహమూర్తిని శ్రీవైష్ణవులు ధ్రువులు అందురు. అనగా ధ్రువునివలె స్థిరులు అనియర్థము. ఉత్సవ విగ్రహమును ఉత్సవులు అందురు మూడవ బేరము బలిహరణ హోమాదులలో వాడుక మున కుపయోగపడునది. నాల్గవ బేరము డోలారోహణ, వసంతోత్సవాదు లలో వేడుకల కుపయోగ పడునది అయిదవ బేరము ఆలయమునుండికద లక ఆలయమును సంరక్షించునదిగా భావింపబడునది. ఆరవ బేరముగూడ కొన్నిచోట్ల నుండును. దానిపేరు బాలాలయము. దీని యవసరము మహా సంప్రోక్షణకాలమునతప్ప మరెప్పుడును లేదు. మూలవిగ్రహ స్థానములను బాగుచేయవలసి వచ్చినపు డావిగ్రహమును ఆస్థానమునుండికదలించుటకు ముందు- ఆవిగ్రహస్థమైన కళావైభవమును ఈఆరవ బేరమునకు సంక్ర మింపజేయుదురు. ఆపిమ్మట ఆవిగ్రహమును కదలించెదరు. ఆవిగ్రహము తిరిగి సుస్థిరముగా నెలకొల్పబడువరకు నిత్యనైమిత్తికాది కైంకర్య కార్యకలాపము అన్నియు బాలాలయముననే జరుగును ఆతరువాత మరల ఇటకు సంక్రమింపజేయబడిన కళావైభవము పూర్వ విగ్రహమున యందు యథాపూర్వముగా న్యాసము చేయబడును. ఈయారవబేరము విశేషము గాను - వికల్పముగాను శాస్త్రములందు పేర్కొనబడినది. పంచబేరార్చన పాంచరాత్రమున యందువలెనే వైఖానసమునందును విధింపబడియున్నట్లు తిరుపతి మొదలయినదేవస్థానములందు జరుగు అర్చనా విధానమును బట్టి తెలిసికొనవచ్చును ఇప్పుడు రామకృష్ణుని (38) పద్యము కొంతఅర్థము కావచ్చును, మరియు రామకృష్ణుని మధ్యావైష్ణవములక్షణమును కొంత బోధపడవచ్చును.

తరళపరముగా హరివినిర్మాల్యఘ్రాణధారణములను, ముకుంద దాసజనశేషాన్న పరిగ్రహణమునుచెప్పి(2-24) వైష్ణవధర్మములయినద్వాదశ శుద్ధులను విష్ణుభక్తియొక్క షోడశవిధములను[1] స్మరింపజేయుచున్నాడు. మరియుహరిశర్మ ముఖమున ఊర్ధ్వపుండ్రముంచి (2-23) వైష్ణవమును వెలయించినాడు. శైవులకు భస్మమునువలె వైష్ణవులకు ఊర్ధ్వపుండ్రధారణ మత్యంతము ముఖ్యము. ఊర్ధ్వపుండ్రమధ్యమున రమానాథుడు వసియిం చును. ఊర్ధ్వపుండ్రములను తాల్చిన శరీరమది పుండరీకాక్షమందిరము[2]. మరియుఒక్కడక్కడ మంత్రజపము,హరికథాశ్రవణము,హరిపాదసేవనము

---

1. పద్మపురాణము (శ్రీపీసుపాటిచిదంబరశాస్త్రి) ఉత్తరఖండముపుటలు 266, 267
2. ,, ,, ,, ,, 269, 270

పాదోదకపరిగ్రహము, శంఖచక్రాంకము, నామసంకీర్తనము ఇత్యాది శ్రీవైష్ణవషోడశవిధభక్తిభావములను రామకృష్ణుడు ప్రకటించుచుండుట(1-60, 1-62) కలదు భాగవతులకత్యంత పవిత్రమైనతులసిని రామకృష్ణుడు 'తిరుతులసి'గా ప్రస్తావించెను. (2-11)

నారదుడు భృగుమహర్షి వద్దకువచ్చి తనరాకనుగూర్చిచెప్పుచో వైకుంఠమునుండియని మొదలుపెట్టినాడు. క్షీరసాగరమునగల శ్వేతద్వీపమున వైకుంఠము కలదనుటను రామకృష్ణుడు ప్రతిపాదించుచున్నాడు *కాని పద్మపురాణమున వైకుంఠము, విష్ణులోకము, శ్వేతద్వీపము, క్షీరసాగరము అనునాల్గువ్యూహములు నారాయణుని పరావస్థయందు కలవనియున్నది. అవన్నియుదీపోత్పన్నదీపములవలెపకరూపములై యుండుననియు "అచ్చట నుండు వారెల్లరును విష్ణుసమరూపులును తత్సమాన సుఖభోగులును"[1] అయియుందురనియు కలదు. రామకృష్ణుడును వైకుంఠమున కాపురమున్నవారి నావిధముగనే వర్ణించినాడు (1-25) ఇదంతయు కొంత ముదిరినవైష్ణవమునియే చెప్పవచ్చును. మరియును ఘటికాచలమాహాత్మ్యము నుగ్గడించుచు 'గణుతింపగాలేరు పరమాణుగణము లెన్నగలవారలైన' (2-61) ననుటయు వైష్ణవప్రీతిలక్షణము కావచ్చును. పరమాణుగణము లెన్నువారు వైశేషికులు ఈ వైశేషికుల పరమాణునిత్యత్వ సర్వహేతుత్వ లక్షణ లక్షితమైనసృష్టి విచారమును శ్రీమద్రామానుజులు శ్రీభాష్యమున పరాస్తముచేసిరి. మరియు శ్రీకృష్ణదేవరాయలవారును విష్ణుచిత్తుని అన్యమతనిరసనమున వైశేషికమునుగూడచిత్తుచేసిరి ఆయా సందర్భములను మనసునపెట్టుకొని రామకృష్ణుకు వైష్ణవక్షేత్రమాహాత్మ్య మెరుగుటవారివలన కాదనెను. అనగా నిరవయవి యగు పరమాణుగణగణనమునకు వలయుదానికంటె నింకను పరమసూక్ష్మమైన జ్ఞానదృష్టి వైభవమున్నగాని వైష్ణవమాహాత్మ్య మవగతముకాదని యర్థము.

విశిష్టాద్వైతమున శ్రీమద్వేదాంతదేశికుల దయాశతకము మహోదాత్తమైన స్తోత్రగ్రంథము. అనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణములలో దయ యొక్కటియే పరమోత్కృష్టమైన దనియు, భగవంతుని పరవశునిచేయుశక్తి దానికొక్కదానికే కలదనియు, అదియే స్తోతవ్యమనియు

---

* దుగ్ధార్ణవంబు నుత్తరంబు చేరువ శ్వేతద్వీప మున్నదని శ్రీ మహాభారతము. శాంతి 6-353, మరియు చూడు. పాండు. 3-152, 153.

1. ఉత్తరఖండము. పుట. 279, 280.

ఆ దయాదేవిని దేశికులు స్తోత్రముచేసిరి. మధ్యవయసున వైష్ణవమున ప్రవిష్టుడయిన రామకృష్ణునకు దేశికుల దయాదేవి మనసునకుపట్టినట్లున్నది ఘటికాచలమాహాత్మ్యములో సప్తర్షులు శ్రీవేంకటేశ్వరునిదర్శించినారని చెప్పు సందర్భమున "దయతోడకూడి చేతనవాని తనవాని తనయంతవా నిగా నునుచువాని" (2-179) అని స్వామిని కీర్తించినాడు రామకృష్ణుడు. ఆ కీర్తించుటలోగల 'చేతనవాడు' అనుటకూడ వైష్ణవసంప్రదాయమే. *తత్త్వము-హితము-పురుషార్థము అను మూడువిషయముల పరిజ్ఞానము ముముక్షువుల కత్యంతము అవసరము చేతనము అచేతనము ఈశ్వరుడు అనితత్వము త్రివిధాత్మకము. చేతనముజీవాత్మ. జ్ఞానవంతుడగు జీవాత్మ మునుముందితడు సంసారమునబద్ధుడు భక్తిప్రపత్తులచేత మోక్షోపాయము ననుష్ఠించి మోక్షమునుపొంది ముక్తుడు. కర్మసంబంధము లేక మోక్ష లోకమునభగవంతునకుకైంకర్యములుచేయుచు నాతనిని అనుభవించుచుండు వాడు నిత్యుడు భగవంతుడు దయాపరవశుడుగనుక బద్ధుడైన చేతనవానిని నెమ్మదిగాముక్తునిచేసి తనవానిగాచేసికొని ఆపిమ్మట కర్మసంబంధమును నశింపజేసి తనకైంకర్యమున నిత్యముతనవద్ద ఉంచుకొనుటయే తనయంత వానిగాచేయుట. రామకృష్ణు డీవైష్ణవాభిప్రాయమును విస్పష్టముగా ప్రకటించినాడు, ముదురుపాకమున భావము ముచ్చటగానున్నది.

రామకృష్ణుని వైష్ణవాభిమానము కొంత వైదికాభిముఖముగా కన్పించుచున్నది ఘటికాచలమున సప్తర్షులు శ్రీనృసింహుని ఆరాధించినది వేదచోదిత మనుధ్యానప్రకారమున, (2-244)వైష్ణవము ఆగమమని-వైఖా నసమనిరెండువిధములు. రామకృష్ణుని వైష్ణవస్వరూపము నెరుగుటకు గమ నింపవలసినది అన్నిటి కంటె ముఖ్యమైనది ఆయన వైఖానసులను ఘటికా చలమున ప్రవేశపెట్టుట (3-28) వైఖానసులు వసుధామరాగ్ర్యులు. వారు వైదికులు పాంచరాత్ర వైష్ణవమున కంటె వైఖానస వైష్ణవము వైదిక మైనది అది ఉత్తర దేశమునుండి దక్షిణదేశమునకు వచ్చినది. యజ్ఞయా గాది క్రతుప్రాధాన్యముగల వైదిక వైఖానసమును రామకృష్ణుడుప్రతిపా దించుచున్నాడు[1]. పైగా వారు అజునిపంపున వచ్చినారట. అచట తమకు వసతిసరిగాలేదనగా శ్రీనరసింహదేవుడు హనుమంతుని చేత వారికి వసతు

* శ్రీమాన్ శఠకోపాచార్యులవారి దయాశతక భూమిక. పుట. 14.

1. బ్రాహ్మణులకు యాగపరాయణత కలుగునట్లు వరము ప్రసాదింపుమని సప్త ర్షులు శ్రీనృసింహుని కోరుకొనిరి. (3-26) మరియు శబరయవనపుళిందాదు లును జ్ఞానవైరాగ్య ధర్మముల పొందుటయును కోరిరి. (3-25)

తేర్పాటు చేయించినాడు ఘటికాచల శ్రీనృసింహదేవరకు సంరక్షకులుగా వైఖానసుల నచట నిలుపుటనుబట్టి రామకృష్ణుని మధ్యవైష్ణముయొక్క ముదురుతనమును పట్టిచూడవలయును.

వైఖానస శాస్త్ర మర్యాదలను మన్నించు సంప్రదాయ మెక్కువగా నాంధ్రదేశముననే కలదు మిగిలినచోట్ల పాంచరాత్రమునకే ప్రాధాన్యము ప్రామాణ్యమును ఆరాధనప్రక్రియ-ఉత్సవాంగములు మొదలయిన బహువిషయములలో వైఖానసము పాంచరాత్రముతో భిన్నముగా నుండును తిరుపతి వేంకటేశ్వరస్వామి సన్నిధిని జరుగు కైంకర్యము వైఖానసమే, శ్రీపెరుంబుదూరు - శ్రీమద్రామానుజులజన్మస్థలము - నను వైఖానసమే. శ్రీమద్రామానుజులు పాంచరాత్రమునయం దభిమానముకలవారు. వైఖానసులది పచ్చబొట్టు. వైఖానస వైష్ణవార్చకులకు భట్టాచార్యులనిపేరు,

శ్రీనరసింహస్వామివారికి జరుపబడిన పరిణయోత్సవము బ్రహ్మోత్సవము. బ్రహ్మోత్సవము పంచాహ్నికము, సప్తాహ్నికము, నవాహ్నికములని, విత్తముకొలదివైష్ణవమన్నట్లుగా, మూడుపద్ధతుల జరుపబడును. రామకృష్ణుడు ఘటికాచలమున పెరుమాళ్ళపరిణయోత్సవము నవాహ్నికముగా చేయించినాడు. ఒక్కరోజు చేయుచో అది కల్యాణోత్సవ మనబడును బ్రహ్మోత్సవమని రామకృష్ణుడు చెప్పకపోయినను జరిపించిన విధానమునుబట్టి అది అట్టిదని తెలియుచున్నది. సాధారణముగా బ్రహ్మోత్సవము పాంచరాత్రాగమప్రకారము జరిపించుట సంప్రదాయము. ఘటికాచలమున వైఖానసులున్నారుగనుక ఆబ్రహ్మోత్సవమును వైఖానసాగమప్రకారమే జరుగుటనూహింపవచ్చును. తిరుపతిలో అంతేగదా!

రామకృష్ణుని మధ్యవైష్ణవము ముదురుపాకముపడినదో - లేపాకముననున్నదో తెలిసికొనుట కవసరమైన కొన్ని విషయములు ప్రదర్శింపబడినవి. ఈయన్నింటిని దృష్టిలోపెట్టుకొని పాకము నంచనాకట్టవలయును.

ఈబ్రహ్మోత్సవము సందర్భమున గమనింపవలసిన దింకొకటి యున్నది. అవభృథ వారి (3-66) ఇది దక్షిణాదిమాట. ఈతెలంగాణప్రాంతమున చక్రతీర్థమందురు. ఇది యజ్ఞమున కవభృథస్నానమెట్లో, బ్రహ్మోత్సవమునకట్లు. విగ్రహముతోగానివిగ్రహములేకుండ కాని చక్రాకారప్రతీక

యొకటియుండును. రథోత్సవము ముగిసిన రెండవనాడు గ్రామము వెలుపల నదులలోనో, కొలనులలోనో ఆప్రతీకమును స్నానము చేయించుదురు. అచేయించుట పేరు తీర్థ వారియుత్సవము రామకృష్ణు డీవిధముగా బ్రహ్మోత్సవమును శ్రీవైష్ణవసంప్రదాయ విహితముగా తుదితాకించినట్లు పాఠకులూహించుకొనుట కనువుగా తీర్థ వారిని పేర్కొనినాడు. ఇదంతయు రామకృష్ణునిమధ్యవైష్ణవను యొక్క మెండుదనము లక్షణమే.

## 23.రామకృష్ణుని యోగశక్తి :

బాహ్యాభ్యంతరములయిన వైష్ణవ ధర్మములలో యోగశక్తి అభ్యంతరమైనది.[1] వైష్ణవమతము యోగమును స్వీకరించినది. మిగిలిన మతములవారును స్వీకరించిరి. "యోగమనగా యమాదివిషయకంబైనయాత్మ ప్రయత్నంబున కధీనమైన సాత్వికపు మనోగతి యెయ్యదికలదుదాని బ్రహ్మ సంబంధినిఁగఁ జేయు ప్రౌఢి" అని రాయలవారు చెప్పినారు, (ఆముక్త 3-74)అనగా యమనియమాదులసాధనకైనప్రయత్నమువలన వశమైన శుద్ధ సత్వ స్వరూపమైన మనోవృత్తిని బ్రహ్మ సంబంధినిగాచేయు నేర్పు యోగము. ఖాండిక్య కేశిధ్వజ సంవాదమున తమ యోగశక్తిని రాయలవారు ప్రదర్శించిరి. రామకృష్ణుడును యోగము నందు శక్తి కలవాడు. అంతమాత్రమే కాని దానిని సంపూర్ణముగా వెలయింతమన్న పట్టుదల కలవాడు కాకపోవుటచేత నొక క్రమమున సలక్షణముగా ప్రతిపాదింపడు. అక్కడొకటి, అక్కడొకటిగా ఆయా విషయములను స్పృశించును.

పుండరీకుని విషయమున ఈ యోగశక్తిని రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యమున చెప్పినాడు (2,3,9) హఠ రాజయోగములురెండింటిని పేర్కొనినాడు కూడ. యోగమనగా యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధి అను ఈ అష్టాంగముల యొక్క సహితత్వము. యమ నియమము లోక విధముగా సర్వసాధారణ ధర్మ విషయములు. యమనియమాది వివేకము తరువాత ఆసనసిద్ధిని సాధింపవలయును. ఇచటనుండియే యోగారంభము. ప్రాణాయామపరత ఆసన సిద్ధి వలనగాని సమకూడదు పతంజలి మహర్షి ఈ సందర్భముననే స్థిరసుఖ మాసనమ్[2] అని చెప్పెను. దర్భాసనము. మృగచర్మాసనము

1. పద్మ. ఉత్తర ఖండము. పుట. 21.
2. యోగ దర్శనము. సాధన పాదము 46.

ఇత్యాదులను ఆసనములే. ఇవి బాహ్యములు. కూర్చుండుటకు మెత్తగా నుండుట కేర్పాటుచేసికొనబడునవి. అసలు కూర్చుండు పద్ధతులు కొన్ని యున్నవి ఆసనములనగా నవ్వి. అవి శారీరకములు. ఏ పద్ధతిగా కూర్చున్న స్థిరత, సుఖము రెండును కలుగునో ఆ పద్ధతియే యోగము నభ్యాసము చేయుట కనుకూలించు ఆసనము ప్రాణాయామాభ్యాసమునకు స్థిరసుఖ మాసన మత్యవసరము. హఠయోగ మా యాసనముల కింకను ప్రాముఖ్యమునిచ్చి శారీరకములయిన ఆసనములను బహువిధముల ప్రదర్శించినది శరీరము యొక్కయు మనస్సు యొక్కయు చంచల స్థితియైన రజోధర్మమును పోగొట్టి స్థిరత్వమును కలుగజేయుననియు, యోగవిఘ్న కారణములయిన చిత్తవిక్షేప మూలములగు రోగములను నశింపజేయుననియు, ఆసనములను గూర్చి చెప్పి యోగమున కాసనము ప్రథమాంగమని సూచించినది.[1] మరియు నీ యాసనములను సలక్షణముగా వివరించుచో మొదట స్వస్తికాసనమే అందు పేర్కొనబడినది.

ఘటికాచలమాహాత్మ్యమున సప్త సంయములు శతశృంగపర్వతమున తపముచేయుటను చెప్పుచో కుక్కుటాది మయూరాంత నిగమనియమాసనమ్ముల నియతాత్ములై నిలిచి (2-49) నారని చెప్పబడినది. కుక్కుటాసనము మొదటిది, మయూరాసనము తుదిది, యనుసంప్రదాయమేదైన కలదేమో తెలియదు. అది నిగమ నియమమనియు రామకృష్ణుడు చెప్పుచున్నాడు. తెలిసిన వారి విషయము నింకను విచారింపవలయును. మరియు ఋషులకు ప్రత్యక్షమైన ప్రసన్ననరసింహుని కూడ రామకృష్ణుడు "పద్మాసనంబున బరగువాని" గను "యోగపట్టిక నొప్పనూరుద్వయంబుపై దొరయనిల్పిన కేలుదోయివాని" గను (3-8) వర్ణించినాడు. మహర్షులు కోటినవరములో కూడ బ్రాహ్మణులు యోగపరాయణులగుటను చొనిపి చెప్పినాడు (3-26) అమ్మవారి విషయముననను అబ్జాసనమును (3-64) స్మరించినాడు.

వైఖానసులు బ్రహ్మపంపున వచ్చినవారు దేవతాగృహమున స్వస్తికాసనముల నిలిచినారనియు, ధౌతులై దేహశోధన మాచరించి ప్రాణా

1. హఠయోగప్రదీపిక (శ్రీస్వాత్మానంద యోగీంద్రులు) పుటలు. 1.15, మరియు చూడు: శ్రీవివేకానందుని యోగము. పుట 27. యమముఖ పూర్వ యోగమున సుస్థిరము కాని చిత్తమునకు తలపు నిలువ శక్తి యుండదని (2-246) రామకృష్ణుడును చెప్పినాడు.

యామపరత మై అంతరంగమును ఏకాగ్రముగ చేసిచేసినట్లు గాను(3-30)రామ కృష్ణుడు తెలిపినాడు

స్వస్తికాసనము మిక్కిలిసుఖకరమైనది. ఆరోగ్యప్రదమైనది. జపసిద్ధికి ఎక్కువగా నుపకరించునది.

ధౌతి దేహశోధన కర్మ. శరీర మల విమోచనార్థము యోగి ఆచ రింప వలసిన షట్కర్మలలో ధౌతి మొదటిది, ఇది నాల్గు విధములు[1]. వైఖానసులు ధౌతులై నారనగా జల సూత్ర-వస్త్ర- వన ధౌతికర్మలు నాలుగును ఆచరించినారనియే అర్థము. ఇది దేహముయొక్క లోపలి భాగమును శుద్ధి చేయు ప్రక్రియ.

ప్రాణాయామమునుగూర్చిన ప్రస్తావన చాలచోట్ల చేయబడినది. ఏకాక్షర ప్రాణాయామ పరత్వము (2-68) సప్తర్షుల విషయమున చెప్పబడినది. ఏకాక్షరము ఓంకారము కావలయును రామకృష్ణుడు ధారణాభేదము మూడు విధములుగా చెప్పినాడు. (2-69) ధ్యానము విషయమున మౌన ధ్యానమును రామకృష్ణుడు ప్రశంసించుచున్నాడు (2-68) మౌన ధ్యాన మనగా మానసికజపము. వాచిక, ఉపాంశువులకంటె మానసికము శ్రేష్ఠము. కొందరు ఉపాంశువు నంగీకరింపరు. (దర్శనోపనిషత్తు) మానసిక మందర కును శిరోధార్యమైనది.

హఠయోగము రాజయోగసిద్ధికి మూలమనియు, మరియు నా రెండును అన్యోన్యాశ్రయము లనియు చెప్పబడుచున్నవి.[2] పాండురంగ మాహాత్మ్యమున హఠరాజ యోగముల మర్మ మెరుంగవలయుట వక్కా ణింపబడినది (2-9) అన్యోన్యాశ్రయమైన పరస్పరోప యోగిలక్షణమే ఆ మర్మము కావలయును. మరియు పాండురంగ మాహాత్మ్యమున రామ కృష్ణుని యోగరక్తి నింకను పసికట్టవచ్చును (4-66-77). ఉద్భటారాధ్య చరిత్రమునందును అష్టాంగయోగ విషయోల్లేఖన మున్నది పరిశీలనము మీద సమన్వయము చూచుకొన వలయును. ఈఘటికాచలమాహాత్మ్యమున రామకృష్ణుడు చూపిన యోగాభ్యాసమున నయ్యేడు అంతరాయముల (2-247) విషయమును విచారింపదగి యున్నది.

---

1. హఠయోగ ప్రదీపిక, పుట, 49.
2. హఠయోగ ప్రదీపిక పుటలు 2-75.

## 24. రామకృష్ణుని శిథిల వైష్ణవము :

పాండురంగ మాహాత్మ్యమున రామకృష్ణుని వైష్ణవము శిథిలమైనదగుటకు దోహదముచేసిన బహువిషయములలో ఆయన రాధాచరిత్రము వ్రాయుట ఒకటి కావచ్చును. ముదిరిన వైష్ణవము సూచనలున్న ఘటికాచల మాహాత్మ్యమునను బృందావనమును, గోపికలను, నందగోపుని, యమునా తీరమును స్మరించుట కలదు (?-167). శ్రీమద్రామానుజుల వాసుదేవ వైష్ణవమున గోకులవ్యవహారములేదు.[1] రామానుజ సంప్రదాయశ్రద్ధ యెక్కువగాగల రాయలవారును గోపికలను, రాధనుస్మరించిరి. (5-67, 68). లక్ష్మీభూనీలాసహిత నారాయణ పరబ్రహ్మమునే శ్రీమద్రామానుజుల వైష్ణవము దర్శించినది. నింబార్కుడు వచ్చి వైష్ణవమును రాధాకృష్ణుల యొక్కయు, గోపికాసహస్రముయొక్కయు ప్రాధాన్యముచేత ముంచెత్తెను[2]. తెలంగాణమువాడై మధురాబృందావనమున స్థిరపడి శ్రీవైష్ణవమును రాధాకృష్ణ సౌరభముతో నింపినాడని నింబార్కుని మతమును రామకృష్ణు డభిమానించి యుండవచ్చును. శ్రీమద్రామానుజుల విశిష్టాద్వైత సిద్ధాంతము నం దాతరువాతి వైష్ణవుల కందరకును విశ్వాసముకుదురలేదు. అట్టివారిలో నింబార్కుడొకడు.[3] రామకృష్ణుడును తాదృశుడు కావచ్చును.

ఈ రాధాకృష్ణులతోడి వైష్ణవమును విపులప్రచారము కలదిగా చేసినవారు వల్లభాచార్యుడు, చైతన్యుడు.

మహారాష్ట్రదేశమునందలి వైష్ణవమున రాధలేదు లేదనగా బృందావనమునవున్నట్లు, బెంగాలుననున్నట్లు అన్నమాట. మహారాష్ట్రులు రుక్మిణీ శ్రీకృష్ణులను చుట్టుకొని వైష్ణవమును పెంచుకొనిరి.[4] నిజమునకు మహారాష్ట్రదేశములోని విఠలదేవుని మాహాత్మ్యమువ్రాయు రామకృష్ణుడు రుక్మిణీకల్యాణాదికమును వ్రాసియుండవలసినది. అట్లు చేయలేదు. అనగా రామకృష్ణుడు శ్రీమద్రామానుజులను అనుసరించలేదు. మహారాష్ట్రదేశపు టాచారమును మన్నింపలేదు. నింబార్కునిచేత మొదలుపెట్టబడి మరొక తెలుగువానిచేత[5] అందును తనకు సమకాలమునం దుత్తరదేశమున వెలిగి

1. The name of Gopalakrishna is conspicuous by its absence, and Ramanuja's system is free from that repulsive form which Vaisnavism assumes when Radha and other cowherdesses are introduced. V.S.P. 57.
2. Nimbarka gives almost an exclusive prominence to Krsna (Krishna) and his mistress Radha, attended on by thousands of her female companions. V. S. P. 66.
3. Nimbarka's Vedantic theory is monistic as well as pluralistic. V.S.P.63.
4. V. S. P. 89.
5. V. S. P. 77.

పోవుచున్నవానిచేత సుసంపన్నముచేయబడుచున్న వైష్ణవము పద్ధతిని రామకృష్ణు డనుసరించినాడు వల్లభుడుకూడ తెలుగుదేశమువాడు, క్రీ శ. 1479వ సంవత్సరమున జన్మించినాడు. చైతన్యుడు 1485వ సంవత్సరమున జన్మించినాడు తెనాలిరామకృష్ణుడు 1495 ప్రాంతమున పుట్టినవాడు. రామకృష్ణుకు తన సమకాలమున భారతదేశమున ఉజ్జ్వలముగా జీవించుచున్న వైష్ణవమునే సమాలింగనముచేసికొన్నాడు.

రామకృష్ణునికాలమునకు శ్రీవైష్ణవము శిథిలమైనది. క్రమముగా వైష్ణవము కృష్ణభక్తిగామారినది. దానికి శ్రీమద్రామానుజుల వేదాంతముతోసంబంధము తెగిపోయినది. శ్రీమద్రామానుజులకు పూర్వము వైష్ణవము కేవలమొక భక్తిమతము. రామకృష్ణునికాలమునను అదిఅంతే. మరియు గోలోకము - రాధాకృష్ణులప్రణయము-గోపికలు-బృందావనము ఈ మొదలైన సామగ్రి ఆవైష్ణవభక్తిని మరికొంచెము పలుచనచేసినది. ఈ పలుచబడినవైష్ణవమును నిలబెట్టు ప్రమాణగ్రంథముగా బ్రహ్మవైవర్త పురాణము ఆకాలముననే రచింపబడినది.[1] శిథిలమై పలుచబడి పోవుచున్న వైష్ణవమును[2]-రామకృష్ణుడట్లే ప్రతిపాదించినాడు. దానిని బాగుచేసి నిలబెట్టవలయునన్న అభినివేశమును అతనికిలేదు. అతడు పుట్టుకచేత స్మార్తుడు అనగా అద్వైతి. భక్తిచేతశైవుడు. మతస్వీకారముచేతవైష్ణవుడు.మరియూ వైష్ణవమెట్లుండును ? రామకృష్ణునియందున్నట్లుండును.

ఘటికాచలమాహాత్మ్యములోని వైష్ణవముకూడ కొంత శిథిలమైనదియేకదా ! ఆకొంతలోకొంత శైవముప్రవేశించుటవలన. రామకృష్ణుడు భస్మధారణాదివిషయములను చెప్పుటచేత వైష్ణవవాతావరణమును అయినంతవరకు తెరమరుగు కావించెను. (1-3) ఘటికాచలమున మహర్షులకు

1. The extant Brahma-Vaivarta Purana is a revised, enlarged and totally changed work, and is most probably an apocryphal work of the Bhagavatas or Krishna worshippers, compiled in the eastern part of India specially in Bengal and perhaps in the early Muhammadan period of Indian History. PURANA Vol. III. No. I. P. 101.

2. The introduction of Radha's name and her elevation to a higher position even than Krishna's, operated as a degrading element in Vaishnavism, not only because she was a woman but also because she was originally a mistress of the cowherd god and her amorous dealings were of an overt character. V. S. P. 87.

ప్రత్యక్షమైననరసింహమూర్తితో పాటు ప్రమథవైభవముతోనున్న ప్రసవాయుధవైరియు కనిపించునట్లు చేసినాడు[1] (3-7). మరియు చిత్ర మేమనగా నరసింహస్వామిని మిక్కిలికంటివానిగా చేయుట (3-8). నృసింహుడు త్ర్యక్షుడని చక్రపినాకసాభయకరుడని ధ్యానశ్లోకమునందొక చోట నుండిన మాత్రాన[2] ప్రత్యేకముగా కావలయునని పోయి దానినాశ్రయించుట సహజముగాలేదు: జన్మతోడిదియైన శివవాసన నశించక విష్ణువునందు ఆలక్షణమున్నచో చూచిసంతోషింతమనుకొనుటయది. ఆలక్షణమును వెలికిదీసి చూపుట యది. ఘటికాచలమునకేగుటకుముందు సప్తసంయములు తపస్సు చేసిన శతశృంగ పర్వతమును కిరాతార్జునీయము జరిగినదిగా చెప్పెను (2-67). వైష్ణవమునిండింపబడవలసినచోట తప్పక రామకృష్ణుడు శైవము. నెట్లో ప్రవేశపెట్టును. కాంచీపురవర్ణనముచూడవచ్చును (2-208). ఆపద్యమిచట క్రొత్తగా వ్రాయబడినది గూడకాదు. ఉద్భటారాధ్య చరిత్రమున వల్లకీపురవర్ణనమున నున్నదానిని (1-151) అట్లే తెచ్చి ఇక్కడ ప్రవేశపెట్టినాడు. ఆగ్రంథమున ఉచితరమణీయముగా నున్న ఆ పద్య మిచట వైష్ణవమును శిథిలము చేయుచున్నది.

వైష్ణవమునకు శైవవాసన మరికొన్ని చోట్లకూడ కనిపించుచున్నది.[3] తొండైనాడునగల దివ్యతిరుపతులలో నొకటియైన తిరుకళ్వనూర్ - ఆదివరాహప్పెరుమాళ్ గలది - పెద్దకంచిలోని కామాక్షిసన్నిధిలో కుడిప్రక్కన కలదు మరొక దివ్యక్షేత్రమైన తిరుకోవలూరు త్రివిక్రమసన్నిధిని దుర్గాదేవి కలదు. మరొకదివ్యతిరుపతి తిరువత్తువక్కోడు సంపూర్ణముగా శైవక్షేత్రము శివాలయము వెనుక ఒక చిన్నవిష్ణుమూర్తి విగ్రహము కలదు. అంతే. తిరువళ్ళ దివ్యక్షేత్రమున (కేరళ) శ్రీమహావిష్ణుప్రసాదము విభూతి మాత్రమే. దివ్యతిరుపతుల విషయమేయిట్లుండగా నిందురామకృష్ణుని వైష్ణవమును చూచి ఆశ్చర్యపడ నక్కరలేదుకాబోలుననిపించుచున్నది.

---

1. ఇందువలెనే పాండురంగమాహాత్మ్యమునకూడ నృహరికి దక్షిణదిశను శివుడు వసించునట్లు చెప్పబడినది. (3-116)

2. 'సత్యజ్ఞాన సుఖస్వరూప మమలం క్షీరాబ్ధి మధ్యేస్థితం। యోగారూఢ మతి ప్రసన్నవదనం భూషాసహస్రోజ్జ్వలం। త్ర్యక్షం చక్రపినాక సాభయకరాన్ బిభ్రాణమర్కచ్ఛవిం। ఛత్రీభూత ఫణీంద్రమిందు ధవళం లక్ష్మీనృసింహంభజే' భారతి సెప్టెంబరు. 1955. పుట. 94

3 శ్రీగోపాలాచారియర్ సంపాదించిన నాలాయిర ప్రబంధం.

మరియు పాండురంగ మాహాత్మ్యమునగూడ ఈ శైవముకలదు. దీనినిగూర్చి ఒకముఖ్యవిషయము చెప్పబడవలసి యున్నది. పండరికి పుండరీకక్షేత్రమనియు పాండురంగపురమనియు పేర్లు కలవు. పండరినాథుడు విఠోబా లేక విఠలుడు విఠోబా, విఠల శబ్దములు విష్ణుశబ్దభవములు కన్నడమున. పాండురంగడు విష్ణువనియే మనమనుకొందుము. కాని హేమచంద్రుడు తనదేశినామమాల (VI-23)లో పండరంగ లేక పాండురంగ అనుశబ్దములు రుద్ర శివవాచకము లనిచెప్పెను. పండరీపురములో నొక శివాలయమును నున్నది. ఆశివుడు పాండురంగడు.* ఆదైవతము పేరుమీదనే పాండురంగపురము – పండరిపురము అని క్రమముగానైనది. క్రమముగా మరియు నాపురమునందలి విఠలునిప్రభావము పెరిగిపెరిగి ఆ శివునిమూలకునెట్టి ఆ శివునిపేరును విఠలుడే ధరించినాడు. అపుడు పాండురంగవిఠలుడైనాడు.[1] ఇనంతయు చెప్పుట యేలనగా పాండురంగమాహాత్మ్యమున మాహాత్మ్యకథనముచేసినవాడు శివుడు.[2] విన్నవారుశైవులు. అంతమాత్రమే కాక ప్రధానవిషయమైన పాండురంగడు శ్రీకృష్ణుడు శివుని పేరుపెట్టుకొని ప్రసిద్ధికివచ్చినవాడే అనిచూపుటకు. రామకృష్ణుడు మహారాష్ట్రదేశములోని పండరీక్షేత్రమాహాత్మ్యరచనకుపక్రమించుటలో అప్పటికింకను నిబిడముగానున్నలోపలి శైవవాసనకారణముకావచ్చును. అందువల్లనే పేరుమార్చుకొన్న విష్ణువును స్తుతింపబూనుకొనెను తానుశైవవాసననువిడనాడక వైష్ణవనామమును ధరించినాడు. తన కావ్యనాయకుడైన విష్ణువు వైష్ణవమును వీడక శివనామమును ధరించినాడు పాండురంగమాహాత్మ్యములోనిది ఇంకను శిధిలమైనవైష్ణవమన్న శ్రీమాన్ అనంతకృష్ణశర్మగారి వాక్యార్థమున కీయుదంతముకూడ బలమునీయవచ్చును.

కాని యొక్కవిషయమున్నది. వైష్ణవానాం యథా శంభువన్న భాగవత వాక్యమునుబట్టి వైష్ణవగ్రంథమున శైవమున్నదనగా నర్థము భక్తవైభవము వర్ణింపబడినదని. శివుడు విష్ణుభక్తులలో శ్రేష్ఠుడు. విష్ణువైభవము భగవద్వైభవము. భగవద్వైభవమెట్టిదో భాగవత వైభవమును అట్టిదే. ఈదృష్టితోగూడ పైయంశమును పరిశీలింపవలసియున్నది.

---

* పాండురాంగుడు-పాండురంగడుగా-పండరంగడుగామార్పుచెందియుండును.

1. V. S. P. 87, 88.
2. ఈ విషయమున రామకృష్ణుడు నారదపాంచరాత్రాగమమునే అనుసరించిన జాడ కనిపించుచున్నది. శ్రీకృష్ణునిమాహాత్మ్యమును తదారాధనవిధానము లను నారదుడు కైలాసమునకేగి శంకరునిముఖముగా తెలిసికొన్నట్లుందున్నది. See. V. S. P. 40

మరియు దశావతారవర్ణనవిషయమునను రామకృష్ణునిది శిథిలవైష్ణవమే ఈ ఘటికాచలమాహాత్మ్యమున నృసింహునిస్తుతించు మహర్షుల దండకమున దశావతారములు ప్రశంసయున్నది. అందుక్రమముగా 1 మత్స్య 2 కూర్మ. 3 వరాహ, 4 నృసింహ, 5. వామన, పరశురామ, 7. శ్రీరామ 8 బలరామ, 9 బౌద్ధ, 10 కల్కి అవతారములు పేర్కొనబడినవి ఈ వరుసలో నివియే పాండురంగమాహాత్మ్యము నందలి దశావతారస్తుతి యందును కలవు.(2-56 నుండి 65 వరకు మరియు 4-85). కృష్ణభక్తుడైన రామకృష్ణుడు దశావతారములలో శ్రీకృష్ణావతారమును చెప్పదగిన రెండు గ్రంథములలోను చెప్పకుండుట విలక్షణముగానున్నది [1] శ్రీకృష్ణ దేవరాయలు కృష్ణావతారము కూడ కలిపి కల్కితో పదకొండగునట్లువర్ణించినాడు (ఆముక్తమాల్యద. 4.17 నుండి 21 వరకు). శ్రీవైష్ణవ మత మంగీకరింపని బుద్ధావతారమును రామకృష్ణుడు వర్ణించిన వర్ణించుగాక - అతనిదెట్లును శిథిలవైష్ణవము. మరి రాయలవారేల వర్ణింపవలయును? ఆయన విశిష్టాద్వైత మతస్థాపకుడైన విష్ణుచిత్తులవారిచేత బౌద్ధమును పరాస్తము చేయించెనుకూడ (ఆముక్తమాల్యద 3-8).

వైష్ణవముకూడ బుద్ధుని అవతారపురుషునిగా అంగీకరించుట ఒకప్పుడు జరిగినదేమో విచారించుట యవసరము. అసలివైష్ణవులు బుద్ధుని యవతారము నేల యంగీకరింపరు? ఎందుకంగీకరింపరనగా - బుద్ధావతారమును చేర్పగా అవతారములు పదునొకండగుచున్నవి. దశావతారములన్న నియమమును నిలబెట్టుటకని బలరామావతారమును వైష్ణవేతరులు - స్మార్తులు - తొలగించిరి [2]. కాదన్నచో కృష్ణావతారములో నది యంతర్భవించునులెమ్మనిరి. కాని బలరాముడు ఆదిశేషుని యవతారము. శ్రీమద్రామానుజులును ఆదిశేషావతారరూపులే. ఆదిశేషునితోగల సంబంధము విషయమున బలరామ రామానుజు లిరువుర ప్రతిపత్తియు నొకటిగనే యున్నది. శ్రీమద్రామానుజులయందలి భక్తిప్రపత్తులచేత తన్మూలమైన ఆదిశేషునియందలి ప్రీతిహేతువుచేత తదవతారమైన బలరాముని భగవంతుని అనంతావతారములలో ముఖ్యాతిముఖ్యములయిన దశావతారము

---

1. జయదేవుడు(క్రీ శ. 1200) గీతగోవిందమున మొదటి అష్టపదిలో వర్ణించిన దశావతారములయందు శ్రీకృష్ణావతారమును పేర్కొనలేదు. బలరామ - బుద్ధావతారములు రెండును ఆయనచేత కీర్తింపబడినవి. రామకృష్ణుని పద్ధతికి మూలమైన పద్ధతి జయదేవునిదిగా నున్నది.
2. కేశవనామము లిరువదినాలిగింటిలోకూడ బలరామ నామములేదు.

లలో నుంచుటనే శ్రీవైష్ణవులుకోరిరి [1] తమకోరిక నీడేర్చుకొన్నచో అవతారముల సంఖ్య పెరుగును, అదికూడదు. దశావతారమన్న పేరట్లేయుండవలయును. ఉండవలయునన్నచో ఎవరిని తొలగించుట ? ఉన్న అవతారములలో ఇతర మతమువాడుగా కనిపించుచున్న దొక్కబుద్ధుడే. అతనిని తొలగించినచో హిందూ మతములోని ఇతరశాఖలవారికిని అభ్యంతరమంతగా నుండదు. ఈయాలోచనతో శ్రీమద్రామానుజీయులు బుద్ధావతారమును తెరమరుగునకు నెట్టియుందురు. ఇంతపట్టింపుతోడి యాలోచనలేని శ్రీవైష్ణవులు-రాయలు,రామకృష్ణుడు-వంటి వారుబుద్ధావతారప్రవేశమును నిషేధింపలేదు. ఇంతవరకు బాగుగనేయున్నది. శ్రీమహావిష్ణువుయొక్క సంపూర్ణావతారములు రెండింటిలో కృష్ణావతార మొకటియైనప్పుడు, తాను కృష్ణభక్తుడై యుండి దశావతారములలో కృష్ణావతారమును రెండు వైష్ణవగ్రంథములలోను రామకృష్ణుడు స్మరింపకుండుట యదివింత.

ఇచట మరొక్కవిషయమునుగూడ చెప్పవలయును. బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు "బలరాముని గూడ అవతారములలో జేర్చి పది నొకండు పద్యములు రచింపబడినవి. ఈపద్యములు రామకృష్ణకవి కృతములని ప్రతీతి" అనిప్రకటించినపద్యములలో కృష్ణావతారస్తుతిపద్యమున్నది [2]

కల్యాణగుణ పరిపూర్ణుడైన భగవంతుని వ్యూహ స్వరూపములలో సంకర్షణ నామమున వ్యవహరింపబడునది యొకటికలదు. అది పరవాసుదేవుని జ్ఞాన శక్తి బల ఐశ్వర్య వీర్య తేజస్సులలో మొదటి రెండుగుణములతోకూడి అయినదిగా నొకసంప్రదాయమున్నది. కమలాక్షుడు తనయోగశక్తిచేత రోహిణీగర్భమున ప్రవేశించి బలరాముడుగాపుట్టెననియు, ఆబలరామునకే సంకర్షణాఖ్య కలిగెననియు మరొక సంప్రదాయము చెప్పుచున్నది.[3] ఈరెండింటివిబట్టి చూచినను భగవంతుని వ్యూహములలో నొకడైన సంకర్షణుడునాబడు బలరాముడు శ్రీవైష్ణవులు భక్తిచేయుటకు పరమముఖ్యుడగుచున్నాడు. అందువలన బలరాముని అవతారములలో చేర్చు

1. పద్మ ఉత్తరఖండమున (పుట 282) భగవంతుని అవతారకథావిధానమున్నది. అందు బలరామావతార ప్రసక్తి లేదు మరియు పుట 279. శ్రీమహాభారతము శాంతిపర్వమున (6-399) అవతార విషయమున్నది. అందుకూడ శ్రీకృష్ణావతారము యొక్క సూచనయేయున్నది గాని బలరామావతార సూచనయైనను లేదు.

2. చాటుపద్యరత్నాకరము పుట. 42.

3. ధరణిదేవుల రామయమంత్రి - దశావతారచరిత్రము. పుట. 260.

కొని బుద్ధుని శ్రీవైష్ణవులు తొలగించియుందురని చెప్పవచ్చును.[1] ఈ విషయమునపట్టుదలలేనివైష్ణవులుబలరామునితొలగింపక సంఖ్యానియమమును గణింపక అదియునుగాక నింకనురానికల్క్యవతారమును గణించుకొననేల యని దశావతారములను యథేష్టముగా పాటించుచున్నారనుటలో తప్పు లేదనిపించుచున్నది.

శ్రీమన్నారాయణుని లీలావతారము లనంతప్రకారములు. అందువలన ఒక్కొక్కచోట ఒక్కొక్కవిధముగా నవి చెప్పబడుచుండును. భాగవతమున మూడుచోట్ల భగవదవతారవైభవకథనమున్నది [2] ఒకటి యున్నట్టు మరొకటిలేదు ఈయన్నిచోట్లను అవతారములు పదిసంఖ్యను మించియేయున్నవి. పదికిఅవతారములనునియమముచేసినకాలము తరువాత వచ్చినది శ్రీమహాభారతమున 1 వరాహ 2 నరసింహ 3పరశురామ 4రామ 5 కృష్ణ 6 మత్స్య 7 కూర్మ అవతారములు స్మరింపబడినవి.[3] ఆ పిమ్మట వామన, బుద్ధ, కల్కి అవతారములుకలుపబడి పదిసంఖ్య నియతమైనది. భాగవతము బలరామకృష్ణావతారములనుకలిపిచెప్పిపృథగ్గణనముచేసినది[4]. భాగవతమున దశావతారసంఖ్యా నియతిలేదుగనుక ఎన్ని అవతారములను

1. శ్రీరామ - పరశురామ-బలరామావతారములు క్రమముగా పూర్ణ - ఆవేశ - అంశావతారములు, భగవంతుని అవతారమునకు ప్రధానమైన మూడు పద్ధతులలో నొకటి గనుక బలరామావతారము దశావతారములలో చేరినదని కొందరందురు. మరియు శ్రీరామావతారమున తాను జ్యేష్ఠుడై తమ్ముడైన భక్తుడు లక్ష్మణునిచేత సేవచేయించుకొని - భక్తునిఋణమును కృష్ణావతారమున తాను తమ్ముడుగాపుట్టి భక్తుని పెద్దచేసి సేవించి తీర్చుకొన్నాడని భగవంతునిగూర్చి చెప్పుటయుకలదు అందువలన భక్తుడైన బలరామునకు భగవంతుని స్థానములభించుటను కీర్తించుటగా తదవతారము దశావతారములలో నొకటియైనదనిభావము. బలరామావతారము భక్తవైభవలక్షణలక్షితము. ప్రతివాదభీకర రాఘవదేశికేంద్రులశిష్యుడు, తర్కవేదాంతసిద్ధాంత పద్ధతి శ్లేమయుతుడు. ఆంధ్ర గీర్వాణ కవితామనోహర కల్పనుడు, భరద్వాజసంతతి జాతుడు, సుభద్రార్య నామధేయుడు- దేశకాలములవిషయము తెలియబడనివాడు "రేవతీనామ బలరామ రిపువిరామ" అను తేటగీతపాదమకుటముతో నొక సీసపద్య శతకమువ్రాసి బలరామావతారము కీర్తించియున్నాడు. చూడు R. No. 365.

2 ప్రథమస్కంధము 26. ద్వితీయ స్కంధము 113-201. ఏకాదశ స్కంధము 71, 72.

3. శాంతిపర్వము 6-388.

4 ద్వితీయ స్కంధము 176, ప్రథమ స్కంధము 26.

పృథగ్గణనముచేసినను దానికి నేగిలేదు. సంఖ్యానియమ మేర్పడిన తరువాత బలరామావతారము తొలగింపబడుటగాని లేక కృష్ణావతారములో లీనము చేయబడుటగాని జరుగుచున్నది[1]. అగుచో నసలు కృష్ణావతారమునే రామకృష్ణుడు దశావతారములలో పేర్కొనకుండుటకు కారణము కానరాదు. బహుశః ఇది కావచ్చును - అవతారపురుషులు దేశకాలములచేత బద్ధులు. పరమేశ్వరుడు దేశకాలాద్యవచ్ఛిన్నుడు. పరమేశ్వరేశ్వరుడైన కృష్ణుని అవతారములలో చేర్చకుండుటయే గౌరవమని రామకృష్ణుడు భావించియుండు ననవచ్చును.[2] కాని ఇదియు నమ్మకములేదు. ఆయనను గురించి ఏమాటగాని గట్టిగా చెప్పుటకు వీలుకాదు. శ్రీవేంకటాచలము చేరిన సప్త మహర్షులు "స్వామి పుష్కరణికూలంబుననిలిచి సౌగంధికబంధురసుగంధ గంధిలంబులగు తత్కబంధంబులకృతావగాహనులై" నారని (2-173)చెప్పి మరియు చివరకు తన్మందిరము వెలువడి దిగివచ్చుచు "అఘహరవారియౌ నయ్యాళువారితీర్థ మటగాంచి స్నానములాడి"నారనినాడు (2-195). ఆళువారితీర్థమునుబట్టి ముదిరిన వైష్ణవమనుకొన్నచో స్వామి పుష్కరిణిని బట్టి శిధిలవైష్ణవమనుకొనవచ్చును

మరొక్క ప్రధాన విషయమునుగూడ నిట ప్రస్తావింపవలయును. తిరుమల తిరుపతి వేంచేసియున్న శ్రీవేంకటేశ్వరస్వామి వారిని దర్శించిన వసిష్ఠాది మహర్షులు "భువనముల్ పుట్టింప పోషింప నణగింప కర్తయైన ప్రధానమూర్తి వీవ"(2-1?4) అనిస్తుతించినట్లుగారామకృష్ణుడువ్రాసినాడు. ప్రధానమూర్తి-అనగానే సాంఖ్యుల మూలప్రకృతి స్ఫురించుచున్నది. "సాంఖ్యులు త్రిగుణము నచేతనము నగుప్రధానము స్వతంత్రమగుజగత్కారణ మనితలచుచు ఏవేదాంతవాక్యములు సర్వజ్ఞము సర్వశక్తియు నగు బ్రహ్మమునకు జగత్కారణత్వముం బ్రతిపాదించునని చెప్పితివో అవిప్రధాన

1 కొందరు దీనినిగూడ పాటింపక బలరామావతారము లేక బుద్ధావతారము అని చెప్పుచున్నారు. A Hand Book of South Indian images. Page 44. మరియు బలరామావతారమునకు పూజ పురస్కారము తక్కువ పుట 51.

2. Krishna, of course, though included in the Avataras stands on independent grounds, and his worship over the widest area is due not to his having been considered an Avatara, but to his being the peculiar object of adoration to the followers of new religion or religious reform, which first took its rise among the Satvatas. V. S. P. 42.

కారణ పక్షమునందే యన్వయింపదగినవి యనియు, సర్వశక్తిత్వము తన వికారముల నపేక్షించి ప్రధానమునకే యుపపన్నమనియు, సర్వజ్ఞత్వము గూడ నిట్లేసరిపడుననియు చెప్పుచున్నారు.[1]" శ్రీమద్రామానుజులు అచేతనమైన ప్రధానమునందు ఈక్షణక్రియాయోగము అనగా జగత్కారణత్వము సంభవముకాదని స్పష్టముగా శ్రీభాష్యమున ప్రతిపాదించి యున్నారు. రాయలవారును అన్యమతఖండనమున ఈప్రధాన వాదమునే అనగా "జగదుద్గతికినిబీజముప్రధానమన"ను వాదమునే మొట్టమొదట ఖండించినారు. (ఆముక్త 3-8). తానువైష్ణవమున క్రొత్తగాప్రవేశించి, ఆ మతమున కనుకూలముకాని విషయమునే ఏలప్రతిపాదింపవలయునో అది రామకృష్ణునకే తెలియవలయును.

మరియు నామహర్షుల స్తుతిలో శ్రీ వేంకటేశ్వరుని "బ్రహ్మపదార్థ మీవ"అని యనుటకలదు ఈబ్రహ్మమును సగుణవిశిష్టుడును,ఈశ్వరుడును, దివ్యశరీరియునైన విశిష్టాద్వైతబ్రహ్మముగాభావించుటకు వీలున్నది. అట్టి వీలు ఏమాత్రముకూడలేకుండ ప్రధాన శబ్దమును ప్రయోగించినాడు శిథిల వైష్ణవుడు రామకృష్ణుడు.

బ్రహ్మపదార్థమునువలెనే నిరాకారుడు అనుటకూడ అద్వైతపు ధోరణియేకావచ్చును. "రూపదీపితుడ వరూపుడ వఖిలస్వరూపుడవు" (3-48). ఈవాక్యము నింకను విచారింపవలెను.

## 25. రామకృష్ణుని వైష్ణవతెగ :

శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు రెండు కారణములచేత రామకృష్ణుడు వడగలతెగవాడు కావచ్చునన్నట్లువ్రాసిరి[2]. కావచ్చును. రెండవతెగ తెంగల. వడగల ఔత్తరాహము, తెంగల దాక్షిణాత్యము[3]. ఇట్లనుటకంటె క్రమముగా నీరెండును ఆర్య ద్రావిడ వాసనా వాసితము లన్న బాగుండు ననుపించు చున్నది. వడగలశాఖవారికి శ్రీమద్రామానుజ సంప్రదాయమునందు భక్తి శ్రద్ధ లెక్కువ. తాదృశమైన భక్తి శ్రద్ధ తెంగలవారియందు కొంతతక్కువ. భగవ దనుగ్రహ, పురుషప్రయత్నముల విషయమునకూడ ఈరెండుతెగలవారికిని చూపు వేరువేరుగా నున్నది.

---

1. ఆంధ్రసూత్రభాష్యము (శ్రీపురాణపండమల్లయ్యశాస్త్రిగారు) సంపుటము 1. పుట.73.
2. పాండు (సాహిత్య అకాడమి) ఉపోద్ఘాతము. పుట. 18.
3. V. S, P. 56.

వడగలవారిది మర్కటకిశోరన్యాయము ననుసరింపగా తెంగలవారిదృష్టి మార్జాలకిశోరన్యాయము వైపుపోయినది. కర్మ జ్ఞానభక్తియోగములను పాటింపలేనివారికిఅంతకంటె సులభోపాయము ప్రపత్తిఅని వడగలవారనగా అదికాదు- లేనివాడు, కలవాడు అన్నది లేదు- సర్వులకును ప్రపత్తియే శరణ్యమని తెంగల వారందురు. మరియు ప్రపత్తియే మొదట చేయదగిన దనియు నందురు.[1] శ్రీమద్రామానుజుల మతమే కొంత బ్రాహ్మణమతము. ఆకొంత నింకను పెంచి పెద్దచేసినది వడగల తెంగలవారట్లొప్పుకొనరు. సర్వవిధములనుసర్వులు సమానులన్నది వారి మతము. ఈవిధముగా నిరువురకును పదునెనిమిది ప్రధానభేదము లున్నట్లు తెలియుచున్నది.

రామకృష్ణుడీ రెండింటిలో నేశాఖయం దభిమానముకలవాడు? ఈ విషయమున ఇది యని చెప్పలేము. అనుమానముమీద తెలిసికొనుట కైనను అవకాశములు మృగ్యములుగా నున్నవి. (1) తిరువారాధనములో తెంగలశాఖవారు గంటవాయింపనంతమాత్రమున పుండరీకుడు బడిఘంట మొరయజేసినట్లు(2-22) రామకృష్ణుడు వ్రాసినందున వడగలతెగవాడు కానక్కరలేదు. స్మార్తుల దేవతార్చనమునను గంటవాయింపుడున్నది. ఆ పూర్వస్మృతితో పాండురంగమాహాత్మ్యమున ఆయన అట్లు వ్రాసియుండ వచ్చును ఎట్లును శిథిలవైష్ణవమేకదాఅతనిది? మరియును కొంతవైష్ణవము ముదిరినపిమ్మట వ్రాసిన ఘటికాచలమాహాత్మ్యమున గంటవాయింపసలు లేకుండనే చేసినాడు. మరియిక్కడ ఏతెగవాడుగా చెప్పవలయును? (2) ఖండోజికి ఈఘటికాచలమాహాత్మ్యమును తీసికొనిపోయి ఇచ్చిన 'రామకృష్ణునిమనుమడు' వెదురాకువంటి తిరుమణి నుదుట ధరించినట్లు చెప్పబడి యున్న దానినిబట్టి (అవతారిక.12) రామకృష్ణుడు వడగలయనుట పైదానంత సులభముగా త్రోసివేయదగినదికాదు. ఆ "రామకృష్ణునిమనుమడు" సరిగా రామకృష్ణుని కూతురుకొడుకో, కొడుకుకొడుకో కాదు. రామకృష్ణునకు నూరునూటయేబది సంవత్సరముల తరువాత ఆవంశము లోని వాడవని చెప్పుకొన్నవాడు. వాడు పెట్టుకొన్నబొట్టును పట్టుకొని వానితాతముత్తాతల మతభావములను నిశ్చయించుట కుదురదు. అనేకాంతము మతములను మార్చుకొన్నవంశములో పురుషాంతరములమీద మరెవ్వరును మారలేదని అనుకొనుటయెట్లు? అదికారణముగా ఆ మనుమని వెదురాకువంటి తిరుమణి రామకృష్ణుని వడగల శాఖకు చెందుటకు ఋజువు కాదు.

---

1. V. S. P. 56.

ఇంతకును రామకృష్ణుడు వడగలతెగవాడు కానక్కర లేదనిచెప్పుట యైనది. తెంగల తెగవాడని చెప్పుటకాలేదు. ఆమాటచెప్పినను అదియు కానక్కరలేదని చెప్పవచ్చును. శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు చెప్పినట్లుగా[1] "అసలుబుడమే భద్రములేనిరామకృష్ణుని యావైష్ణవములో, అది వడగల సంప్రదాయమూ, తెంగల సంప్రదాయమా అనుప్రశ్న వట్టి వినోదము మాత్రమే"

## 26. రామకృష్ణుడు సురారామగజము :

తెనాలి రామకృష్ణుడు చాలజాగ్రత్తగా శ్రద్ధాసక్తులకలిమిని సమీక్షించవలసిన ప్రౌఢకవిశేఖరుడు. అతనిని గురించి ఎవరేమిచెప్పినను ఒక్క పాండురంగమాహాత్మ్యమును పట్టుకొనియే చెప్పుదురు. మిగిలినవానికృతు లందుబాటులో లేకపోవుటయు నందుకొక కారణముకావచ్చును. ఆంధ్ర భాషాకవులలో ప్రతిభావ్యుత్పత్తులచేత నేగాక మతతాత్త్వికభావములచేతను రామకృష్ణుడు విలక్షణమైనవాడు. ఆయనమూడుకృతులను కూలంకషముగా అధ్యయనము చేసినగాని ఆయన లోతుపాతులు తెలియవు. వైష్ణవగ్రంథములు రెండును ఇప్పుడందుబాటులో నున్నవి. శైవగ్రంథముగూడ ఇట్లే రావలయును. మూడుకృతులమీద రామకృష్ణుని అధ్యయనము చేయుటకు వలయుభూమికగా కూడ పనికిరావలయునని ఈ యుపోద్ఘాతము వ్రాయబడినది.

రామకృష్ణుని జన్మతోడిదిశైవమనియు అతనియెడ వైష్ణవముశిథిలమైనది యనియు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు[2], శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు[3] చెప్పిన వాక్యార్థములను రామకృష్ణునికృతులను ముందు పెట్టుకొని ఋజువు చూచుకొనుటకు మొదలు పెట్టినచో ఇంతకు పూర్వము మన కపరిచితములయిన రామకృష్ణుని బుద్ధిభూముల నిమ్నోన్నతముల మంచిచెడ్డ లవగతములగును. అతడు క్రొత్తగా కనిపించును. అతని అసలుమూర్తి ఇంతవరకు మనకు తెలిసినది కా దనిపించును. రామకృష్ణుని కావ్యతత్త్వవిచారము చాల దొడ్డది. మరియు నీఘటికాచలమాహాత్మ్యము బహురసాలంకారభావ నానార్థవిభాసురంబు (3-68) అని చెప్పినాడు. మరి ఆ ఈ కొలతలతో అతని కృతులు కొలువబడినప్పు డెట్లుండునో చూడవలసియున్నది శైవవైష్ణవముల వలన రామకృష్ణునకును,

1. పాండు. (సా) ఉపోద్ఘాతము పుట. 18.
2. తెలుగు విజ్ఞాన సర్వస్వము. పుట. 1002.
3. పాండు (సా) ఉపోద్ఘాతము. పుట. 17.

ఆంధ్రభాషావాఙ్మయములకునుజరిగినమేలుకీడులను పరిశీలించినప్పుడాయన స్థితిగతులిప్పుడున్నట్లుండవు. అతనికృతులు మనకీవిధముగా నర్థమగుకొలది అతని మన స్వామతభావములతాకిడివలన నెట్టిప్రవృత్తికలదైనదియు బోధపడును. ఈయుపోద్ఘాతము దదభిముఖముగా నుండుట లక్షింపబడినది.

రామకృష్ణునికృతులమీద పరిశోధనలుచేసినవారుకలరు ఆంధ్రవిశ్వవిద్యాలయమున శ్రీ వేదాంతం గోపాలకృష్ణమాచార్యులు, శ్రీ ఎక్కిరాల రామకృష్ణమాచార్యులు, మద్రాసువిశ్వవిద్యాలయమున శ్రీచిన్నికృష్ణయ్య థీసిస్సులు వ్రాసిరి అమూల్యములును, అపూర్వములును అయిన విశేష విషయములు కొన్నియైనను ఆథీసిస్సులలో ఉండియుండును. అవిఅముద్రితములు. అందువలన నేనువాటినిచూడలేదు పైముగ్గురలో రామకృష్ణుని గూర్చి ఎక్కువకృషిచేసిన శ్రీఎక్కిరాల రామకృష్ణమాచార్యులు, శ్రీ చిన్నికృష్ణయ్య వంటివారు కొన్ని క్రొత్తవిషయములను చెప్పగల్గుదురు.

నాకుతెలిసిన, నాకు తోచిన కొద్దిపాటి విషయములను ఫలితాంశములను పరిగణించుట పెట్టుకొనకుండ వట్టివిషయములుగానే ఈయుపోద్ఘాతమున ప్రతిపాదించినాను. ప్రాచీన కావ్యప్రబంధ సంపాదకత్వము వహించినవారు అవి మరియు నర్థమగుటకు వలయువిషయములను వివరించుట, ఆయాకృతుల సాహిత్యపు విలువలను కీర్తించుటకంటెను, అది వారి ప్రథమకర్తవ్య మను ధర్మమును దృష్టియందుంచుకొని నాచేర్చిన ట్లీయుపోద్ఘాతమును రచించితిని రామకృష్ణుని కృతుల యర్థముతో సంగతమొనరించుట కీనాప్రయత్నము దోహద మేపాటిచేసినను దీని సాఫల్యత సార్థకమైనట్లే లెక్క – ఇందలి గుణదోషముల సంగతి యెరిగినవారెరుగుదురు – సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః [1]

ఇతిశివమ్

ప్లవంగ–మహాశివరాత్రి
26, ఫిబ్రవరి, 1968

కేతవరపు రామకోటిశాస్త్రి.

---

1. శ్రీమద్భగవద్గీత, 18-48.

# ఘటికాచల మాహాత్మ్యము

## అవతారిక

శా. శ్రీకాంతాకుచ భూధరేంద్ర యుగళీ సిందూరపత్రాంక బా
హాకల్పద్రుమశాఖలన్ మెఱసి లోకానందసంధాయియై
యాకల్పంబుగఁ దానభీష్టఫల [1]మీయంజాలు గీర్వాణలో
కైకశ్రేష్ఠుఁడు కృష్ణుఁడీవుత సిరుల్ ఖండోజిభూభర్తకున్. 1

సీ. కోడెమీలకు సిగ్గుకుప్పలించు వినీల
కైరవచ్ఛవిదాయి కన్నుదోయి
చిఱుతరూపునవచ్చు చిన్నారిపొన్నారి
యలల యందముఁజూపు వళులయేపు
పాలమీఁగడ మిన్న పైకొన్నగిరికన్నఁ
గొమరుగా రుచిగ్రమ్ము కుచయుగమ్ము
అరిదిదీవులమేలు నవఘళింపఁగఁజాలు
చలితకాంచీదామ జఘనసీమఁ
గలిగి పుట్టింటిచిన్నెలఁ జెలఁగునట్టి
కలశవారాశిపట్టి విఖ్యాతమహిమ
నిరుపమప్రాజ్యసామ్రాజ్య వరవిభూతి
కరుణనీవుత ఖండోజిధరణిపతికి. 2

ఉ. రాజమరాళ పాండురతురంగము నెక్కిన రాయరాతు నీ
రేజగృహాసహాయుఁడగు శ్రీహరి [2]పాక్కిలితమ్మికుఱ్ఱ వా
ణీజలజేక్షణాకమలినీదెననేత విధాత యిచ్చు ఖం
డోజివిచిత్రరాయుని కనూనమృకండుసుతాయురున్నతుల్. 3

శా. నిండారం దెలిదమ్మినుండి మదినెంతేవేడ్కతో సత్కళా
పాండిత్యంబు కరంబు రాచిలుకకాపాదించు నావల్లకి

1. మియ్యం. పూ. ము. 2. పొక్కిటి. పూ. ము.

దండాలంకృతపాణి వాణి యొసఁగున్ దాక్షిణ్యవారాశియౌ
ఖండోజిక్షితిపాలచంద్రునకు వాక్కల్యాణపారంపరిన్. 4

శా. ఆలోలాత్మసకృత్కృతప్రణయగంగాలింగనప్రోల్లస
ల్లీలాభోగి తనూహరిద్రలను హాళింజూచి లోనల్గు నా
ర్యాలీలావతి మానసం బెఱిఁగి యాహారిద్రవర్ణంబు స
వ్యాలోకంబున మాటుశంకరుఁడు కావ్యస్వామినిం బ్రోవుతన్. 5

ఉ. పుట్టదుపూరి నాతలనుబుట్టినకుంభములందు నీయెదం
బుట్టినకుంభయుగ్మమున బుట్టెసుధారసధార [1]తెల్పుమీ
గుట్టని పోరువెట్టు నలకుంజరవక్త్రునిఁజూచి నవ్వు నా
గట్టులఱేనిపట్టి దయ ఖండోజిరాయనిఁ బ్రోచుగావుతన్. 6

చ. గరళశశాంక రేఖలను కంఠశిరంబులనుంచి మించు భూ
ధరతనయాసహాయుగతి తప్పులుగల్గినలోనణంచి పై
సరసగుణంబుఁగల్గ గడుసన్నుతిసేయుపురాణసత్కవీ
శ్వరకులసార్వభౌములను వర్ణనసేయుదు నెమ్మనంబునన్. 7

చ. ఋషభషలైన కొన్నియపశబ్దములంగృతిసెప్పి కామపౌ
రుషముల కాళ్ళుగట్టుకొని రూఢికినెక్కఁదలంచి శేముషీ
ధిషణులమంచు వాదులకు[2]దీయను కాకవులాడువాక్యముల్
విషకవళంబుగాఁదలఁచి వీనులఁబెట్టరు సత్కవీశ్వరుల్. 8

వ. అని యిష్టదేవతానమస్కారంబును శిష్టకవిపురస్కారంబును దుష్టకవి తిరస్కారంబునుఁ గావించి కవిజనవనవసంతుండును కామినీనవీన కేళీనీరమణుండును కదనభూతల పరిపంథి సింధుర కంఠీరవకులధురంధరుండును కమనీయనిజయశఃకౌముదీసుధాధవళీకృత దిగంతరాళుండును కమలనిలయాసహాయ వేణుగోపాలచరణార విందయుగళభ్రమరాయ[3]మాణమానసుండును మదీయజనావనబద్ధకంకణుండును మదీయసఖుండును మదీయసహోదరకోటిప్రవిష్టుండును నై పొల్పు ఖండోజి క్షోణీమండలాఖండలుపై బంధురంబుగా నొకానొక మహాప్రబంధంబు రచియింపం బూనియున్న సమయంబున. 9

1. వేల్పు. తా. 2. దియ్యను. తా. 3. మాన. తా.

సీ. వైరిప్రతాపంబు వడిఁగట్టి నట్టిచం
దాన నెవ్వాని శోణధ్వజంబు
కమలసాయకుసోయగము మూర్తిగైకొన్న
కరణి నెవ్వాని యాకారమహిమ
భుజభుజంగమనాథ భోగనారాయణ
చ్ఛాయ నెవ్వాని కౌక్షేయకంబు
అకలంకనలినగేహకు ద్వితీయగృహంబు
కైవడి నెవ్వాని కన్నుదోయి
వరఁగు నాతఁడు నిఖలభూపాలజాల
నిరుపమామృతరసహేతునిజనిటాల
వర్ణితానూనసౌభాగ్యవర్ణపాళి
రమ్యగుణశాలి ఖండోజిరాయమౌళి 10

సీ. హారులెక్కి చనుదెంచి సరిదొరల్ తనతోడ
వేడ్కతోమాటాడ వేళచూడ
కలితకార్యవిచక్షణులు రాయసముప్రాయు
ఘనులు వాకిటిదండఁ గాచియుండ
శ్రీమించ బిరుదుమాస్టీలు పంతములుమిం
చను హజారముచాయ చౌకసేయ
భద్రేభయానలు భరతశాస్త్రప్రౌఢి
మురిపెముల్ నింప ముందఱనటింప
బంధురానూనసకలప్రబంధకలన
మహిమఁగాంచిన కవిశిఖామణులచేత
రాణమీఱ పురాణభూరమణకథలు
హాళివినుచుండ నచ్చటికద్భుతముగ. 11

క. వెదురాకువంటితిరుమణి
నుదుటంగలవిప్రుఁడొకఁ డనూతనకావ్యం
బదిగైకొని చెంతకుఁ జని
ముదముననాశీర్వదించి మొగినిట్లనియెన్. 12

శా. ఓ ఖండోజివిచిత్రరాయ విను నీవొక్కండుదక్కంగ నా
శ్రీఖండాచల శీతలాచల ధరాసీమాబ్ధిరాణ్మేఖలా
లేఖాధీశులలోన కావ్యసుమనోలీలాసుగంధప్రయో
గాఖండీకృతమానసుల్ దొరక రాహా మందుకైనన్ మహిన్. 13

చ. భువిని విచిత్రవాక్సరణిఁబొల్చిన తెన్నలిరామకృష్ణస
త్కవికులవజ్రపాణి ఘటికాగిరినాథమహాచరిత్రమున్
సవరణగా రచించి కృతిసంతతికన్యక కెన్న యోగ్యుఁడై
ధవుఁడొకరుండు[1] లేమికిని తామదిలోన వితాకుఁజెందుచున్ 14

సీ. పొలుపేది పుట్టులోభులపాలుచేసిన
పశుమూల్యమాత్రంబు ప్రాప్యమనుచు
మూఢాత్ములైన కాముకుల కర్పించిన
నెనరుతోఁ బాలింపనేరరనుచు
ఎదిరిఁ దక్నైఱుఁగని హీనులకిచ్చిన
వసుమతి నపకీర్తి వచ్చుననుచు
మత్సరగ్రస్తపామరులకీఁదలఁచిన
విడువక నొలమూలవేతురనుచు
నెంచి కృతికన్యనింటనేయుంచెనాతఁ
డాతనియభీష్టసిద్ధి నేఁడయ్యె ననుచు
నిన్నువిని తెచ్చినాఁడ నా నిరుపమాన
కావ్య మిది కొమ్ము భాగాంబికాతనూజ. 15

గీ. అనుచు నొసఁగినఁ గైకొని యతని యిష్ట
సిద్ధిఁగావించి [2]సంతుష్టిసిద్ధుఁడగుచు
నన్నురావించి యర్ధాసనమునునుంచి
పలికె నుదమేఘ గంభీర భాషణముల. 16

మ. పదసందర్భవిశుద్ధి ప్రౌఢతరశబ్దప్రక్రియాబుద్ధి పా
రదగంభీరచతుర్విధప్రథితధారాసిద్ధి ప్రాపించి [3]సం

1. లేమికినితా. తా లేమిగని. పూ. ము, 2. సంతుష్ట. తా. 3. నంసదభిద్య
ద్విభుధావలిన్ వినుతినెచ్చన్. తా.

సదభిర్వృద్ధిగిరిరాజసోదరత యెచ్చన్ మించు పుంభావ[1] శా
రదవీవేగదవన్న వేంకటగిరీంద్రా! సాంద్ర మేధానిధీ! 17

క. విదితప్రబంధములు వే
డ్కదనరఁగ మదంకితముగఁ గావించి ననున్
మొదల పవిత్రము చేసితి
సదయాత్మా! విచిత్రరాయచంద్రవతంసా! 18

గీ. ధరణి తొమ్మిది లిబ్బులు దాఁచుకొన్న
వాని కైనను ధనకాంక్ష పోనియట్లు
కృతులు పదివేలు గైకొన్నఁ గీర్తికాముఁ
డైనవానికిఁ జనదు కావ్యాభిలాష. 19

ఉ కావున రామకృష్ణ కవికల్పితకావ్య మొకండు దెచ్చి స
ద్భావముతోడ నా కతనిపాత్రుఁడొసంగె మదంకితంబుగా
నీవిఁక హారనాయకమణిప్రతిమానముగా మదీయవం
శావళిచెప్పి కూర్పుము యశంబు భృశంబుగ సంఘటిల్లఁగన్. 20

వ అని నన్ను బహుమానపూర్వకంబుగా సకర్పూరకార్త స్వరదుకూల
సార ఘనసార వాసనాలోలతాంబూలంబుల నాదరించుటయు నేను
పరమామోదసంభరితాంతరంగుండనై యభినవంబుగను గృతివిభు
నభిజనావళి నభివర్ణించెద. 21

సీ వాగీశ్వరీవక్త్ర వనజసారంగంబు
కలహభోజనమౌనిఁ గన్నతండ్రి
సప్తలోకీచరాచర కల్పనాచణుఁ
డామ్నాయరత్నరత్నాకరుండు
కలశాబ్ధిశాయిపొక్కిలితమ్మి పసికందు
తోయజాతాస్త్రుని తోడఁబుట్టు
పాలును నీరు నేర్పఱచు తత్తడిరౌతు
కడుపు బంగారుబొక్కసమువాఁడు

1. శారదనీవేగద యెన్నగా సుకవిచంద్రా! సాంద్ర మేధానిధీ. శారద నీవేగద యెన్న వేంకట....తా.

నలుమొగంబులవాఁడు వేల్పులకుఱేఁడు
ప్రతుకఁబొద్దుల జనులకు నుదురుటాకు
[1]కవితెను లిఖింపనేర్చిన [2]కరణికుండు
గరిమనొప్పారు ధాత జగద్విధాత. 22

ఊ. [3]వశగీభూత సమస్తసర్గుఁడగు నా వాగీశ్వరీభర్తకుం
గుశికుండాత్మజుఁడయ్యె నాతని కరిక్రూరప్రతాపార్కుఁడై
కుశనాభుండుదయించె గాధినృపుఁడాకౌశికుకుంబుట్టె నా
శశభృత్కీర్తికి గాధికిం బొడమె విశ్వామిత్రుఁడత్యున్నతిన్. 23

క. అక్కులమున నక్కజముగఁ
బెక్కండ్రు జనించి రతులపృథ్వీనాథుల్
దిక్కామేఁముఖ చికుర
స్రక్కలనాకారి కీర్తి సముదంచితులై. 24

గీ. జలజబాంధవ చంద్ర వంశములమించి
వారివంశంబు భువి మాలివంశమయ్యె
నింబుమీఱంగ సమయాంతరంబువలన
పాలమీఁగడ వెన్నగాఁ బరఁగినట్లు. 25

క. ఆ మాలికులమునఁ గవి
స్తోమాలిమనోహరైక సురతరు వితర
శ్యామాలి చతుర్థి హిమ
ధామాలిక [4]నిరతి కృష్ణధరణిపుఁడలరెన్. 26

సీ. అనవద్య బర్హి[5]బర్హావలంకృతమౌళి
యకృతాభిరామవస్త్రాపహారుఁ
[6]డనధిరూఢమహావిహంగమధౌరేయుఁ
డజ్ఞాతచౌర్యవిద్యావిలాసుఁ
డనధీతఘోషకన్యాప్రతారణమంత్రుఁ
డరచితాభీరగోష్ఠాధివాసుఁ

1. కవిలను. తా.పూ. ము. 2. కరణికంబు తా. పూ. ము. 3. దశనీ.. తా.
4. విరతి. తా. 5 బర్హావ లంకృత. తా. 6. డనధిరుఁడన, తా.

డపరావనీంద్ర[1] మంత్ర్యపవారణగరిష్ఠుఁ
డకరాగ్రవేణువిఖ్యాతవాద్యుఁ
డైనకృష్ణుఁడితఁడె యని యభినుతింప
దానవారి వివర్ధనోదారశంఖ
చక్రయుతపాణిఁ బోల్చు నిర్వక్రలీల
రమ్యగుణహారి కృష్ణాజిరాయశౌరి. 27

మ. అనుకంపాహారి నిమ్నతానదవిభుం డైదంయుగీనార్జునుం
డని కైవారముసేయ సార్థమయి కృష్ణాధీశుఁడన్ వేరు పా
వనభావమ్మునమీఱ నా వరసరస్వన్మేఖలానాథుఁడ
త్యనతారాతిచమూనికేతన దరణ్యానీకుఁడై వర్తిలెన్. 28

క. పొంగుచుఁ గృష్ణాధీశుఁడు
భంగములేనట్టికీర్తిఁబడసి సముద్య
త్తుంగయశస్సంగాయిని
గంగాయిని బెండ్లియాడెఁ గరుణానిధియై. 29

సీ. అపకీర్తిగతిబట్టి యాత్మేశుతలముట్టి
బెట్టుగా వడిసుళ్ళఁ బెట్టదేని
[2]చెనటిభంగముమీఱ తనవారిచెలువారఁ
దెరువేది యూరూరఁదిరుగదేని
ఘనజడస్థితి బైట కన్నవారలనోటఁ
బడి జాఁగయనుమాటఁ బడయదేని
ఆనతోద్ధతిగాక లో[3]నార్భటములేక
మొగి నట్టు[4]వీఁకున నిగుడదేని
గంగ చెలగంగ సరియనంగా దనర్చు
పతిహితాచారధృతికి నపారకీర్తి
రతికి నన్యజనజ్ఞాతవితతమతికి
నతుల కారుణ్యధృతికి గంగాయిసతికి. 30

1. మంత్ర్యపచార. తా. 2. చనిన. పూ. ము. తా. 3. నార్పడము. తా. 4 వీఁకని. తా.

శా. ఆ గంగాయినితంబినీమణికి రమ్యాంగుండు కృష్ణాజిభూ
భాగస్వామికి సంభవించెను దురాపస్తంభజన్మాయశ
స్త్ర్యగార్థంబు జనించెనాగ నరసింహస్వామి భీతారిజా
యాగమ్య స్వభయంకరప్రజలరూపాటోపసంరంభియై. 31

మ. అరికిన్ పండ్లిగిలించఁ డెంచడు [1]హిరణ్యాదృష్టి మత్తాసుహృ
చ్ఛరభోదగ్రతచూచికుందఁడు విపక్షచ్ఛేదనాపాదన
త్వరసంధిల్లిన వేళఁ జూకఁడు సముద్యన్మండలాగ్రంబునే
మరఁ డౌరా నరసాజిరాయఁడు మహామార్తాండసంకాశుఁడై. 32

సీ. ఝంపాహతప్రాణ శబ్దాయమాన భూ
ధరగుహాకుహర నిద్రా[2] ప్రసక్తి
కటకభూమిరుహాగ్ర గళితపర్ణాకీర్ణ
పర్వతాంబుకషాయపానయుక్తి
భరితగండమదాపసురభి గంధగజేంద్ర
ఘటనానిశాఖేట[3]ఘటనయుక్తి
అనుపమానాధిత్య[4]కాత్యృతాప్రత్యూష
శ్రీభానుప్రభా సేవనంబు
పరులకర్పించి నిజవీరభటమృగేంద్ర
పాలితముచేసె దత్పురప్రకర మౌర
సంతతారాతినేత్రదురంతతిగ్మ
భావిభుండగు నరసాజిభూవిభుండు. 33

ఉ. ఆనరసింహపూజనములన్న శివార్చనలన్న ధర్మ[5]దా
నానకుదారమీని కతిపప్రకృతుల్ రణరంగవీథిలో
నానరసింహభూవిభు భుజాయుధవహ్నిఁగన్న ధర్మదా
నానికిసాటి యిత్తురు [6]సనాతనసంచితమంచితంబుగన్. 34

క. గురుజాయియందు గనియెన్
నరసాజివిభుండు సుతుల నయగుణనిధులన్

---

1 హిరణ్యవృష్టి తా. 2 పసక్తి. తా. 3. ఖటన. తా. 4. కార్తతా. పూ. ము.
5. దానానికితారమీని తా. దావానకుఁదారమీని పూ. ము. 6. సనాతనమంచిత
మంచితంబుగన్ తా.

గురునుతి సుందరరాయని
[1]తరుణార్కనిభుని విచిత్రధరణీవిభునిన్. 35

క. ఆ సుందరరాయానుజుఁ
డై సుమతి విచిత్రరాయఁడలరె విచిత్ర
శ్రీసుందరవిగ్రహావని
తా సుమశరుఁడనఁగఁ గీర్తితత్పరుఁడగుచున్. 36

సీ. ప్రబలప్రతీపభూపదురాపశౌర్యాగ్ని
తోయధుల్ మరుభూమి సేయుటొకటి
భుజయుగాశ్రితమహోద్ధృతహేతిహతి వైరి
వీరుల సురలఁ గావించుటొకటి
చక్రవాళగిరీంద్రసానురత్నంబులఁ
జిరకీర్తిఁ దెల్లఁగా నెరపుటొకటి
అక్షీణ కరుణాకటాక్షవీక్షణమున
నిరుపేదలకు కల్మి నిల్పుటొకటి
ధైర్యమున మేరుఁదృణముగాఁ దలచుటొకటి
వరధనాదులపై నాసపడమియొకటి
యతివిచిత్ర నిదానమై యతిశయిల్ల
నతనికి విచిత్రరాయాఖ్య యమరుటరుదె ? 37

ఉ. మల్లవడీపురీశ్వరుఁడు మానితమూర్తి విచిత్రరాయభూ
వల్లభుఁ డామరద్రుమ నవప్రసవంబుల నంబరాపగా
ఫుల్లసువర్ణపద్మములఁ బూజలొనర్చు నుమేశు శాంబరి
భిల్లుని చంద్రశేఖరుని పేర్మి ధరాగతుఁడయ్యు వింతగన్. 38

సీ. హృత్తాపఘనమైన మత్తాపఘనముతో
ముత్తాపఖానుఁడు మూలకొదుగ
అలబలంబుదొలంగి చలబలావళితోడ
బలబలాఖానుఁడు పరితపింప

---

1. తరుణారుణవిభు, తా....నిభు. పూ. ము.

అంభోరుహేక్షణా డింభారతాత్ముఁడై
యంబారుఖానుఁ డత్యంతములుక
సేనతోఁ దీనుఁడై [1]హీనమానతఁ బాజీ
ఖానకానుండు బల్ కానఁ దఱుఁగ
చొచ్చి మల్లాదళంబుల సోమసూర్య
వీధులేర్పడ నఱకిన వీరుఁ డంచు
విజయరమ నవ్వ నిజసవ్యభుజ నటింప
రహివహించు మీఱి విచిత్రరాయశౌరి 39

చ. అనవరతస్వకారిత మహామహనీయ మఖాన్నభోజన
మ్మున నళనాయలేని సురముఖ్యులఁబోలె సదాసుఖస్థితిం
[2]దనరుని జాగ్రహారముల తామరతంపరగా ద్విజేంద్రులిం
[3]పెనయ విచిత్రరాయధరణీశ్వరుఁ డెంతయు సంత[4]సిల్లెడున్. 40

గీ. అతనిగేహిని భాగాంబ యవనిఁ బోల్చ
నతులగుణముల నల యరుంధతినిఁ బోలి
సురభికీర్తుల చుట్టాల సురభియగుచు
పతిహితాచారశీల సౌభాగ్యలీల. 41

సీ. మొగమురాజ దినంబు మిగులమండెడి [5]యార్వ
వహ్ని చేపట్టిన స్వాహ యెంత
పునుకకూడు [6]భుజించి మనెడు శ్రీ[7]కంఠు దా
యకు మెడసాచిన యార్య యెంత
[8]కడిమి శ్వశురుగృహంబు గతియంచుఁ బడియున్న
హరినిఁ గైకొన్న శ్రీతరుణి యెంత
పరకాంతకొఱకు శాపగ్రస్తుఁడైన యిం
ద్రునిఁ గూడిన పులోమతనయ యెంత
యనుచు వారల కర్తనాయకులు లేమి
కాత్మ హాసియించి సకలగుణాభిరాముఁ

1. పోనమానతఁ బాజీ పూ.ము. 2. దనర తా. పూ.ము. 3. పెనయు తా. పూ. ము. 4. సిల్లుమన్ తా. పూ. ము. 5. నర్యతా. పూ. ము. 6. భజించి. తా. 7. పట్టి తా. పూ. ము. 8. కలశ్వశురగృహంబు. పూ. ము.

డైన నిజభర్తతోడ నొయ్యనచరించు
కాంతలకు మేటి భాగాంబికావధూటి. 42

ఉ. కొంతనిగాదు బాలతొడుగుల్ మడుగుల్ సువర్ణముల్
దొంతిగ నుప్పుతోఁగలుగు తొమ్మిదియుంగొని యేటికేటికి
వంతుగ నాపెచే మరనివారలులేరు నిజంబుగాఁ దదా
నీంతనమైనయట్టి ధరణీజనజాలములోన నెన్నఁగన్. 43

క. ఆ భాగాంబాళ చికి౯
శోభిల్లు విచిత్రరాయసుత్రాముసకు౯
శోభాఖని ఖండోజిమ
హాభాగుఁడు [1]వొడమె నల జయంతస్ఫూర్తిన్. 44

సీ. పుట్టినప్పుడె పూర్వపుణ్యశేషంబునఁ
బుట్టించె బుధుల కద్భుతముదంబు
అడుగుబెట్టిననాఁడె యతుల తేజస్ఫూర్తి
*నడుగువట్టించె ఖలాంధకార
మమ్మమ్మ యనునాఁడె యాకారగరిమచే
నమ్మమ్మ యనిపించె నఖిలజనుల
పలుకనేర్చిననాఁడె ప్రతిమతొ వేల్పులఁ
బలికించె నాత్మీయభక్తి మహిమ
పలుకబట్టిననాఁడె రూపప్రభావ
భావనమ్మున[2] కామినీ పంక్తిచేత
పలుకబట్టించె సజ్జనకులవిహారి
రాధితమురారి ఖండోజిరాయశౌరి. 45

చ. కలితగుణాభిరాముఁడగు ఖండొజిరాయని బాహుపీఠిపై
బొలుచు ప్రతాపసిద్ధుఁడు విభుత్వవిభూతినొనర్చు పారద
చ్ఛలఘటికాపరంపరలచాడ్పునఁ దచ్చిరకీర్తిచంద్రికో
జ్జ్వల బహిరంతరంబులని వర్తిలు నంబుజసంభవాండముల్ 46

---

1. వొడమెన్ జయంతభాగ్యస్ఫూర్తిన్—పూ.ము. 2. సన్మని - పూ. ము.

* ఈ పాదార్థము తాళపత్రమున లేదు. ౩. యి. తా.

ఉ. వావిరి ఖండోజిప్రభుఁ డవామకరంబున హేతిఁబూన యు
ద్ధావని ధావనంబిడి హితావళితోడను పుట్ట లెక్కఁగా
నావలిభోగివల్లభుల మైతిమటంచుఁ దృణంబు లెక్కఁగా
గోవరులై తిమంచు [1]ననుకొందురు శాత్రవు లాత్మసంపరన్. 47

సీ. మహనీయధామసామగ్రితో గృహదాన
ములుచేసె బ్రాహ్మణావళుల కెల్ల
త్రవ్వించె బలిరసాతలముదాక తటాక
ములు నీరుదీయక నిలచియుండ
వేయించె శీతలచ్ఛాయానపాయాభి
రామ [2]ద్రుమావృతారామసమితి
కట్టించె శైలప్రాకారానుకారప్ర
కారసంతతులతో మీఱ గుళ్లు
కనియె తనవంటితనయుని గాంచెఁగృతులు
నట్లనేకసంతానసంఖ్యలు గడించి
యీ యవని బొల్చు ఖండోజిరాయధీరు
కేకసంతానయుతుఁడైన యింద్రుఁడెనయె ? 48

చ మలసి నిదాఘవేళలను మాపువెలార్చిన తత్ప్రపాజలం
బుల వరిమళ్లలోఁ బొడముపుల్లు భుజించు ఘటోద్ధ్నికాచయం
బులు పరిశుద్ధపాత్రపరిపూర్ణసువర్ణపయస్సు లిచ్చును
జ్జ్వలగతి ఖండోజీంద్రువలె [3]సజ్జనవిత్తము రిత్తవోవునే ? 49

సీ. పొంది యబ్ధులు గట్టుపొర్లి వచ్చిన గాని
[4]కేరిధూర్తత నొకతూరి చల్లు
సురపథం బొకవేళ సోలి వ్రాలినగాని
క్షితి జాఁగయై యరచేత నొడ్డు
తుహినాచలేంద్రంబు దొర్లి వచ్చినగాని
గడుసుగయ్యాళియై కాలఁదన్ను

1. ననికొందరు. తా. 2. దృఢా. పూ.ము. దృతా-తా. 3. సజ్జనుద్రవ్యము రిత్తబోవునే. తా. 4. ధూర్తమైయొక కేరితూరిచల్లు. తా.

ప్రబలదిగ్గజములు ప్రతిఘటించినగాని
మొక్కలిజంతయై మూలఁద్రోయు
గరళకంధర హరి పురందర విరించి
సురలు వచ్చిన నొకసన్నఁజూచు నౌర
కఠినవైరులదళమన్న కాసెఁగట్టు
ధరణి ఖండోజిధీరుని ధైర్యలక్ష్మి. 50

ఉ మెత్తని పల్కులుం గవులమేలిమి తాలిమిసొంపు కామినీ
చిత్తమునాత్మవిత్తముగఁజేయుతెలుంగు హితైకపోషణా
యత్తమనీష మంజులతరాకృతి ఖండోజిరాయునందు స
ర్వోత్తమమైచెలంగు ధరనుత్తముఁజేరిన రిత్తబోవునే ? 51

గీ, అమల ముద్దాజిపుత్రి మానాయిసతియు
నమర నరసాజితనయ వీరాయిసతియు
నతనిచేపట్టి మెఱయుదు రమరనగము
మాలతీమల్లికలువోలె లీలనెసఁగి. 52

మ. మతి సౌందర్యకళావిలాసనిధులై మానాయి వీరాయి యు
ద్గతలీలం దనుజేరికొల్వఁగ విశాఖాయుక్తచంద్రుండునా
క్షితి లక్ష్మీయుతపంకజాక్షుఁడనఁగాఁ జెన్నొందిఖండోజిరా
ట్పతి యాచంద్రధరాధరార్కముగ [1]సంపద్ధాముఁడై వర్తిలున్ 53

## షష్ఠ్యంతాలు

క. ఏతాదృగ్గుణగణనా
జాతమనీషావిశేషచతురబ్ధివృత
క్ష్మాతలజనతా[2]వహికి న
శీతలసదఖర్వదోర్వశీకృతమహికిన్. 54

1. సంపద్ధైర్యుఁడై వర్తిల్లున్. తా. 2. మహికినశీతలసర్వదోర్వశీకృత మహికిన్ తా.

క. యక్షపవితరణునకు హా
ర్యక్షపరాక్రమధురాక్రమాఢ్యుకు శశిహా
ర్యక్షపదాంబుజపూజన
దక్షపరప్రథితగుణికిఁ దరుణాగ్రణికిన్. 55

క. సౌనాశీరి విశాకర
సూనశరాసన వసంత సుందరునకు సం
ధానవభార్గవునకు మం
ధాన వసుమతీధరేంద్రధైర్యోన్నతికిన్. 56

క. అక్షీణశ్రీలక్షిత
వీక్షాలబ్ధార్థసుకవివిశ్రాణితస
ద్రాక్షారస శిక్షాత [1]త
దీక్షాలసమానకవనదివ్యత్కృతికిన్. 57

క. అతి లలితాతులిత గుణా
ద్భుతునకుఁ గుక్షింభరప్రభుంమన్యపణా
యతనయనాజన [2]విటునకు
సతతశుభప్రభవవిభవశతమన్యునకున్. 58

క చండ నిజాఖండభుజా
దండ సుజాతప్రతాప తాపన దళితో
ద్దండారిత మస్తతికిన్
[3]ఖండోజిరాయావనీంద్రకమలాపతికిన్. 59

వ అంకితంబుగాఁగ నమ్మహాకవి యొనర్చిన ఘటికాచలమాహాత్మ్యం
బను మహాప్రబంధంబునకు కథారంభంబెట్టిదనిన.* 60



1. సవీక్షా. తా. 2. విభునకు. పూ. ము, 3. ఖండేరాయాంఘ్రి విమల కమలగమతికిన్. తా. * ఈ అవతారికలోని అరువది గద్య పద్యములు మరియు ఆశ్వాసాద్యంత పద్యములు. వేంకటగిరీంద్రుడు రచించినవి.

# ఘటికాచల మాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము

శ్రీలన్ రాజిలు నైమిశమ్మునఁ [1]దపస్విశ్రేణి [2]పౌరాణిక
త్వాలంకారసమేతు సూతుఁ గని పద్మాధీశ[3]సద్మమ్ములన్
శ్రీలీలానిరవద్య మాద్యము మరుత్సేవ్యంబు భవ్యంబుగా
నాలోకించి యొకండు గల్గిన మహాత్మ్యా తెల్పవే - నావుడున్. 1

క. వినుఁ డిందులకు న్నారద
మునిభృగు సంవాద మాత్మ ముద మొదవించున్
మునులార! మీకు నేనది
వినుపింతుం దెలిసినంత విస్ఫుటఫణితిన్. 2

సీ. శశికరద్రుతసార శశికాంత వాఃపూర
పరితఃప్రపూరిత పరిసరంబు
జలచరాశనకేళి జలచరద్విహగాళి
కలరవోద్ధత కలకల ధురంబు
సురమునీశ తమాసుర దుర్లభాతిమా
సర ముక్తిమౌక్తిక సరవరంబు
కమనీయ మకరంద కమల కైరవబృంద
పరిలసద్రోలంబ [4]పరికరంబు
ఘటిత కిసలయసమ జటానిటలపటల
ఫలక తిలకిత శశిసిత భసిత లసిత
రసిత పరమ సమాధిమద్విసర రుచిర
రసఝరభరంబు వొల్చు మానససరంబు. 3

ఉ. శ్రీకరలీలఁ గంకణపరిష్కృతమంబుధిశేవ నిత్యము
క్త్రాంలితంబు రామకథకై వడి జారుమరుత్కుమారవా

1. తపద్వి. తా. 2. పారాణిక. తా. 3. పద్మ. తా. 4. పరిసరంబు. తా.

ర్తాకర మాదితేయగిరిదారి లసత్సుమనోభివృద్ధి లం
కౌకమురీతిఁ బుణ్యజనతాశ్రయ మానసర మొప్పు నెప్పుడున్. 4

సీ. కలహంస పరిధూత [1]గరుదుద్యదబ్జస
రాగంబు పటవాసరజముగాఁగ
ఉదబిందు మౌక్తికయుత పత్ర[2]పుటహల్ల
కములు రత్నారాత్రి[3]కములు గాఁగ
[4]కరువలి నెగసి యుప్పరముననొప్పు పు
ప్పొడి తెప్ప యుల్లడ పొలుపు గాఁగ
తేటిపూబోఁడులపాట ముత్తైదువల్
పచరించు సోబానపాటగాఁగ
ఖగవిరావంబు ద్విజమంత్ర కలనగాఁగ
[5]రాలు కేసరములు తలఁబ్రాలుగాఁగ
పద్మినీ పద్మినీమిత్ర పరిణయంబు
గరిమదగు నల యంబుజాకరము కరము. 5

క. ఆమానససరసీతట
భూమిన్ భృగ్వాశ్రమంబు వొలుచున్ తీర్థ
వ్యామోహా గతాగత సక
లామర మౌనీంద్ర సముదయాధారంబై. 6

సీ, వాలసంచాలనోద్వేలత చమరీమృ
గమ్ములు సమ్మార్జనమ్ము సేయు
తుండసంభృత తీర్థకుండోదకమ్ములఁ
గలభముల్ [6]కలయంపి గలయఁజల్లు
పచ్చికస్తురియసల్ దెచ్చి భల్లూకముల్
గోముఖశ్రీఁ బాదుకొనఁగఁ జేయు
కరికుంభ[7]గలిత ముక్తాఫలమ్ములు దెచ్చి
శుకములు రంగవల్లికలు దీర్చు

1. గరుడయత్నంజనురాగంబు. తా. 2. పట. తా: 3. కలును, తా.
4. తరువులనెగసి....యుల్లెక పూ.ము. 5. వ్రాలు, తా. 6. కలయంబ. 7. కలిత. పూ. ము. తా.

వెన్నుఁడాకన్ను తమిఁదమి విడక మున్న
దినదినమ్మును నచట నుదీర్ణపర్ణ
శాలికామాలి కాళింద సరణి నరణి
మత్కులకులాంగనలకు సమ్మదము [1]పొదల. 7

మ. శుకముల్ ప్రామినుకుల్ గుణించు గణియించున్ ధర్మమర్మేతిహా
స కథల్ శారిక లీరికల్ గొనుమునీషన్ శేషభాషావిశే
ష కళాశాస్త్ర ముపన్యసించు [2]పికముల్ సాత్రాజితీప్రాణనా
యక నామాళి నళుల్ పఠించు [3]సతతోద్యద్గీతికాచాతురిన్. 8

క. ఒకచిత్రమచటి[4]జటిపా
లికి మున్ సంజలను గ్రుంకి లేచి సమాధిన్
సకలశకుంతంబులు తా
రకమంత్రోచ్చారణాభిరతి మతిఁ బొదలున్. 9

ఉ. అమ్మునిబాలకుల్ ఫలదళాదులకై వనిజుట్టుచో నహిం
ద్రమ్ములు చేరి యెండకు ఫణంబులు చాటుగఁజేయ నంతలో
నెమ్ములు వచ్చి సాములకు నే మొనరించిన నేరమేమి న్యా
యమ్ములె[5]మీ పనుల్ దలఁప? నంచు దరిం[6]బురివిచ్చు నీడగన్. 10

మ. పులు[7]లేడున్ మృగశాబకంబుల హరుల్ పోషించు నత్యాదృతిన్
కలభానీకముఁ గాకముల్ మెలఁగు ఘూకశ్రేణితోఁ బిల్లు లె
ల్కలఁ గాచున్ శిఖికోటి తేఁ[8]జిలువలన్ లాలించు [9]నుత్ఫుల్ల బ
ర్హా లసచ్ఛాయలనుంచి యచ్చటియరణ్యానీప్రదేశంబు[10]లన్ 11

క. ముని హోమానల ధూమము
వినువాకం గ్రుంకి వెడలు విబుధవధూటీ
జనముల నెఱిముంగురులం
దనరున్ [11]సాంబ్రాణిధూపధారారీతిన్. 12

1. మొదవ. తా. 2 బకముల్. పూ. ము. 3. సవతో 4. జేటి పటరిక మున్. తా. 5. మా. 6. బారివచ్చు. తా. 7. లేడున్. తా. 8. జలువలున్ తా. 9. నద్భుల్ల బర్హా. తా. 10. నన్. తా. 11. సాంబ్రాణి. తా.

సీ. మొకరి తేఁటులు మూతిముట్టవు తేవియల్
శ్రీ మధుశాసి కర్పించి గాని
కోకిలమ్ములు చివురాకులు గొఱకవు
శ్రీ వనమాలి కర్పించి గాని
లేఁబచ్చికల్ గబళింపవు హరిణముల్
శ్రీ నీలమూర్తి కర్పించి గాని
ఫల భుజిక్రియలకుఁ జిలుకలు దలఁపవు
శ్రీ మాధవునకు నర్పించి గాని
యితరజంతువులును హరి మతిఁదలంచి
గాని యే వర్తనములకుఁబూన వనిన
నా తపోవన మాహాత్మ్య మభినుతింప
నలవియే వేమొగమ్ముల చిలువకైన. 13

క. ఆ సాధుస్తుత్యాశ్రమ
వాసమ్మున భృగుమునిప్రవరుఁడు వసించున్
శ్రీనఖచరణధ్యానా
ధ్యాసకళాకాంతుఁ దాపసావళితోడన్ 14

సీ. కటికియెండలకాఁకఁ గరఁగి గుబాళించు
గోవజవ్వాజి నెత్తావులకును
కమ్మతమ్ములతావి కానుక [1]సేయుచు
సోలయు చల్లని గాలిసోకులకును
వట్టిమ్రాకుల నవల్ పుట్టింపజాలిన
కిన్నరయువతి సంగీతములకు
బిసకాండములు మేసి కొసరుచుఁ బల్కు జ
క్కవకవ కలయిక కాన్పులకును
కలికిపలుకుల రాచిల్కగముల మధుర
మేదుర రసాలఫల రసాస్వాదములకుఁ
జెదరనీయక యింద్రియశ్రేణి నిలిపి
యతఁడు శ్రీహరిభజియించు నవసరమున. 15

1. సేయించు. పూ, ము.

సీ. శరదంబు దోపరి చపల నాఁ శిరమునఁ
బటు జటాపటలమ్ము పటిమఁజూవ
కల్పకశాఖ శాఖామంజరీ లీల
డాకేల మణి [1]కమండలువు మీఱ
నిటలలోచనశైలతట నీరదాకృతిఁ
గటితటి నజినమ్ము కాంతిఁ బెనువ
ఆకృతిఁదాల్చిన యక్షరావలి యన
శ్రవమున స్ఫటికాక్షసరము దనర
విష్ణునామానుకీర్తి బవిత్రయగుచు
మారుతాహతిఁ దనుదాన మహతి మొఱయ
వచ్చె తనుకాంతినిర్జితపారదుండు
నారదుఁడు భక్తజనసస్య నారదుండు 16

క. ఇటువలె వచ్చిన నారద
జటి కాతిథ్యాది వివిధ సత్కృతు లెల్లన్
ఘటియించి మదిని ముదమం
దుటఁగని భృగుమౌని యతనితో నిట్లనియెన్. 17

క. నారద [2]హృదయాంతరలీ
నారద మోహాతిదుర్విధావలివిద్ధి
నారద రుచిజితశారద
నారద హరిచరణభక్త నారదయాఢ్యా. 18

ఉ. పుష్కరముఖ్యతీర్థములఁ బొల్పగుధర్మము లామహత్త్వముల్
పుష్కలవిష్ణువాసముల పూజ్య విచిత్ర చరిత్రముల్ గుణా
విష్కృతవైష్ణవోత్తమ పవిత్రవిశేషకథల్ మహాత్మ! నా
దుష్కృతముల్ దొలంగ దయతో సకలంబును నాన తియ్యవే. 19

క. ఏచోటనుండివచ్చితి
రిచ్చటికి మదీయ భాగ్య మేమని పొగడన్
వచ్చు నని వలుకునంత వి
యచ్చరముని [3]యిట్టులనియె నాతని తోడన్ 20

1. కమండలము. తా. 2. హృదయాతరళి. తా. 3. యిట్లనియె. తా.

సీ. ఘన రత్నరాశి కాకరము వియచ్చర
మానినీ జనన నిదానభూమి
సంతానభూరుహసమితికి నెలవు నా
రాయణ యోగనిద్రాస్థలంబు
వనజవాసినికిఁ బుట్టినయిల్లు దేవతా
విసరమ్మునకు మహానసగృహమ్ము
ద్వీపసంతతికి [1] బెన్ప్రాపు తరంగిణీ
భామినీమణులకుఁ బ్రాణభర్త
కలువనెచ్చెలికానికిఁ గన్నతండ్రి
గట్టుపట్టికి దృఢ వజ్ర కవచమగుచు
వెలయు సగ్గంపుసగ్గంపువిప్పుగంటి
సామినగరంబు ధర క్షీరసాగరంబు. 21

క. ఆతంకపంకకళంకా
పేతంబై నిత్యసత్యహితపూతంబై
[2] శీతాతప సహయోగి
స్ఫీతంబై తెల్లదీవి చెలఁగును దానున్. 22

క. శ్రీకరమగు నద్దీవిన్
లోకాతీతానపాయనూత్నప్రభమ
స్తోకప్రభావకలితము
వైకుంఠపురంబు సిరుల వఱలు న్మిగులన్. 23

సీ. హాటక హరినీల ఝూట ప్రదీప్త సా
లములచే నమర సాలములచేత
మందర కుధ రోపమాన మానిత సౌధ
తతులచే యోగిసంతతుల చేత
కమలకైరవభాస్వదమృత సరోవితా
*నములచే సుర విమానములచేత

1. పెంప్రాపు. తా 2. సితా.........స్థితంబై. తా. * ఈపాదము తాళపత్ర-
మునలేదు.

రాకాసుధాకర రాజన్ముఖీ విధూత్క
రములచే మణి మందిరముల చేత
సతత కిసలయ సుమ ఫల సహిత మహిత
వనులచే దివ్యలోకపావనుల చేత
వెలయు శాశ్వత లబ్ధాపవర్గ యోగ్య
భాగ్యనికరంబు వైకుంఠపట్టణంబు. 24

సీ. నను గాలిదూది పానుపు లెన్నియో కాని
యందఱు శయనీకృతాహివరులు
సురలోకవాహి నిర్ఝరము లెన్నియొ కాని
యందఱు దివ్యతీర్థాంబు పదులు
నీట జనించు మానికము లెన్నియొ కాని
యందఱు కౌస్తుభహారయుతులు
చలి వేఁడి వెలుఁగుల సాము లెందఱో కాని
యందఱు నిందు కంజాప్త దృశులు
ఖగకులాధీశు లెందఱు కలరో కాని
యందఱును పుల్గురా టెక్కియముల వారు
నాఱు వోసిన రీతి నున్నారు ధీరు
లన్నగరియందు కాపురంబున్న వారు. 25

ఉ. ఆ౦ దొక కేళికా మణిగృహమ్మున తారకకాంతకాంతశ
య్యం దగ నిందిరా సరసిజాననఁ గౌఁగిటనాదరించి యా
నంద రసాబ్ధిఁ దేలుచు ననారతమున్ సనకాదియోగిరా
డ్బృందము గొల్వ నున్న యఖిలేశ్వరభావుని వాసుదేవునిన్. 26

క. సేవించి తత్పదార్చన
గావించిలఁ గలుగునట్టి కమలాధిప లీ
లావాసంబులు జూచితి
నావుఁడు నవి దెలుపుమనిన నారదుఁ డనియెన్. 27

మ. ఉపధానీకృత హస్తతామరస సంయుక్తోత్తమాంగంబు ప
ద్మ పుటాంతర్నివసన్మద[1] భ్రమర రమ్యంబై విరాజిల్ల భ

1. భ్రమణ. తా.

క్త పరాధీనత లంకదిక్కు మొగమై కాకోదరాధీశశ
య్యపయిన్ భాసిలురంగధాముని సహస్రాదిత్య భా ధామునిన్ 28

సీ. ఉపధానిత కరస్థితో త్తమాంగో త్తుంగ
ముకుట రత్నప్రభల్ రకముఁజూప
బ్రహ్మపేటీపుష్కరక్రోడ మదశృంగ
దంగంబు శృంగారభంగిఁదనర
రమ వంతునకు వచ్చు క్షమ లీల కప్పుడా
ల్మొచ్చ పేరురమున అచ్చసేయ
కౌస్తుభ గ్రైవేయ కనకకుండలహార
కేయూరకాంతులు క్రేళ్ళుదాట
సహ్యకన్యాతటో త్తాలస ప్తసాల
రంగ దామ్నాయశృంగైకరంగగేహ
శేషశయ్యను బవళించి [1]శ్రితులమనుచు
రవిసహస్రప్రభాదాము రంగధాము. 29

జీ. అచటి కిశానహరిదంతలాగ్రవీధి
వందమైతగు తిరువాళురందధామ
మునను మునివాహనాహ్వాయ మునివరేణ్యు
మనుప [2]వెలసిన యా జనార్దనుని ఘనుని. 30

గీ. తపసి బృందంబు వెఱఁగొందఁ దపము సేయు
నల పరాశరమౌనిఁ గృతార్థుఁ జేయ
నవని సాక్షాత్కరించిన యసుర హారుని
శ్రీసతీపతిఁ దంజాపురీ నృసింహు. 31

క. శ్రీమద్రంగమునకు మూఁ
డామడను గవేరజాతటాంచిత నంబి
ల్నామపురిం గనఁదగు శ్రీ
ధాముని సౌందర్యనాథు దైవతనాథున్. 32

1. శ్రీతు. తా. 2. వలసిన, పూ. ము. తా.

క. అరుదుగఁ గరంబనూరను
పురవరమునఁ బరహారాబ్జ భూసుత్రాముల్
పరివేష్టింపఁగ నిలిచిన
యురు కరుణాపాంగసీము నుత్తమ నామున్. 33

క. తిరు [1]వెళ్ళరపురి శ్వేతశి
ఖరిపై నౌర పైన దివిజకాంతలు గొలువన్
వర వైభవంబులును బొ
ల్చు రమాధవుఁ బుండరీకలోచనదేవున్. 34

క. తెల్లముగఁ గుంభఘోణపు
రోల్లసదవిలాశ రెండు క్రోసుల నేలన్
బుళ్ళన్ [2]బుదకుడి నుండెడు
బల్లిదు రఘునాథు హ్రాత కబంధ విరాధున్. 35

గీ. ఉర్వి రంగస్థలమునకు యోజనమునఁ
బూర్వహరిదంచలమున నపూర్వమహిమఁ
దివిరి తిరుపేర్నహర్పుర దివ్యధామ
మందుఁ దగు పద్మనయను ననంతశయను. 36

గీ. కుంభఘోణంపు వాయు దిక్కోణ భూమి
నమిత వైభవసామగ్రి నమరు[3]నాద
నూరఁ బ్రహ్లాదముఖులను గారవించు
జిష్ణు యోగీంద్రయోగవర్ధిష్ణు [4]విష్ణు. 37

గీ. కుంభఘోణంపు తూర్పునఁ గొమరు మీఱు
[5]తిరువళందూరఁ బావక దేవునకుఁ బ్ర
సన్నుఁడై యున్న దేవతాసార్వభౌము
వనజ నయనుని గోపికావల్లభునిని. 38

క. పరికించి కుంభఘోణ న
గరి కాగ్నేయాశఁ గడుఁ బ్రకాశించు చిరు

1. వేళ్వర. తా. 2. ప్రదకుడి. తా. 3. యాద. తా. 4. జిష్ణ. తా.
5. తిరువందళూర. పూ. ము.

ప్పురి నున్న శేషపన్నగ
వరదున్ ఫణితల్పశాయి వైభవదాయిన్ 39

క. వరవిభవములన్ సిరిచి
ర్పురమునఁ [1]బురహరసురేశ్వరుల్ భజియింపన్
ధరకుంబ్రత్యక్షుంబౌ
గిరిధరణసహిష్ణు బాలకృష్ణున్‌జిష్ణున్. 40

క. చొక్కణ్ణూరు పురంబున
నక్కౌశిక యజ్ఞవేది యం దుద్భవమై
రక్కసులఁ దునిమి దాసుల
యక్కరఁ దీరుచు జనార్ద నాహ్వాయ మూర్తిన్. 41

చ ఘనమగు కుంభఘోణమునఁ గాంచన పుష్కరిణిన్ జనించు కాం
చన జలజాతనాయికను సన్నుతవై ఖరిఁ బెండ్లియాడి కాం
చనమునికిం బ్రసన్నుఁ డగు [2]సారసపాణిని శార్ఙపాణి [3]స
న్మునివరమస్తకోపరి సముజ్జ్వలపాణిని దేవతాగ్రణిన్. 42

క. తిరుకండియూరు నాఁదగు
పురవర మున దనుజసమితిఁ బొలియింప సురో
త్కరముల మనుప న్నిలిచిన
నరరక్షాచణుని నాదినారాయణునిన్. 43

సీ. తిరువిణ్ణహర్పుర దివ్యధామంబున
విలసిల్లు జగదీశు వేంకటేశు
తిరుకణ్ణపురవరాంతక విమానమ్మున
నిలుచు చతుర్బాహు నీలదేహు
తిరుమఙగయాళ్వారు నరయు [4]తిర్నగరి నృ
హరిని లక్ష్మీశు నారాయణాఖ్యు
తిరు వాలిమణవాళ దివ్యనామమున శో
భిలు నాగపట్టణ వేంకటేశు

1. పురహరప్రళయహరసురేశ్వరుల భజియింపన్.తా. 2. సాదర.తా. 3. త.తా.
4. తర్వారితిర్ణహరిలక్ష్మీశ. తా.

తిరుణరయ్యూర దనరారు ద్విభుజ పరిఘు
పంకజ నికేతనాధీశు వేంకటేశు
మహిమ [1]నొప్పు నందిపుర విణ్ణహారనగరిఁ
జేరియున్న జగన్నాథు శ్రీసనాథు

క. తిరువిందళూర సకలా
మర పరికరముల్ తపస్సమాధి భజింపం
గరుణామతి వారలకున్
వరములొసంగిన [2]సుగంధివననాథు హరిన్. 45

సీ. చిత్రకూటమ్మునఁ జెందమ్మికొలనిచెం
తం దనరారు గోవిందరాజు
శ్రీరామవిణ్ణహారీ పుర మేలు స
ద్భావుఁ ద్రివిక్రమ దేవదేవు
తిరుకూడలూర్పురాధిపు నుపమాతీతు
వర దయాంబుధిరాజు వరదరాజు
[3]ఖలసంహారుని తిరుక్కణ్ణంగుడి వసించు
శ్రీసౌఖ్య వర్ధిష్ణుఁ జిష్ణుకృష్ణు
గరిమఁ దిరుకణ్ణమంగాఖ్య కటక మేలు
భక్తవత్సలదేవు దివ్యప్రభావు
హనుమమనుపం గపిస్థలమ్మునను [4]వెలయు
నింద్రశాత్రవవరదు గజేంద్రవరదు. 46

క. భరతాద్యనుజులు సీతా
తరుణీమణి గంధవాహతనయుఁడు గొలువం
[5]దిరువెళ్ళియన్ గుడి నగరి
వెరవొప్పఁగ నేలు [6]దేవవిభు రాఘవునిన్. 47

సీ. తిరుణాంగ[7]పత్తనాంతరసీమ [8]మాణిమా
దక్కోవెలఁ దిరువెళ్ళక్కొళంబు

1. నచ్చిందిపురివిణ్ణహారినగరి జె, తా. 2. సుగంధవన. పూ ము.
2, ఖలనసంహారుని. తా. 4. వేలయ. తా. 5. తిరువెళ్ళియకుదినగరము. 6. దేవి.
7. పట్టణాంతర. తా. 8. ను మణిషూడ. తా.

తిరుమణిక్కూడవణ్పురుషోత్తమములు శం
బొజ్జికోవెలయును బురుడు లేని
యల్ల[1]పాత్తంపల్లి యరిమేయవిణ్ణహ
రము కావళంబాడి యమితవిభవ
మహము వైకుంఠ విణ్ణహరంబు నాతిరు
త్తేవనార్తొహము సేవకనిధి
యగుతిరుత్తెత్తియంబలంబనఘవచ్చి
దా మహామహిమారీతిఁదనరి భక్తిఁ
గొలుచు దాసుల కోర్కు లీఁ[2]గోరి ధరిణిఁ
దనరు నేకాదశో జ్జ్వల ధామములను. 48

క. విలయాంబుధిమగ్న మహా
వలయంబు సముద్ధరించు వరకీర్తియె యు
జ్జ్వలమూర్తిఁ బ్రవర్తిలెనా
నలరెడు శ్రీ[3]కృష్ణదేవు నాదివరాహున్. 49

సీ. నతజనాధారు మన్నారు కోవెల యేలు
వ్రజసంచరిష్ణు శ్రీ బాలకృష్ణు
పాపనాశనపురీ భర్మహర్మ్యంబున
వసియించు నతరాజు వరదరాజు
నలపాండ్య నలధర నలహర్తిరుమలయన్
వీటవసించు శ్రీ వేంకటేశు
తిరుకోటియూర నిందిరఁ గూడి వర్తిల్లు
కృష్ణావినుతభావుఁ గృష్ణదేవు
విపుల[4]విభుతఁ దిరుమ్మెయివిణ్ణపురము
నేలమిఁ బాలించు సత్యగిరీశు నీశు
మునులతోఁ దిరుపుళ్ళానిపురినిసలిల
ధామ దీక్షాసమున్నిద్రు రామభద్రు. 50

1. పాంతం. 2. గోరు. తా. 3. ముష్ణఁగివహు. తా. 4. విభుతతి....రుమ్మెయిణ్ణపురవరమ్ము. తా.

సీ. దళితాఘమగు తిరుతంగాల్పురమ్మున
శ్రీయుక్తుఁడైన నారాయణవిభు
మునినుతుండై తిరుమోహూర్పురి వసించు
ఖండిత[1]చండాఘుఁ గాలమేఘు
నల దక్షిణమధురాస్థలమున భక్తపా
లకుడైన కూడల[2]వకియనాము
శ్రీమించు కురువిత్తురీ పురంబున నతి
ప్రేమ దాసులఁ బ్రోవు కృష్ణదేవు
గరిమ శ్రీవిల్లిపుత్తూర సురలు మునులు
సన్నుతులు సేయఁ జెన్నారు మన్న[3]వారు
నగణితైశ్వర్యమునఁ దిరునగరి యేలు
నాదిలక్ష్మీసనాథు నయ్యాదినాథు. 51

సీ. తులవెళ్ళిమంగాళాద్భుతపట్టణంబున
విలసిల్లు నయ్యరవిందనేత్రు
శ్రీవరమంగపురీనాథు నతసాధు
నమృతాంబునిధితనయాసనాథుఁ
తెందిరుశ్రే[4]ర్పురియందుఁ జెన్నొందు పు
రందరస్తుతుఁ [5]గేశవేందసంజ్ఞు
వైకుంఠపట్టణ [6]వాస్తవ్యు భవ్యవై
కుంఠసంఘాత వైకుంఠనేతఁ
గూర్మిమీఱఁ దిరుప్పుళిగుడి పురమ్మ
భూరివైభవమున నేలు భూమిపాలు
మంగపట్టణ మణికుంటపాంగణమున
నలరు నతదేవు విజయాసనాఖ్యదేవు. 52

సీ. నగవుఁజూపులఁ గుళిందనగరి నున్న వ
ర్ణితశౌర్యు శ్రీ నవనీతచౌర్యు

1. చండౌఘ. తా. 2 శఘియ. తా. 3. నారు. తా. 4. పురి. తా.
5. మకరమ్మనోజ్ఞు. తా. 6. వాసవ్య. పూ. ము. తా.

తిరుకురుంగుడి మహాపుర సౌధవీధిక
వఱలు బృందారకవైరివైరి
పాలితసూరిఁ ది[1]రోక్కలూరిపురి హాస
ధవళాస్యు భక్తనిధాను శౌరి
న య్యనంతపురంబునం దహిశయ్యపై
మీఱు మురారిఁ జాణూర వైరి
సాధుజనయిత్రి[2]వన్పరిసరధరిత్రి
వలను మీఱ వసించు శ్రీవత్సవత్సు
నా [3]తిరుక్కాత్కర పురంబు నాదరించు
నఖిలభక్తనిధాను నప్పాభిధాను, 53

సీ. తిరుమూడికలమను దివ్యస్థలంబునఁ
గ్రీడించు నల పుండరీకనేత్రు
సురలెన్నఁ గుట్ట నా త్తిరుపుళియూర్పుర
మున వసియించు నపూర్వనాథు
తిరుచెంగణూ ర[4]ను పురవరమ్మున నొప్పు
దివ్యభూవాస్తవ్యు దేవ సేవ్యు
నలువగొల్వ గఁ [5]దిరుణావై నగరిని వ
త్తిలు ధీరనుతభావు దేవదేవు
వార్తకెక్కిన తిరువణ్ణ[6]వార్నగరిని
నున్న నతజనమందారు మన్ననారు
[7]నుతి యొనర్పనగు తిరువందూర్పురమున
నాత్తనరసఖ్యు నల ప్రవాళాధరాఖ్యు.

సీ. అల తిరు[8]వత్తూర మను [9]పత్తనంబున
హరిశయ్యఁ దగు కేశవాభిధాను
నుత్త[10]చుక్కొండ నా నొప్పు పత్తనమున
నలరెడు నల య[11]నన్యగతినాథుఁ

---

1. క్కోశూరి. తా. 2, వణ్పరి శా. తా, 3. తిరుక్కార్కర. తా.
4. వసత్యల్పన ...... స్తవ్య. తా 5, తిరుణనాయి. తా. 6. వాన్నగరిని. తా.
7. నుతిగనుతమ. .రు. తా. 8. వాట్టార.తా. 9. పట్టణంబున.తా. 10. చుకోక్కడ తా, 11. సస్య. తా.

బూని తిరుక్కడిస్థానంబునవసించు
[1]నలనరసఖ్యు నారాయణాఖ్యుఁ
తిరువార నెడు పురవరమునఁ గ్రీడించు
పాలితజిష్ణు శ్రీబాలకృష్ణు
వినుతి నేయంగఁ[2] దిరుమంది వెళ్ళనగరి
దేవపతి గొల్వ నున్న శ్రీ దేవనాథు
నా తిరుక్కోవలూర్నగరాగ్రసౌధ
వీధి సర్వస్వతంత్రుఁడై వెలయు కృష్ణు. 55

క. అలకాంచితమై తనరెడు
నల కాంచి పురిన్వరించి యధ్వరవేదీ
స్థలి వెలసి కరినగంబున
నిలిచిన శ్రీవరదరాజు నిరుపమతేజున్. 56

క. ఆ కాంచికా పురమ్మున
శ్రీకర వేగవతి సుప్రసిద్ధాంబువులన్
లోకములు మెచ్చ జనులకు
వే[3]కావించిన రమేశు వేగవతీశున్. 57

సీ. పరమేశ విణ్ణహార్ప్రింత కాంచీస్థలి
నున్న జోశా[4]ధీశుఁ జిన్నికృష్ణు
నట దిరుప్పాడహాం బను నెడ వసియించు
పార్థసారథినాముఁ బద్మనేత్రు
[5]నత్తిరుతంగస్థలావాసమునఁబొల్చు
దీపప్రభావాఖిలప్రదీపుఁ
[6]గామాటిబిలరతింగళ్ తుండధామధా
ముఁ దదీయినాము సంపూర్ణకాము

1. నతలసమూఖ్యు. తా. పాదము పూర్తిగాలేదు. 2. గరిమఁదిర్వెళ్ళినగరి. తా. 3. కాస్పించిన: కౌస్వించిన. తా. 4. ధీను. తా. 5. నాతిరు. తా. 6. కామగతిం గట్టుండధామ. తా.

నచటనె వెలుక్కు మను చోట నధివసించు
శ్రితజనావనకృతరంహు శ్రీనృసింహు
నంద[1] తిరువరసరమున నలరు నఘ వి
దారిఁ జోళహారందాభిధాన శౌరి. 58

గీ. వరునఁ గారహాకల్పనూర్పురమనంగ
దీనుల నిధానమయిన కార్వాన మనగ
వరలు జగదేకనిశ్చల వైభవముల
నలరు శ్రీహరిధామములందమరయ. 59

శా. వీక్షామాత్ర ఫలప్రదంబయిన యావీక్ష్యావనా[2]ఖ్యాత పు
ణ్యక్షేత్రంబున శాలిహోత్రమునిహర్యక్షుంబు రక్షింపు ప్ర
త్యక్షుంబై నిటలేక్షణుండు నుతిసేయన్ వీరకోటీ రథా
ధ్యక్షుండై తగు వీరరాఘవు సమిక్ష్వాకుండోల్లసల్లాఘవున్. 60

సీ. అలకాంచిచేరువ నష్టభుజంగమ
నిలయధరాధ్యక్షు నీరజాక్షు
తిరునిన్నయూర్పుర దివ్యసౌధమ్మున
వివిధభోగనివేశు వేంకటేశు
లీలఁ దిరుప్పుక్కులీ గ్రామమున నున్న
విజయా[3]ఖ్యరాఘవోర్వీతలేశు
న త్తిరునిర్మలాఖ్య పురంబు నేలెడు
వైరివారణసింహు నారసింహు
తిరువదవ్వంద[4]పట్టణస్థితి వసించు
నాది భూదారమూర్తిఁ బద్మానువర్తి
న త్తిరుకడమల నున్న యమరలోక
మాన్యు నాపల్లిగొండ పెర్మాళ్ల దేవు. 61

క. ఎక్కుడు తపమునఁ దనువుల్
[5]చిక్కఁగ ఘటికాచలాఖ్యశిఖరిస్థలిపై

1: తిరువ్వార....న. తా. 2. ఖ్యాన. పూ. ము తా. 3. ఖి. పూ. ము తా
4. వత్తనస్థితి. పూ. ము. 5. స్రుకక్కగ. తా.

[1]నెక్కొనుస ప్తర్షులకున్
దక్కిన యక్కారుకణ్ణి నరహరమూర్తిన్. 62

సీ. పాదాబ్జ రజమునఁ బాషాణ పుత్రిక
వనితఁగాఁ జేయు పావనత ఘనత
హరశరాసవిభేద మవనిజాకల్యాణ
మునకు నుంకువ సేయు భుజబలంబు
మున్నీరు బాణాగ్రమున నాణిముత్తెంబు
భాతిగా నుంచిన పాటవంబు
వరశస్త్రశిఖిని రావణముఖా సురకోటి
శలభముల్ గాఁ జేయు శౌర్య మహిమ
తొలఁక లక్ష్మణ భరత శత్రుఘ్న వాయు
జార్కజ విభీషణాదులు నఖిల ఋషులు
గొలువ వైదేహితోఁ గూడ నల యయోధ్య
రాజిలు దయాతిసాంద్రు శ్రీరామచంద్రు. 63

క. ఆనందమయ విమానం
బానందమగరిమదాన నలరారు యశో
దానందతపఃఫలమగు
[2]నానందహరి నంజనాచలశౌరిన్. 64

గీ. తిర్వలిక్కేణి దివ్యమందిర చరిష్ణుఁ
గృష్ణనామ రథాలంకరిష్ణుఁ గృష్ణ
నల [3]యహోబలపర్వతాధ్యక్షుఁడైన
శ్రీయుతా [4]యతవతు శిక్షితవివతు 65

సీ. చిప్పకూఁకటిరేకనొప్పు నొఁదలమీఁద
చలిదిచిక్కము వింత చెలువుఁగులుక
వ్రేతలవలపుఁగొల్పెడు దిస్స మొలపొత్తి
గచ్చకాయఁతిత్తి అచ్చ సేయ

1. నెక్కను. తా. పూ. ము. 2. నానంద కథా విధారి. తా. 3. మ, తా. 4. యుత. తా.

ముప్వంకమురువుతో మురళియూదెడు నిండు
సొగసు గోముల[1]చుక్కసొక్కఁజేయఁ
జిరుతనవ్వులడాలు చేనున్నవలమురి
గలమురిపెమునకుఁ గళుకు[2]నింప
[3]నైమిదక్షిణది క్తటప్రాంతభూమి
సకలదివిజులతోడ సాక్షాత్కరించి
పుండరీకుని మనిచిన పాండురంగ
విఠ్ఠలాధీశుఁ గోటిరవిప్రకాశు. 66

సీ. యాదవశిఖరి నత్యాదరంబున నున్న
రసికుఁ [4]జళ్ళఁపిళ్ళరాయశౌరి
హాళి సాలగ్రామ శైలంబున వసించు
నా స్వయంవ్యక్తు దీనాధినాథు
నైమిశకాననభూమి భక్తావన
మానితరంహు జ్వాలానృసింహు
నంత శ్రీరంగాంతరాఖ్యధామమ్మున
శ్రితజనావన[5]కల్పు శేషతల్పు
బదరివనమున నర్జునప్రాణసఖిత
నఖిలము [6]నెలుంగుచున్న నారాయణాఖ్యు
నా ప్రయాగస్థలమ్మున నతుల విభవ
మహిమఁ గనుపట్టు శ్రీ మధుమాధవాఖ్యు 67

క. [7]తిరుపేరు త్రిపుమణి[8]మం
దిరసీమన్ శ్రీధరాసతీసేవితుఁడై
చరణా[9]నత జనులకు నిహ
పరఫలములఁ గరుణనొసఁగు బాలముకుందున్. 68

సీ. పురుషోత్తమస్థానమున విందుకొలువుండు
శ్రీ జగన్నాథు లక్ష్మీసనాథు

1. చొక్క. తా. 2. నించ: తా. 3. నైమి. తా. 4. ళళ్ళవిళ్ళ. తా.
5. తల్పు. పూ. ము. 6. నెఱుగనున్న. తా. 7. తిరుపెరు తిపురిమణి. తా.
8. మందిరమున. పూ. ము. 9. సుత. తా.

వైకుంఠ [1]మున భాగవతులతో వసియించు
కువలయశ్యాము వైకుంఠనాము
కలశపాథోధిసంగత సితద్వీప ప్ర
సిద్ధసౌధనిల[2]యి శేషశాయి
మధురాపురీ హేమ[3]మందిరాంతర రత్న
మయసౌధవాసు రమావిలాసు
మరి [4]తిరువ్వేలివిఖ్యాత వరతరా[5]ఖ్య
మైన తిర్వారయిప్పాడి నలరు శౌరి
శ్రీసతీయుక్తుఁ బట్టాభిషిక్తు ద్వార
కాపురీధాము భక్తరక్షణలలాము. 69

సీ. తీర్థయాత్రావృత్తిఁ దిరుగుచు సేవింపఁ
గాఁగంటి నదియనుగాక మఱియు
ననఘ! శమ్యాప్రాస మను నాశ్రమమున స
త్యవతి[6]నందనుఁడే సుతటినిచెంత
నాగమవ్యాకరణాష్టాదశపురాణ
రమ్యార్థ [7]తరము భారతము సేసె
నాసరస్వతి నర్ణవాభ్యర్ణమునఁజేర
నరుగు తుంగతరంగ నభ్రగంగ
రవిజ నంద విపాశ వేత్రవతి రేవ
సరయువు మలాపహారి భీమరథి వృద్ధ
గంగ కృష్ణయు కావేరి తుంగభద్ర
వేగవతి యాదిగాఁగలవివిధనదుల. 70

గీ. పుణ్యతీర్థములైన త్రిపుష్కరములు
ద్వారవతి వారణాసి యవంతి మాయ
మధుర కాంచి యయోధ్య నా నధిక పాప
హారములై వార్తకెక్కిన పురవరములు 71

---

1. వరభోగ. పూ. ము. 2. నీలాయి. తా. 3. మందికాంతర తా.
4. తిరువ్వేలిధి. తా. 5. ద్య. తా. 6. నకదనుఁడు నౌ తటని తా. 7. రతము. తా.

క. ధాత్రీతనయారాఘవ
గోత్రావరలిఖితచిత్రకూటంబై వై
చిత్రిఁదగు చిత్రకూటము
పాత్రతరంబైన పంచవటియును భక్తిన్. 72

క. కనుఁగొనివచ్చితినన నతఁ
డనఘా! యీ మాటయెనిమిదగు తిరుపతులన్
దనరు సుచరిత్రములు పా
వన పూజ్యస్థల కథాప్రభావము కరుణన్. 73

క. ప్రకటింపుచు నడుమ నొకిం
చుక ఘటికాచలముమహిమ సూచించితి రు
త్సుకతన్ హరియాశైలము
నకు వేంచేయుటకు కారణం బెయ్యదియో ? 74

క. వేడుకయయ్యెడు తద్గిరి
చూడామణికథవినంగ సుర [1]ముని! యబ్జ
క్రోడప్రోద్భవనందన !
యీడితమృదువచనరచన నెఱిఁగింపఁగదే. 75

మ. అనుడున్ ధన్యుఁడనైతి నియ్యెడ మహాత్మా! యాత్మభూనేతకై
నను వాగ్దేవతకైన వేదములకైనం బన్నగస్వామికై
నను వాచస్పతికైన నా కుధరమున్ వర్ణింపశక్యంబుగా
దనినన్ మాటలువేయునేమిటికి శక్యంబౌనె మాబోంట్లకున్, 76

ఆ. సనక జనక జనకుఁ డనురాగమున రమ
కానతీయ నేతదచలచరిత్ర
మేను వింటి [2]నొప్ప నదిమహాఘచ్ఛటా
దారణంబు ముక్తి కారణంబు. 77

సీ. సంచితాద్యఘ సమిత్సమితికిఁ గార్చిచ్చు
హరివైభవస్వర్ణ మొదయ మచ్చు

1. వర. తా. 2. గొప్పనిది. తా. గొప్పమిది. పూ. ము.

సకల [1]సత్వపురాణ సారాంశముల హెచ్చు
కైవల్యకమః [2]బ్రీతికలువవచ్చు
విష్ణుస్థలమణుల వెల [3]దీర్పు బలుబచ్చు
శ్రీలతాంగి వసించు మేలుమచ్చు
సాధుసమాగమజ్ఞానవిద్యకు నచ్చు
వివిధజన్మార్థముల్ వెరఁజు ముచ్చు
సనక జనకాది సురవర [4]చయము మెచ్చు
విపులతర నవవిధభక్తి [5]వెదకవచ్చు
పుణ్యసాధవితానంబుపూలకుచ్చు
వినుము దానిమహత్త్వమెంతనఁ వచ్చు. 78

క. కావున విను ధన్యులకు ర
మావరచరణాబ్జభక్తి [6]మలయున్ వెలయున్
శ్రీవైభవంబు నఘము
ద్రావిద్రావణవిధాయి ధర్మస్పృహాయున్. 79

సీ. [7]ఆరామనామ జపామోద మేనుర
హృదయారవిందులై పొదలువారి
శౌరి కథాసుధాసారంబు తోరంబు
గా వీనుదోయిళ్ళఁ ద్రావువారి
పద్మారమణపాద పద్మార్థ్యాశాశ్ర
హస్తారవిందులై యలరువారి
తీర్థపాదపదాబ్జతీర్థసం[8]సేవన
మున పావనాంగులై తనరువారి
వారిజోదరచిహ్నముల్ వరలువారి
ధీరమతులై ముకుందుఁ గీర్తించువారి
దూరమునఁజూచి పరువెత్తు దురిత[9]మతులఁ
గెడపు [10]కాసరవాహను కింకరాళి. 80

1. సత్య. పూ. ము. 2. నెతికల్యవచ్చు.తా. 3. దీర్ప. తా. 4. శయము పూ. ము. తా. 5. వేదిగ. తా. 6. మరయన్.పూ. ము. 7. శ్రీ. తా. 8. సేచన.పూ.ము. సంచనమున.తా. 9. వతుల;తా. 10. కాసార.పూ.ము.తా.

క. హరికథలు వినఁగ నొల్లని
దురితాత్ముండిందు నిరయదోషదశాకా
తరహృదయుండై యందున్
నిరవధి[1]గా ఘోరనిరయ నీరధిఁ గ్రుంకున్. 81

సీ. శౌరిగేహమునకుఁ జనఁగఁ జాలని కాలు
కాలుకాదది మరకాలుగాని
పురుషోత్తమునిదివ్యమూర్తిఁ జూడనియక్షి
యక్షికా దల్లగవాక్షిగాని
అచ్యుతు చరితంబు లాకర్ణింపని చెవి
చెవికాదు రాట్నంపు చెవియగాని
నరసఖుఁ గీర్తింపఁ జొరలేని నాలుక
నాల్క కాదది కొండనాల్కగాని
దానవారాతి పూజకు రాని కరము
కరముకాదది ఘోరాఘకరముగాని
హరిపదోదకమునఁ దోఁగనట్టిరూపు
రూపుకాదది చిత్రంపురూపుగాని. 82

గీ. కమలలోచన [2]భక్తసాంగత్యమెప్పు
డబ్బ నప్పుడె వికసించు [3]నార్యు తలఁపు
బిసరుహాప్తునిరాక నింపొనఁగ విరియు
బిసరుహంబును బోలె [4]తామసవిదూర. 83

శా. సంగంబెన్నఁగ నెన్నిచందముల వర్జంబైనచోఁ జూడ నా
సంగంబుఁ బొ విడఁగూడ దార్యసహవాసశ్రీకరంబైన ని
స్సంగుల్ సంగమహౌషధంబగుటఁ దత్సంగంబు భక్తిప్రధా
నాంగంబై కమలామనోహరుని నత్యామోదిఁ జేయుంగడున్. 84

క. దానముల జప తపో ధ
ర్మానూనాచార సూనృతాధ్యయనములన్

1. కాగార. తా. 2. భక్తి. పూ. ము. 3. నార్య. తా. 4. తామరస విదుర. తా.

నానాటం దెల్ల మిగాఁ
గానందగు విష్ణుభక్తికలితాత్ములకున్. 85

క. హరిచరణాంబుజభక్తికిఁ
గర మాకరమగుచు నేఁడుగాఁ నాజన్మాం
తరకృత సుకృతము కతముగ
దొరకె [1]న్నీదర్శనంబు దురితవిదూరా ! 86

ఉ. నావుడు వెండియున్ భృగువు నారదుఁ గన్గొని మౌనిచంద్ర! యిం
కా విన నెమ్మదిన్మిగులఁ గౌతుక మయ్యెడు సాధుసంగమ
శ్రీవశవైభవంబు సుధచిల్కెడుపల్కుల నానతిచ్చి న
న్పావనచిత్తుఁ జేయు మనిపల్క నతం[2]డను నాతపస్వితోన్. 87

మ. సరయూతీరమునందు నొక్క పురరాజం బుగ్రభాస్వత్ప్రభా
పరయూధప్రతిరోధకృన్మణిమయప్రాసాదహర్మ్యాంకమై
పరరాజోత్కరదుర్నిరీక్ష్యపరిఘాప్రాకారనిశ్శంకమై
మెరయున్ ధాత్రి నయోధ్యనాఁ బ్రకటమై మిత్రాన్వయాధారమై 88

ఉ. ఆ నగరాధినేత ధవళాంగుఁడు నాఁ జను రాజశేఖరుం
డానతరాజరాజమకుటాంచిత నూత్నచిరత్నరత్నభా
భానువిభానుయోగ యుగపద్వికచ న్నిజపాదపద్ముఁడై
యానిఖిలావనీధుర ధరించె నుదంచితబాహుపీఠికన్. 89

గీ కరము సపరికరముగ సంగరముఁ దొరఁగి
కరములు మొగిడ్చి పగతురు కరము లొసఁగి
[3]కని మని భజింప విక్రమఖని యతండు
నిండుకొలువుండి [5]యొక్కనాఁడుండినటుల. 90

సీ. మాణిక్యమకుటంబు మాటి మస్తకమందుఁ
[5]బిట్ట యీఁకల సెట్ట ముట్టిపడియె

1. ని. తా. 2. దును, తా. 3. రని, 4. యొకనాడునుండు నటుల. తా. 5. బట్టియీకేలనట్టె తా. బట్టియీకలనట్టె. పూ. ము.

తారహారముల కుద్యాపనం బొనరించి
[1]యెఱచి పోఁచలదండ లురమునిండె
అంగుళీయకముల కపజయంబు ఘటించి
గురుగుంజలు కేలఁ దగులు కొనియె
జాళువా పైఠాణి [2]శాలువు దొలఁగించి
గదురుతోల్కటిసీమఁ [3]గదురుకొనియె
నక్కటా! యిది[4]యేమి యున్నటుల యుండి
యనుచుఁ బెనుఖేదమున సభాజనముజూడ
[5]మేటి చీకటు లీను నెమ్మేని తోడ
భూతలాధీశనేత కిరాతుఁ డయ్యె. 91

చ. ఇటువలెనుండి పూర్వకృత మెట్టిదియో సదయోదయత్వ వి
స్ఫుట హృదయంబు వోయి పెనుబోయ[6]తనంబున బంధుకోటులన్
భటులఁ దొలంగి ప్రాణి నిధనంబునకుద్యతుఁడయ్యెనాతఁడ
క్కట! జటివర్య! యెవ్వరికిఁ గాలముఁ దప్పముగా గణింపఁగన్. 92

క. ఈలీలఁ గిరాతదశా
శీలుండై యతఁడు పురము వెలువడి క్రూర
వ్యాళిమృగపాళిఖగ
తాళీ యుత మయినకోనఁ దానొకరుండున్. 93

క. తిరుగుచు జంతువుల తలల్
దఱుగుచు దరుగుల్మలతలు తనకిరవులుగాఁ
బరఁగుచు నొకనాడు వశి
ష్ఠ ఋషి తపోవనముఁ జేరఁజనఁ గనె మునియున్. 94

చ. కనుఁగొని వీనిరాకకిటఁగారణ మేమొకో? మామకాశ్రమం
బని యిది [7]వీ డెఱుంగఁడొకో? యౌర! భయంబరి రాఁబనేమి వా
[8]వనికి కిరాత కీట మని వచ్చిన కోపమడంచి యా తపో
ధనమణి దివ్యదృష్టి గని తద్దశ తద్దయుఁ బ్రేమనిట్లనెన్. 95

---

1. యెరచి, పూ. ము. తా. 2. శాలదూలఁగజేసి. తా. శాల్వఁదూలఁగజేసి పూ. ము. సాలుఁదూలఁగజేసి అనియు పఠింపవచ్చును. 3. గుదురు. పూ. ము. 4. యేమొయన్న. తా. పూ. ము. 5. జూడ. తా. 6. వనంబున తా. 7. వీడెరుంగునొకొ. తా. 8. ఘనికి. తా.

శా. భూమీశా! యొకనాఁడు నీవు [1]మృగయుల్ మున్నాడ వేటాడ వి
శ్వామిత్రాశ్రమవాటి కేఁగి మృగహింసాసక్తి వర్తింపఁ[2]గా
నా మౌనీంద్రుఁడు శాపమిచ్చెనిటుగా నైతే మరేమింకిటన్
సేమం బౌనని పల్కుమాత్ర నతఁడుం జెన్నొందెఁ బూర్వాకృతిన్ 96

మ. నరమాంసాశ.వృత్తివర్తి లెడు ఘంటాకర్ణుఁ[3]డన్ దుర్ణయుం
డరవిం[4]దాక్షవిపక్షతాగతమహాహంకారుఁ డాజన్మపా
పరతుం[5]డెక్కటి కృష్ణుఁగన్గొని ఖలవ్యాపారముల్ వీడ డే?
యరుదా సాధుసమాగమంబుశుభం బౌటల్? జటిగ్రామణీ! 97

క. విను మిన్నియు నేఁటికి మ
జ్జనన[6]కథాకథనమే ప్రశస్తోత్తరమై
యనఘా! తగునిందుల కని
వినిపించెం దత్కథానువృత్తం[7]బిటులన్.

## ఆశ్వాసాంతము

మ. శ్రితదేవాగమ! వాగమానితసుభాక్షీరోదసారోదయో
ర్జితకల్లోలనికాయ! కాయజ సునాశీరాత్మభూ మాధవ
స్మృతికృద్విగ్రహ! విగ్రహాత్తృటితదాక్షిణ్యక్షణప్రేక్షణా!
శతమన్యుప్రతిమాన! మానదమహోజాగ్రగ్రహాధీశ్వరా!

క. సదనోదరమూర్తి రమా
సదనోదరపాణిచరణసరసిజపూజా
విదితాదితముదితాత్మక!
సుదతీజనతానవీక [7] సురభిళబాణా!

---

1. మృగముల్, తా. 2. జూపా. తా. 3. డున్. తా. 4. దాక్షవిపేక్ష. తా.
5. డెక్కడ. తా. 6. జానకథనమె, తా. 7. బటులన్. తా.

మాలిని. సరసగుణసమాజా! సన్మృగేంద్రస్ఫుటౌజా!
పరభటకృతపూజా! బంధుగీర్వాణభూజా!
తరుణ [1] తరణి తేజా! ధారుణీరాజరాజా!
శరణసుకవిభోజా! భాగమాంబాతనూజా!

గద్య- ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధిక కృపాపరిపాక పరిచిత సరస కవితాసనాథ తెనాలిరామకృష్ణకవినాథ ప్రణీతంబైన ఘటికాచల [2] మాహాత్మ్యంబను మహాప్రబంధంబునందు

ప్రథమాశ్వాసము

1. తరుణి. తా. 2. మహాత్మ్యంబను. తా. గమనిక : ఈ ఆశ్వాసాంత పద్యములు పూర్వముద్రణమున లేవు.

# ఘటికాచల మాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీరమణీరమణ పదాం
భోరుహయుగళాను [1]వేళభూషితహృదయా!
తారుణ్యవతీమనసిజ!
కారుణ్యకలాకలాప! ఖండోజిభూపా! 1

క. అవధారు ధాతృనందను
డవిరళమధురోక్తి ననియె నాభృగమునితో
నవదంతకుందకాంతులు
[2]సవరన చెక్కిళ్ల సాంద్ర చంద్రికలీనన్. 2

క. హరిచక్ర మనెడు పురవర
మరిచక్రాభేద్య మగుచు హరిచక్రము నా
సురుచిర సుదర్శనప్రథ
కిర వగుచు రథాంగనామ హితగతిఁ దనరున్. 3

వ. తత్పురంబునందు. 4

క. గోవిందశర్మయనఁగా
గోవిందసమానుఁ డొక్క గోత్రాదేవుం
డావిష్కృత మేధానిధి
శ్రీవైష్ణవధర్మపారదృశ్వఁ దనర్చున్. 5

గీ. తన సదాచార వినయ విద్యా దయాది
సద్గుణమ్ములు ప్రజలెల్ల సన్నుతింప

---

1. వెలయ. తా. మేయ. పూ. ము. 2. సవరని. తా. సవరిసి. పూ. ము.

నతఁడు భద్రాంగి యను పేర [1]నమరు సాధ్వి
భద్రలక్షణమూర్తి నుద్వాహమయ్యె. 6

క. ఆలేమకు నుదయించిరి
నాళీకప్రభవనిభులు నలువురుతనయుల్
నాళీకవచను లర్చిత
నాళీకోదరులు సుజన [2]నయనాళీకుల్. 7

సీ. ఆ కుమారులు [3]కృతాధ్యయనసంపన్నులై
తనకైన యాజ్ఞ యౌదల ధరింప
దివసాదిలేచి నదీస్నాన మొనరించి
విమలదుకూలవస్త్రములు దాల్చి
యుచితాసనమ్ము [4]ననుండి లో నిండు ని
శ్చలమైననిష్ఠ నాచార్యుఁదలచి
తిరపవిత్రంబును దిరుమణి, దిరుచూర్ణ
మును మేనధరియించి వినుతభక్తి
మించ సంధ్యాదివిధు లాచరించి తలఁపు
కరఁగి గీతల పఠియించి కాయమెత్తు
నతుల వైష్ణవధర్మమో యనఁగ నతడు
వచ్చు జనులెల్లఁ బొగడ నివాసమునకు. 8

గీ. అతని యర్ధాంగలక్ష్మి భద్రాంగి ద్వార
తోరణమ్ములు ధరియించి చేరవచ్చి
యడుగు నెత్తమ్మిఁ దోయి తీర్థాంబువులను
గడిగి తత్పాదతీర్థ ముత్కంఠఁ గ్రోలి. 9

క. తిరుమణిపెట్టె కరమ్మునఁ
గరమనురక్తిం ధరించి కైదండ మనో
హరుని నలరింప నభ్యం
తర మందిరమునకు నరుగఁ దనయులు భక్తిన్. 10

1. నమర. తా. 2. నళి. తా. 3. శృతా. తా. 4. ల లుండి లోనుండిక (చి). తా.

సీ. చేపట్టుచేసి [1]క్రొమ్మోల్చివరగల్గి చిగు
రరఁటియాకుల దొన్నియల ఘటించి
నారికేళ [2]ఫలాళనమ్ములు నవరించి
యాకుల నభిఘార మాచ [3]రించి.
కఁకణ ఝణఝణత్కారముల్ విలసిల్ల
ఘలుఘల్లురని [4]పదాంగదము లులియ
బంగారు సరిగంచు రంగు [5]సుగ్గడితంపు
తెలిదువ్వటము [6]ఫెళఫెళల నీన
కదలు మెట్టెలకవ తాళగతుల మొరయ
నెయ్యమునఁ గొంగులిలవలందియ్యఁ బదర
కెంతయును దాల్మిమై రమాకాంతచెలువు
నింపుచెలి వగమీఱ వడ్డింపుచుండ. 16

సీ. తునియ కొండొకటితో పెనగొను కరమాన్న
మొలిచిన పప్పు సద్యోఘృతంబు
కారంపుకూరలు చారులు శాకము
లంబళ్ళుపచ్చళ్ళు నానవాలు
వరుగు లప్పడములు వడియముల్ తేనియ
పాకముల్ [7]సిగరలు పాయసములు
కలవంటకములు బజ్జులు పిండివంటలు
చక్కెరజున్నురసాయనములు
పాలు ఫలములు నెడనీళ్ళు పానకములు
నూరుబిం డ్లూరుగాయలు పైరు కొంతి
[8]పాంసులవణమ్ము జంబీరఫలరసములు
నించఁ దగు నీరుమో రారగించి లేచి. 17

1. క్రొమ్మొల్చివర. తా. మేల్చివర. పూ. ము. 2. కలాపనమ్ములు. తా. 3. రింప. తా. 4 పదాంగములునిలిపి. తా. 5. సుంగడితపు తా. నంగడితపు పూ. ము. 6. బెళబెళల. 7. శిఖరలు. తా, 8. పాంసులవణాంశభంజల ఫలరసముల. తా. పాంసులవణశుభోజ్వల ఫలరసముల. పూ.

గీ. కరము లచ్ఛోదకమ్ములఁగడిగి వార్చి
తులసిరేకులు సేవించి కఱుకుపచ్చ
డాలుతిన్నెవసించి బాగాలు ధవళ
నాగవల్లిదళంబు లందఱకు నొసఁగి. 18

ఉ. ఆ యతిథివ్రజం బనిచి యంచితభక్తి నియుక్తి బాలరా
మాయణమున్ బఠించి తెలనాకులతోఁ గపురంపుబాగముల్
జాయ యొసంగఁగా ముఖవిలాసమొనర్చి రమేశు [1]సత్కథల్
పాయకవించు నా ఘనుడు ప్రత్యహమిట్లుచరించుధన్యుఁడై 19

క. తరళ యనంగ నొకానొక
తరళవిలోచన తదార్యదంపతిసేవా
తరలమతిఁ దద్గృహమ్మునఁ
దరలకవర్తించు నెంచఁదగువర్తనలన్. 20

క. [2]వఱువాత లేచి యాబుధ
వరు వరవుడుఁ[3]బోల్పఁదగినవారెవరన శ్రీ
వరుఁగీర్తింపుచు వాకిలి
వరుసన్ ముంగిళ్ళు దుడిచి వారనిభక్తిన్. 21

క. గోమయగోముఖకలన
శ్రీ మెఱయఁగఁ బంచవర్ణరీతులమ్రుగ్గుల్
ప్రేమ నలుగడల నించున్
వేమరు తరుణీజనంబు విస్మయ మందన్. 22

క. వాఁకిటికి వచ్చు సతులం
గైకొని వినయావలోకగతి నలరించున్
శ్రీకార్య [4]పరులకు నమో
వాకం బొనరించు వికచవదనాంబుజయై. 23

శా. అయ్యమ్మంచుఁదదార్యదంపతుల నెయ్యంబొప్ప సేవింపుచున్
వ్రయ్యల్గా సకలాఘముల్ హరివినిర్మాల్యంబు ధమ్మిల్లసా

1. తత్కథల్. తా. 2. దరు. తా. 3. జాల. పూ. ము. 4. వరులకు. తా.

హాయ్యంబొంద ముకుంద దాసజనశేషాన్నంబు [1]ఉత్కీలసా
న్నాయ్యంబై యలరం జరించుఁ జెలి యానందంబున న్నిచ్చలున్.

క. ఈరీతి నామహాత్ము న
గారమ్మున సంచరించుకారణమున నా
నాతీమణికిఁ బురాకృత
ఘోరాఘములూడె మిగులఁగూడెన్ శుభముల్. 25

శా. ఆచెంత న్వసియించు భూసురుఁడొకం డౌదార్యకర్ణుండు రే
ఖాచేతోభవమూర్తి కాంతిజితరాకాకోకవిద్వేషి వి
ద్యాచాతుర్యఫణీశదేశికుడు ప్రేమాయత్త చిత్తుండు త్ర
య్యాచారాచరణప్రచారి హరిశర్మాఖ్యుం డుదారోన్నతిన్. 26

సీ. కలికిప్రాయంపురాచిలుకబాబాలూను
[2]మీనుటెక్కియపు తెమ్మెరలతేరు
నరవిరి విరిమొగ్గ శరముల కిరవగు
చిగురల్లికల తెల్ల చెఱకువిల్లు
తేనియబాప్పంబునూనియ జిగిజిమ్ము
తమ్మిపూరెమ్మ దోదుమ్మికత్తి
[3]చల్వజెల్వగు నల్లకల్వలఱేకుల
చికిలిసంతనవింతచిలుకుజోదు
[4]లేకయుండిననేమి నాళీకలోచ
[5]నాజనానూనమానద నవ మనోజ్ఞుఁ
డనఁగ కనుపట్టె భూ[6]దేవతాత్మజుండు
వలపు చెలువొందు నిండు జవ్వనమునందు. 27

సీ. నునుపుగాదువ్వి వైచిన శిఖాబంధంబు
ఘనలీల నవటుభాగమున వ్రేల
[7]మేలిమి నిద్దంపు జాళువా పోగులు
చికిలితేఁజెక్కులఁ జిగిదొలంగ

---

1. ఉత్కీలికాన్యాయంబై. పూ. ము. 2. మీరు. 3. చెల్వ. తా.
4. లైయుండిన. తా. 5 నాజనానూననాజనానూన.... జ. తా. 6. దివిజాత్మ.
తా. 7. యీలాగుజాళువాపొంగుల్లు. తా.

ధవళయజ్ఞోపవీతముల తేటలు దుకూ
లోత్తరీయద్యుతి [1]నొత్తి కలయ
వెలిదమ్మి రేకుల విఁకవిక నగు నూర్ధ్వ
పుండ్రంబు నుదుటిపై మురువుఁ జూప
జిలుగు నీర్కావిదోవతి చెఱఁగు చరణ
నఖర ముఖ రమ కాచ్ఛాదనమ్ముగాఁగ
కొదమ ప్రాయంపు మేని నిగ్గులు కడాని
పొళ్ళ వెదఁజల్ల విప్రుండు పురిఁ జరించు. 28

గీ. *[2]పిటిపిటకోటి శ్రమయించు లేటిచూపు
వలపువాడుల గని తలవాంచునతఁడు
దైవకృతమెట్టిదియొ కాని తరళఁ జూచి
తరళతర చిత్తవృత్తియై తత్తరించు. 29

క. ఏచిన మోహాము[3]చే నతఁ
డా చెలిచెలువంబుఁ దలఁచి [4]యాచరితత్ర
య్యాచారనిత్యకృత్యుం
డై చేతోజాతదశల నలజడిఁ బడుచున్. 30

క. మక్కువ తమకము తరితీ
పక్కర నివ్వెరగుగాఁగ [5]నద్భుతము భయం
బెక్కుడు తమి వేగిరపా
టొక్కట రాగమునఁ బోర హోరాహోరిన్. 31

మ. సిగదువ్వన్ ముడివైచు దువ్వమఱియుం జేదోయి బిట్టెత్తుచున్
బిగియన్నిక్కుచుఁ బెక్కుచేష్ట లొలయన్ బెట్టావలించు న్నఖా
గ్రగతిం [6]జీరి తటుక్కునన్ బయిఁబడన్ ఘర్మాంబువుల్ జిమ్ముచున్
వగగా [7]వగ్గము నుగ్గడించు ఘనరావస్ఫూర్తి కంఠధ్వనిన్. 32

1. చెంత తా. *ఈ పద్యము పూర్వ ముద్రణమున లేదు. 2 విటివిటి. తా.
3. చేతన్ఁ తా. 4 యాచాతత్రా. తా. 5. యదుద్ధుఁద్భుతమభయం. తా.
6. జేరి. తా. 7. నంగము, పూ. ము.

క. జమిలి తెలిజన్నిదంబులు
సమములుగాఁ బట్టి [1]వ్రేళ్ళ సందున దువ్వున్
భ్రమసి తన పెదవి తానే
చిమచిమ మన [2]నొక్కుఁ [3]జొక్కుఁ దెలిగని మ్రొక్కున్. 33

క. ఇటువలె తనుజూచిన య
ప్పటనుండియు నతఁడు భావభవసాయక లం
పట మానసుఁడై [4]దిటచెడి
చిటిపొటి నునువలపువలలఁ జిక్కుటకతనన్. 34

క. చిత్తంబు కరఁగి కరుణా
యత్తమతిం దెలియ సజ్జనాచారముతోఁ
బొత్తుడిగి మరుని చివురుం
గత్తికి లోనయ్యె నయ్యగారని ప్రేమన్. 35

సీ. నునువెండికడియముల్ మినుమినుక్కన సారె
కును దువ్వి పంకించి కొప్పువెట్టు
గబ్బిగుబ్బలు బైలుగాఁగఁ బైట చెఱంగు
జాఱించి సవరించు సారెసారె
కప్పుదంతపుడాలుగార్కమ్మ తళ్కుట
ద్దముఁ జూచి నాభి యందముగ దిద్దు
పనిలేనివని కనుంగొను నేటవాలుగ
వాలుగన్నుల గరువమ్ము వొదల
ముద్దు ముద్దుగఁ గడప్రొద్దు ప్రొద్దు వన్నె
పుట్టములుగట్టి చిటిపొటి పూతసొమ్ము
వెట్టి మట్టెల రవళి కన్పట్ట తిరుగు
చిరుగుసిగ్గున పొరుగుభూసురుని యెదుట. 36

1. వ్రోళ్ళ. తా. 2 నొక్క. తా. 3. చెక్క. తా. 4. విటచెడి. తా.

క. వారిరు[1]వురు నిటు వలపుల
కోరిక లీరికలు గొనఁగఁ గుసుమశరకర
[2]స్ఫారధనుర్ముక్తశరా
సార విమూర్ఛిత మనోంబుజాతద్వయు[3]లై. 37

క. విద్దెయుఁ గులమును శీలము
పెద్దఱికము గట్టి[4] పెట్టెవిప్రుఁడుగడునై
పెద్దల[5]పను పిలువాటిక
సుద్దులు జల మెత్తుటయును సుదతియు మఱచెన్. 38

క. ఇత్తెఱఁగునఁ జెలిహత్తుక
చిత్తజరణకేళి[6]జాళిఁజిక్కి ధరాదే
వోత్తముఁడు క్రీడసల్పఁగ
దత్తనుమధ్యకును నేను దనయుఁడనగుచున్. ౩౯

క. బాలోచిత కృత్యంబుల
మేలిమి జనయిత్రి మైత్రిమీఱఁగఁ బెనుపన్
నాలుగునై దుశరత్తుల
బాలుఁడనై గోముమీఱ బ్రబలుచునుండన్. 40

క. ఇనరుచుల వేడి వడదా
కిన ఘన[7]పద లక్ష్మిమేన కలిగింపఁగ వా
డిన వనజాత దళమ్ముల
యనఁ దుమురంబగుచుఁ బర్వె నంభోదంబుల్. 41

గీ. ఎలమి నిన్నాళ్ళునై చిత్తి నింకనైనఁ
బుచ్చుకొన్నట్టి యప్పిచ్చి పొమ్మటంచు
హరిహయుఁడు భాను జుట్టిన గురి యనంగ
భీష ణాటోపతను పరివేష మడరె. 42

1. వురకిటు. పూ. ము. 2. సార. తా. 3 లై. పూ. ము. తా. 4. పెట్టి. పూ. ము. తా. 5 పెనుపలవాటగు........బెల మెత్తు........నిమఱగెన్, పూ. ము 6. జాల పూ. ము. 7. సద. తా. పదలక్ష్మి మేనఁగలింపగ. పూ. ము.

క. ఇల నెమ్ముల నాడింపఁగఁ
దొలకరి నట్టువ కొలంపుదొర యెత్తిన చే
నలరెడువు త్తడిబెత్తనఁ
దళుక్కు మనెఁ దీగమెఱుపు ధనదాప్త దెసన్. 43

గీ. సమయవీరుఁడు వేసవి శత్రు దోల
నించు ¹సింహనాదమనఁగఁ జంచలించు
పాంథతతి గుండె ²ఫక్కున బగుల మొగిలు
ఘుమఘుమ నుఱిమె దిక్కులు ఘూర్ణిలంగ. 44

గీ తగిలి తన వారి నెదురు చాతకగణంబు
రాలఁగొనిరువ్వె మేఘుఁ ³డౌరా యనంగ
స్థిగ ననంతాబ్జగేహ్మపూజించు విరుల
కరణి జలజల మని వడగండ్లు రాలె. 45

క. ఉడుపథ మను మట్టిం గడు
నెడ⁴విడి వడి డిగిన యూడ లివియన ధారల్
బెడిదముగ నంబుదంబులు
జడిగొని వర్షంబు గురిసె జలధులు పొంగన్ 46

సీ. అత్తఱిఁ గౌండిన్యుఁ డనుమౌని ⁵యమల వి
జ్ఞాన మానసుఁడు సచ్ఛాత్రుఁ డగుచు
తీర్థసేవాకాంక్షఁ దిరుగుచు ఘనదైత్య
చక్రమౌనా హరిచక్రమునకుఁ
బను దేర గోవిందశర్మ యెఱింగి యె
దుర్కొని యింటికిఁ దోడితెచ్చి
పుత్రులు దాసను బోలఁతియు నర్ఘ్యపా
ద్యమ్ములొసంగి సాష్టాంగమెరఁగి




1. సింహదలోయన. తా. సింహములోయన పూ. ...
3. డా. తా. 4; విడువడ. పూ. ము. తా. 5. యనమ. తా.

ఘోర దురితాబ్ధిఁ దరియింప నేరకున్న
కలుషమానసునకు నాకు [1]గలిగెఁ దేవ
పుణ్యఖనినైతి శోభనంబులు ఘటిల్లె
గుడిసె పావనమయ్యెఁ గోర్కులు [2]ఫలించె. 47

గీ. అని సుధారసరూపంబులైన భోజ
నముల [3]దృప్తినిఁ జేసి యో యమివరేణ్య!
వానకాలంబు చరియింప వశము గాదు
నిలువఁగాఁదగు [5]రెన్నెల్ల కొలది యిచట. 48

మ. నను మీదాసుని వేఁడు సేయక మునీంద్రా! నాకు నీకోర్కె యిం
డనుచున్ వెండియు మ్రొక్క నియ్యకొని నెయ్యంబొప్ప గోవిందశ
ర్మను రారమ్మని వైష్ణవాగమకథామర్మార్థ మేవంవిధం
బని బోధింపుచుండెఁ గొన్ని నెల లయ్యారణ్యకుం డచ్చటన్. 49

క. యమిసార్వభౌమ! నాభా
గ్యముకతనన్ డింభకుండనై యుండి[4]యుఁ ద
ద్విమలాగమతత్త్వశ్రవ
ణ మనీషాసక్తి మిగుల నామదిఁ బొదలన్. 50

సీ. ఆ మహామహులు నన్నత్యంత దయఁ జూపు
చూపులఁ జూచి నా చుంచు కేల
దువ్వుచు లేఁ జెక్కు దోయియంటుచు ముద్దు
ముద్దుగాఁ బిలిచి నన్ ముద్దుగొనుచు
తిరుమణిదిద్ది యిత్తెఱఁగున మిక్కిలి
యాదరింతురుగాని యవలబొమ్మ
టంచుఁ బల్కరు తల్లి వెంచు మోహం బెచ్చ
[6]కాకలి దప్పియు లేకపోఁగ

1. గలిగి. తా. 2. ఘటిల్లె. తా. 3. దృప్తుని. పూ. ము. 4 య. న. పూ. ము. 5. తెన్. పూ. ము. 6. కాకలిదప్పి వేకావఁబోఁగ. తా. నాఁకలి దప్పిలేకాఁ పఁబోఁగ. పూ. ము.

నేను తమతోడిదే లోకమై నటింప
మమత యెట్టిదో కావి యమ్మౌనివరుఁడు
నన్ను సుదర్శనశంఖచిహ్నములఁబాత్రుఁ
జేసి మంత్రోపదేశంబు సేసి మఱియు. 51

గీ. అచటఁ గొన్నాళ్ళునిలిచి [1]యయ్యార్యమణికి
నన్నియునుఁదెల్పి కౌండిన్యుఁ డరుగునంత
దైవకృతమునఁ దనతల్లి తనువుఁ దొరఁగి
చనుటయును నేను గోవిందశర్మ [2]కెరగి. 52

చ. దళితవికార! దేవరకు దాసుఁడనౌట ఘటిల్లె నామదిం
దెలివియొకింత మీయనుమతిన్వనసీమఁ దపంబుసేయఁబో
వలయు నసుజ్ఞయిందు భవవారిధిదాటు నుపాయ మేగతిం
గలుగదు కాననామనవి కాదన కానతి యియ్యఁగాఁదగున్, 53

క అని యాతని యనుమతిఁ గై
కొని దినదినగమనమునను [3]కుధరతతులలో
ఘనమై నిఃపాదప[4]తతి
ఘనమై యిలమాద్రిమీఱు ఘటికాద్రితటిన్. 54

క. చపలతఁ బొందక శీతా
తప వర్షాబాధలకును దైన్యపడక యేఁ
దపమాచరింప హరి యా
తపమునకు న్మెచ్చి కరుణ దైవారంగన్. 55

సీ చపలాభమైన పచ్చని దట్టి కటిఁగట్టి
కరముల శంఖచక్రములఁ బట్టి
గరుడపచ్చలచాయగల కాయమొప్పంగ
చలి వేడి వెలుఁగుచూపులు చెలంగ

---

1. యయ్యారమణికినెన్నియును. తా. యయ్యారుమణికినెన్నియును పూ. ము, 2. కరగి తా. 3. కుధరతరులలో, తా. కుధరతరులతా. పూ. ము. 4. తద్ఘనమై. తా.

వనధికన్యక నెయ్యమున నిండు కొలువుండు
వత్స [1]సౌధమున శ్రీవత్సమలర
హార కిరీట మంజీ రాంగ దోదార
మణికాంతి దిశల [2]నామనిగఁ బర్వ
తార్క్ష్యుపై నెక్కి శౌరి ప్రత్యక్షమగుచు
రథసగతినేగ నిందిరారమణుమూర్తి
గానఁజాలక నిజముగాఁగందుననుచు
ఘోరతపమూన నపు డశరీరవాణి. 56

క. ఎంత తపమాచరించిన
నింతకు మిక్కిలి శుభమ్ము లీజన్మమునన్
వింతలు డింభక విను జ
న్మాంతరమునఁగల్గుఁ దథ్య మనియె మునీంద్రా! 57

మ. అనిన న్మంచిది యందు కేమియని జన్మాంతంబు పర్యంతమీ
తను వేలాయని యోగసంస్థిని గాత్రంబ న్విసర్జించి యా
వనజాతోద్భవ నందనుండనయి దివ్యన్మూర్తిఁగైకొంటి స
జ్జన సాంగత్య మహత్త్వ మిట్టి దని యెంచంగూడునే యోగికిన్ 58

క. అన విని భృగు వానారదుఁ
గనుఁగొని విను జనులకొంగు కనకము విద్యా
జనకము నగు పుణ్యకథన్
వినిపించితి రద్భుతంబు వింటిన్ మంటిన్. 59

క. ఘటికాచలవృత్తము వి
స్ఫుటముఁగ భవదీయసూక్తి సుధ శ్రుతియుగళీ
పుటములు నిండఁగ జిలుకుచు
ఘటియింపు ప్రమోదరీతి కమలజసూతీ! 60

సీ. అన విని భృగుమౌని గనుఁగొని కల్యాణ
కరణంబు హరిభక్తి కారణంబు

1. ముప్పొంగ తా. 2. నాగమని, తా. 3. నేగి తా.

నో ఘటికాద్రి మహాత్మ్యంబు గణుతింప
గాలేరు పరమాణుగణములెన్న
గలవారలైనను గావున నాయెఱిఁ
గినయంత యెఱిఁగింతు [1] వినుము వనజ
నాభుఁజూడఁగ గోరి నలినాప్తతేజులు
సప్తసంయములు ప్రశస్తమూర్తు
లాది చాక్షుష మన్వంత రాంతమందు
నర్ణవములెల్ల నొక్కటియైనవేళ
నేక శృంగమహామత్స్యమైకడంగి
హరి వివస్వత్తనయుఁగావఁ గరుణఁబూని. 61

గీ అఖిలమును మేదినీరూపమైన యోడ
[2]లోన నిండించి వాసుకి దానినంట
గట్టి యే గట్టుఁదని శృంగంపుఁ బుట్ట
బెట్టెఁబోలెడు నెర తేనెపెర తెఱఁగున. 62

గీ. గగనగంగాతరంగ సంగతములైన
శీకరము లే నగేంద్రంబు శిఖర సీమ
[3]రిక్కగమితోడ చెండాడు దిక్కులనెడు
[4]ముదిత లొగిఁజల్లు తెలి మొల్లమొగ్గ లనఁగ. 63

క. వర కవి నుత జీవనతన్
సరసులు సరసుల బెడంగునం దగు విద్యా
ధర గరుడోరగ కాంతలు
హరిఁ బాడుదు రే నగేంద్ర మం దనిశంబున్. 64

గీ. వెలలు మించిన మానికమ్ములు ధరించి
పునుఁగు కస్తూరి కర్పూరమును జవాది

1. యేను వినుడు వనజ. తా. 2.లోన వాసుకి కట్టె నేగట్టు రేని శృంగాగ్రసీమ బెట్టువోలెడు నెర.తా. 4. రిక్కలతో విడు.డాడు.తా. 4.ముదిలోగి.తా.

పూసి హిమవారిఁదోఁగుచువాసికెక్కు
రాజులోఁ యన నందలి రాలు దనరు. 65

కం. చేరువ నెల జింకకు నా
హారమిడ నెలవిపూరియందించు దయో
దారత నే గిరిహరిణము
లారయఁగా బంధుభావ మట్టిదయః దా! 66

కం. మెండగు తాలిమి నెందే
నుండి తపం బాచరించి యుగ్రునితోఁ దోః
ఖండనముచేసి వాసిగఁ
బాండవమధ్యముఁడు [1]పొందె పాశుపతంబున్. 67

వ. ఆ శతశృంగశిఖరిరాజమ్మున రాజీవకుముదరాజివిరాజమానామంద నిష్యంద మకరంద ధారా పునఃపునరేధితాంబుపూరంబును చరదురు ద్విజవ్రజ గరుత్పటల జాత వాతోద్ధూత ప్రసూనానూన పరాగ స్థగిత తటంబును చటులోత్తుంగ తరంగ ఘుమ ఘుమోద్భటా రావ వ్యాప్తపరిసరంబును నిజత్రోటికాపుట విదళిత మృణాళనాళ [2]శబళనాసక్త సంచరన్మరాళ సారసాది నానావిధ పతిసంకులంబును నగు నొక్క సరోవరంబుగాంచి తదుదంచితస్థితికిహర్షించి యనూన స్నానపానానుష్ఠాన విధానమ్ములకు నిధానమ్మగునని యెంచి తదీయతటాంచిత వివిక్త స్థలంబున నిలిచి నిత్యకృత్యములుదీర్చి మౌనధ్యానమానసంబు మీఱఁ గుక్కుటాదిమయూరాంత నిగమ నియమాసనమ్ముల నియతాత్ములై నిలిచి [3]యేకాక్షరప్రాణా యామపరత్వంబునం జేకొన్న యింద్రియాదులం దొలంగించి కాంచనకాచంబులందు మానసం బేకమ్ముగాఁ జేసి మమతలు గోసి సుషమ విశోక జ్యోతిష్మతి విషయవృత్తియు ననం బ్రసిద్ధంబైన ధారణాత్రితయంబును తమకు సర్వార్థసాధకముగా గొని కామగతిఁ గట్టిబెట్టి నిజదాసజనతాపపాపత్రయచయమ్ములనడుగక [4]నడుగబడజేయు నడుగుదమ్ములును [5]మన్ను మిన్ను నిండియ నిగ్గు లగ్గలంబుగాఁ బిక్కటిల్లు చక్కని చిక్కని చొక్కపు పిక్కలును

1. జెందె. తా. 2, నిబళ. తా. 3. యకౌంతః: తా. 4. నడుకబడి. తా. 5, మునుమిన్నుదిందియ. తా.

సంచత్కాంచనరంభాస్తంభగంభీరప్రభాప్రవాహంబుజూరు నూరు యుగళంబును [1]చిరత్నరత్నప్రభాంచిత కాంచనమేఖలా పరివృతాచలనితంబప్రతిబింబంబగునితంబంబును నంబుజాత [2]తనూజాతునకు మాతయైన నెత్తమ్మికిం బోల్కియై మిక్కుటంబైన పొక్కిలియును సురగరుడోరగ కిన్నర గంధర్వ సిద్ధ సాధ్యఖేచర చారణ విద్యాధరాదులుసంచరించునంబరంబు మధ్యంబుగాఁజేయు మధ్యంబును వైజయంతీలలంతికాకమలకౌస్తుభరత్నశ్రీవత్సవిరాజితంబగు వత్సంబును దర్పితౌద్ధత్యదైత్యదానవచ్ఛిదావినోదకరంబులయిన కరంబులును నిజదాసజనావనాభిముఖంబయిన ముఖంబును నవార్ఘ్య మాధుర్యంబయిన మావితేఁజిగురు నధరంబుగాఁజేయు నధరంబును నాయతంబగు జాంబూనద హాటంబు సోయగంబునకుఁ [3]దానకంబై యున్న యున్నతనాసయును నరవిందేందిర [4]కోక వింతకాంతిఁజూపు చల్లనినిడువాలుజూపులును నెక్కువకళలుజిందు నిందుఖండంబులంజెక్కివైచు చొక్కంపు చిక్కిలిలే జెక్కులును నూతన కైతక గర్భదళ [5]విభాళంబయిన ఫాలంబును చిరత్నరత్నఖచితోదారకోటీరప్రభాంగంబై రంగుమీఱు నుత్తమాంగంబును గల యిందిరాసుందరీమనోహరుండగు హరిని నానందంబుతో డెందంబునంబొందుపఱచి చంచలతయు వేసటయు లేక తపంబు సేయునయ్యవసరంబున. 68

సీ పగడంపుమంకెన జగడంబు సేయు డాల్
పగడంపు సోగకంబముల మీద
నిగుడంబుజమువంటి నిగనిగ విడికెంపు
పువ్వులు పచ్చరాబోదెనూదు
పోడిమగరాచందుకోడిగ నంటినజాతి
రేజోతి రాగోడ జాజుటాకు
జేకొను హొన్నుకాసియతీఁగె మోడి ప
నుల చిత్రపటముల తళకు వెలసి

---

1. చిరత్నప్రభ యత్నాంచిత. పూ. ము. తా. 2. యైనజాతునికి. తా.
3. దానాసయై. తా. 4. కోర. తా. 5. విల్లోళంబైన. పూ. ము.

కళుకు బంగారు తేకుల కులుకు మీఱి
జెళుకు తెరమానికపు జగతులను సోయ
గంబు నింబగు వైజయంతంబులోన
నిండుకొలువయి యుండి నాఖండలుండు. 69

ఉ. చారుఁడొకండు ఘర్మకణజాలము ఫాలము మోచి పాదముల్
మేరగ ధారగాఁగురియ మేనువడం [1]కఁ గడంక నిల్పు దౌ
వారికకోటి దాటి కయివారపువారి వదల్చి కిన్నరీ
చారణగానముల్గలఁచి సమ్ముఖమంది భయమ్మునొందుచున్. 70

ఉ. చేరఁగవచ్చి మ్రొక్కి సురశేఖర! దివ్యకిరీటకోటిమం
దారనగప్రసూన రసధౌతపదాంబుజ! దానవచ్ఛిదో
దారశతార! మీరనుప ధారుణికింజని యొక్కవింత నే
నారసివచ్చినాఁడ భయమయ్యెడుఁదెల్పగ సామిసన్నిధిన్ 71

సీ. ఈవఱకును సామియిచ్చలోఁజరియించు
మన్ననపురుషులు మాన్యచరితు
లల భరద్వాజ కశ్యప గౌత మాత్రి కౌ
శిక జమదగ్ని వసిష్ఠమునులు
పరమ పతివ్రతాభరణమైన యరుంధ
తీరమణియు నతితీవ్రనియమ
పరతమై శతకూటపర్వతేంద్రమున న
త్యుగ్రతపస్థితినున్నవారు
నాకమో యటుగాకున్న నలినభవుని
లోకమో కాక స్మరవైరిలోకమో ము
కుంద లోకమో వారల ఘోరతపము
పాకమునకుఫలంబు త్రిలోకనాథ! 72

గీ. మఱుఁగువెట్టక వెఱవక మఱుపులేక
కన్నకార్యము మఱివిన్నకార్య మెల్ల

1. కడకంట .తా.

విన్నపమొనర్పఁగా నీతి వేగరులకు
చిత్త మిఁకదేవరపరాకు సేయఁదగదు. 73

చ. అనవుడు గుండెఝల్లనఁగ నాదివిజాధిపుఁడొక్క భృత్యునిం
గనుఁగొని రంభ నూరుజితకాంచనరంభను తోడితెమ్ము పొ
మ్మనఁజని యంతయుం దెలుప నాచెలి వార్తలువేడ వాఁడునే
విన మఱి [1]యేగుదేరి యొకవేగరి బాగఱి వేగకృద్గతిన్. 74

గీ. వచ్చి విచ్చలవిడి కొల్వువారి నెల్లఁ
దలఁడనుచుఁజొచ్చి దొర చెవిదండఁ జేరి
పలికె నేమేమొ నాకేమి తెలియదబల
పిలువుమన వచ్చినాఁడ రావలయు ననుడు. 75

సీ. చల్లని పన్నీట జలకంబు [2]లారిచి
చెంగావిపావడజిగిబెడంగు
వెలికిఁ గ్రమ్మఁగ జిల్గు వెలిపట్టు కటిఁగట్టి
కప్పురమ్మున తిలకమ్ముదిద్ది
కమ్మని తావులు కడలంట కొప్పున
మందారకుసుమదామములుచెరివి
తనువు పంకజగంధమును [3]బూతజవ్వాది
తావియునొండొంటిఁ ద్రస్తరింప
రెప్పలకుకొంత జిలిబిలి రేక [4]గూర్చి
వెన్నెలఁ పంటయౌహారతతి గబ్బి
గుబ్బచన్నులపైఁ జెన్ను గులకరింప
* తొలకరి మెఱుంగునా మేనుతులకరింప. 76

క. కలువలచెలి మేనల్లుం
డల [5]పింతయులేక వీఁక నార్చినరీతిన్

---

1. యేమిదేయొక. తా. యేమిదేవియొక. పూ. ము. 2. దీరిచి. పూ. ము. తా. 3. బూయ. తా. బూయు. పూ. ము. 4. గూర్ప. పూ. ము. తా.
* ఈ పాదము తాళపత్రప్రతిలో లేదు. 5. వింతయు. తా.

పలకమగరాలరతనపు
కళుకుల మొలనూలి చిరుతగంటలు మ్రోయన్. 77

క. కనకస్తంభ స్తంభన
జనకములై హస్తిహస్తసారహారములై
యనఁటుల మీఱెడి యూరుల
మినుకులు మిన్నెల్లఁ [1]బర్వి మిలమిలలీనన్. 78

గీ. మంజుశింజిత మంజీర కంజరాగ
రత్నరుచి త్రోవకును రాగరసము నింప
మెల్ల మెల్లన నడచునో [2]మెట్టెదోయి
కదలి ఘలుఘల్లుమని తాళగతుల[3] మొరయ. 79

ఉ. కీరమొ? కాక చిల్కతురికీదొరరాణిధరించు మౌక్తికా
హారమొ? పాకజిజ్జియవిహారమొ? [4]పార్వణచంద్రచంద్రికా
సారమొ? చంచలారుచులసారమొ? యౌర! యటంచు చూపరుల్
సారె నుతింప నంచనడలన్ సకివచ్చె బలారిచెంతకున్. 80

క. వచ్చిన యచ్చరఁజూచి వి
యచ్చరులచ్చెరువునొంది యతనుని శరముల్
విచ్చలవిడి వడి గాడఁగ
నచ్చెలి చెలువంబు వొగడి రతిమోదమునన్. 81

సీ. పులుదిండిజూల సొంపులునింపు నెఱికురుల్
తేగడ నెలవంక దిద్దునుదురు
రేకచీఁకటిమూకసాకు కన్బొమ్మలు
కలువల వలపించు కన్నుదోయి
సంపెంగయలరువాసన కాసయగు నాస
చికిలియందఁపు ముద్దు చెక్కుదోయి
సావితేనియ బావిదీవియౌ కెమ్మోవి
మొల్ల మొగ్గల వెదజల్లు రదము

1. పన్ని మిన్నులనీనన్. తా. 2. మెట్టి. పూ. ము. 3. మెరయ. తా.
4. పార్శ్విక. తా.

లతను వఁమురి మురిపెంబు నలము గళము
నలరుఁ దీవెలఁగెలుచు చేతులును కుంద
*నంపు గిండ్లను గదుము పాలిండ్లు మింటి
నంటయిన లేఁతకౌను నీనాతి కలరు. 82

గీ. యువమనో [1]మీనములఁ బట్టదివురు మరుని
చేతి నీలఁపుఁ గాలఁపుఁ [2]జివ్వ యనఁగ
జంటవాయని కఱిచీను చాలనంగ
తీరు మీఱె నయారె యీనారి యారు. 83

క. చక్రము భ్రమ కిరవయ్యెఁ
చక్రము తుత్తునుక లయ్యె శక్రవిజయ ని
**ర్వక్ర సహాయంబగు నీ
చక్రపయోధర నితంబచక్రము [3]తొడరఁ. 84

క. చొక్కపు ముత్తెమ్ములతో
చుక్కలతో మిగుల నీడుజోడాడుచు సొం
పెక్కెడు పదాబ్జ నఖరము
లిక్కొమ్మల మిన్న చెలువ మే మనవచ్చున్. 85

గీ. వనిత వీనులు శ్రీవైభవంబు నొంద
వాసి కెక్కె తదీయ విలాసదర్ప
ణంబులై ముద్దుచెక్కులందంబు నొందె
కానిచో నిట్టి చెల్వ మెందైనఁ గలదె? 86

సీ. మగువ నెమ్మో మ్మబ్జ మహిమచేఁ దనరారు
కన్నులు రాజీవకలనమీఱు
[4]నాతిచూపులుకాండజాతకౌతుకమందు
కంధర జలజ విఖ్యాతిఁ జెందు

** ఈ పాదమునయతితప్పినది. 1. మానముల. తా. 2. జిల్వ. పూ. ము,
* ఈ పాదము తాళపత్రమునలేదు. 3. తొడరున్. పూ. ము. తా. 4. నారి. తా.

కలికి చన్నులు మహోత్పల కోరకత మించు
నాభి సారస మహోన్నతి వహించు
కలకంఠి కౌను పుష్కరతేజమునఁ బోల్చు
లలితాంఘ్రి వనజపల్లవతఁ దాల్చు
అహహా! శతపత్రగంధినిల్వంతయును సు
వర్ణకమలాకలాభిరూప్యంబు గాంచు
ముదితమాత్రంబె తలప నీమోహనాంగి?
పచ్చవిలుకాని చిలుక సామ్రాణి గాక. 87

సీ తల:కి భంగంబునందకపోవు టదియెట్లు
రమణి పొక్కిలిసాటి రాఁదలంచి
కడు విచ్చి గొందుల నడఁగకుండుట యెట్లు
చెలి ముంగురులరంగు చెనకఁదలఁచి
పలచనై వెలవెలబాఱకుండుట యెట్లు
పొలఁతి కెమ్మోవితోఁ బోరఁ దలఁచి
లాఘవంబేది వ్రాలకపోవు టదియెట్లు
బాలచూపుల సరి పోలఁ దలఁచి
సార సరసీ తమ స్సుధాసార విశిఖ
వార [1]మారార! యఖిలైకవర్ణ నీయ
కలన చెలువొందు లలన యంగములతోడ
నెంచి చూచిన నెందైన నీడు [2]గలదె? 88

సీ. కపురంపు నునుగ్రోవి కస్తూరి నెత్తావి
జిగమించు చికిలి తేఁజిగురు [3]మావి
మోహాంబునిధినావ ముత్తియమ్ముల [4]కోవ
మోహన శాంబరీమూర్తిచేవ
[5]వలపులతరితీపు నెలఱేని కళప్రాపు
వలఱేని యాలవ కలికితూఁపు

1. మోకౌర. తా. 2. గలరె. తా. 3. మోవి. పూ. ము. 4. క్రేవ. తా.
క్రోవ. పూ. ము. 5. తలపుల. పూ. ము.

పసిడిశలాక లేఁబ్రాయపుటజ్జాక
మిసమిసమించు క్రొమ్మించురేక
కళుకు రతనాల [1]తేట [2]బంగారుమూట
పలుకుచెలి చేతిచిలుక మవ్వంపు మొలక
కంతు పట్టపుదంతి సేవంతిబంతి
కలికిజక్కవచంటి యీ కలువకంటి, 89

సీ. మెఱసి విల్కాడఁజూపు మెఱపులో నొఱపు [3]బి
త్తరములోఁదరము నిద్దాపసిండి
మిసిమిలో మిసిమి నింపెసఁగు సంపంగి పూ
తావిలోఁదావి కందర్పుచేతి
కిరుసులో బిరుసు చిత్తరువు పుత్తడిబ్రాత
హొరువులో మురువు సొంపలరుపువ్వు
తీవలోచేవ ముత్తియముల సరముమే
ల్కాళుకులో బెళుకు రాగంపుమణుల
లోను రంగునఁగూర్చి త్రైలోక్యమోహ
కలిత శృంగారరసమునఁగరువుగట్టి
మదనరాజీవగర్భుఁడీసుదతిఁజేసెఁ
గాక లేకున్నఁగలదెయీ రేక చెలికి ? 90

చ. కలువకటారియీ చెలువ గా దలసంపఁగితూఁపు గాదు [4]మే
త్తళుకులబిత్తరంపుఁదమితమ్మిమెఱుంగులనేజ కాదు క్రొం
దలిరునరాజి కాదు జిగిఁదార్కొను గేదఁగిచిక్కటారు కా
ద లరులవింటివానికిఁ బ్రియంబగు మోహనబాణమెన్నఁగన్. 91

సీ. అమరలోక [5]మదేభగమనాభిరూప్యంబు
కులుకు నెన్నడలచే గెలుచు ననియు
ధారుణీహారిణనేత్రారూఢవిభ్రమం
బొరపుచూపులనె పోఁదరుము ననియు

---

1. పేట పూ. ము. 2. కోరికలపేట. తా. 3. చి. పూ. ము. 4. గా. తా. 5. మదాభిగమనా, తా. పూ. ము.

పాతాళ నాగకాంతా తనుశ్రీలను
నింపొందు జడచే జయించు ననియు
నిఖిల సత్కీరవాణీవిలాసస్ఫూర్తి
కలికిపలుకులనే గదుము ననియు
కాదె యీకాంత కెంతయు కంతు దండ
మొంద త్రైలోక్య సుందరీబృంద రూప
గురుతిరస్కారసూచన బిరుద మొసఁగె
వాలు నునుజూపు బేడిసడాలు పేర 92

క. ఈపడఁతుకఁ గని మదనుని
తాపంబును బొందకుండ ధాతకు వశమే?
బాపురె! యని సుర లెన్నఁగ
నాపైదలిఁజూచి వజ్రియనియెన్ బ్రీతిన్ 93

చ ఘనకుచకుంభ! రంభ! యొకకార్యము వార్యము మద్భుజాతటా
గ్ర నిశిత వజ్రధారకును గావున నిన్నిటుఁబిల్వఁబంచితిఁ
మునులు వసిష్ఠముఖ్యులు తపోనియతిన్ శతకూటపర్వతం
బున ధృతినున్నవారు జగముల్ తపియింతపఁదపోగ్నికీలలన్. 94

గీ. వారినేడ్వుర వలరాచవారి బారి
వారి గావించి గర్వపర్వతముద్రుంచి
వచ్చినప్పుడె మెచ్చునీవలయు[1]జాడ
నిచ్చువారము వనివిను మిపుడె కదలి. 95

చ. అన విని యోసురేంద్ర! భవదాజ్ఞ తలం ధరియించి యానగం
బున జరియించు మౌనుల తపోనియమంబు కలంచి *ధ్యానభం
జన మొనరించి మౌనవిరసత్వమునించి జపంబుమాన్పి క్రొ
న్నన విలుకాని మంత్రములు నాలుకలన్ లిఖయించి వేడకన్. 93

గీ. **తాళవృంతంబు నిలువుటద్దంబు కుంచె
పసిడికాళంజి కపురంపుపైడిగిండి

1. జాడ. పూ. ము. తా. * ఇటనుండిపద్యము పూర్వముద్రణమున లేదు.
** ఇటనుండి కాళంజివరకు పూర్వముద్రణమున లేదు.

యడపములు మోచిమునులునాబడిని కాణ
యాచి బంటులువోతెరా నరుగుదెంతు 97

చ. ఇదియొకయాడికఁబె దివిజేశ్వర ! నాకు ? మదీయసృష్టికిన్
మదన విరోధియైన ధృతిమాలి చలింపక నిల్వనేర్చునే ?
[1]యది యల వెన్నుడేయెఱుఁగు నన్నను పేంద్రుఁడునవ్వ నింద్రుఁడున్
ముదమున పోకలాకులును భూషణముల్ దయనిచ్చి [2]మంచిగన్ 98

గీ. అనుపుటయు రంభసంరంభమడరఁగదలి
[3]తనదు వెనువెంట వేల్పుజవ్వనులు గొలువ
దొన వెడలివచ్చు మదన మోహానవిలాస
శాత విశిఖంబు నా నివాసంబు వెడలి 99

సీ. ధమ్మిల్ల సురతరు స్తబకవాసన కళుల్
ఘుమ్మని చుట్టు [4]పేరెమ్ము గొనఁగ
నాసాగ్రమౌక్తిక నవ్యచంద్రికగ్రమ్మి
కమ్మ కెమ్మోవిపై గంతు లిడఁగ
వాలుగన్నుల డాలు వలరాజు కెంగేలి
వాలు జాడించిన లీల [5]నలర
శ్రవణ భూషారత్న చకచకద్యుతులు నున్
జెక్కులచక్కి సొంపెక్కి నిక్క
కంచుక కిసల [6]గ్రంధి సంఘములు వించి
మించు గుబ్బలడాల్మిఱుమిట్లు గొలుప
భరిత రుచిరోరుయుగళ సౌభాగ్యరంభ
రంభ యాగట్టుఁ జేరె సంరంభమడర. 100

గీ. అపుడు మేనక మొదలైన యప్సరసలు
రంభ గనుఁగొని [7]యో చిగురాకుబోఁడి

1. మదియట. తా. 2. మచ్చిగన్. తా. మచ్చికన్. పూ.ము. 3. తనను. పూ. ము. 4. వేడెంబు. తా. 5. నడర తా. 6. కుచభి. తా: 7. యా. తా. కతిచిరురాకు పూ. ము.

విడిసినా[1]డిక నా వెడవిల్తుఁ డనుప
మున్ను గావచ్చి యామని వన్నెఁ గాఁడు. 101

సీ. కారాకు లెడలె ముంగలికలు కళుకొత్తె
కోరిక లీరికల్గొనె చివుళ్లు
పువ్వులతావులు పొలుపొందె పిందియల్
ఫలములై ఖగతఫఃఫలములయ్యె
సేవగావలరాజు [2]సేనగోరగ సోన
లై తేనెవాన జోరనఁగఁగురిసె
కమ్మతెమ్మెర వలిగ్రమ్మ మెల్లన వీచె
రాగంబ నించె పరాగమనుచు
ననుచు నచ్చరలేమలు ననుచు ముదము
మద మెదలనింప నింపగు మందమంద
నతుల నతులితవాక్యసంగతుల నతుల
వనము శృంగారసారజీవనము జేరి. 102

క. తురుముఁ ర్విచ్చి జఁడల్ కఁడు
మురువుగ ధరియించి పోఁక ముడి గట్టిగ గ
ట్టిరహిన్ జిలుగుం జేలలు
పిరిచుట్లుగఁ జుట్టి కుసుమవిహారణపరలై. 103

సీ. నీకేల యటువోవ నీకేల నందుకొ
మ్మాకొమ్మ నీకొమ్మనులయువిరులు
కేసరం[3]బులు వేనికే సరమ్మున కైన
ఘాసిల్లు[4]నందనప్రసవచయము
[5]చెంప చంపకమున్న చేరనేరదు తేటి
చంపకామోద యీ సరస [6]నిలుము

1. డిదెయా. తా. 2. సేనగోరి సేనలై. తా. 3. బుదువనికే. తా. 4 నందలి తా. 5. చంపకమున్నది (చెంప) నేరదు తేఁటి సారసామోద యీసరసనిలుము. పూ. ము, 6. నిలుపు. తా.

వావిలిపూవు లీవావిలువకుమటి
సేవంతి[1] నీవంతు సేసినాము
బాలనీకింద పూఁబాళ యేలమాకు
కేళికొరవెను నీకు కంకేళిచివురు
మొల్లలేమొల్ల మెల్లరు మెల్లరారె
యనుచుఁ బువ్వులు గోయుచు వనజముఖులు 104

సీ. తమమైమెఱుంగుల గుమురు లంతంతకుఁ
దఱచైనమెఱుపుల యొఱపు నెరప
తమ ఝుళం ఝుళనూపురముల రావంబులు
పటు గర్జితమ్ములభంగిఁ దనర
తమ రత్నభూషా ధాళధళ్యంబులు
నీరంధ్రవృష్టిపూనికభజింప
తమ విహారముల నాదట రాలు వేణికా
కుసుమముల్ వడగండ్లపస వహింప
వనభర లీల నై వర్తనముగాఁగ
వనవితతి [2]ప్రోదిసేయగా వచ్చినిలిచి
నట్టి కాదంబినులనంగ నందమొంది
మెలఁ(గి) రప్పుడు వేశ్యానజ్జలజముఖులు. 105

క. [3]తనురుచి లతలకు నవ్వుల
ననలకు మైవలపుసొలపునందావులకున్
బొనరిచి రతివలు నయమిడి
జనముల[4]చేపట్టి యేలు జనపతులక్రియన్ 106

క. [5]కర మురమునెఱసి సురమద
కరి కుంభములన్ హసించు కాంతల కుచముల్

---

1. లను (సరుల్) సేసినాము. పూ.ము. సేవంతులీవంతు. తా. 2. ప్రోవి. తా. 3. తనరచిలతనకు. తా. 4. చెప (గి) దివిడియుజనవతుల. తా. 5. (విరి దెప) నెరసి. తా.

మెరసి చనుట మొన[1]గాంద్రకు
స్థిర మున్నతిమీఁద మన్నతియుఁగల్గుఁగదా! 107

క. రాచిలుక పండ్లు [2]గొఱుకుచు
నేచిన కోపమున వదన మెఱ్ఱఁగఁ జేసెన్
జూచితివే చెలి? తనభా
షాచతురత నీదు పలుకుసాటికిరామిన్. 108

గీ. వలపు కానుక సేయు పూవులకు నూరు
పులును పుప్పొడి చల్లు తీవలకు హస్త
మూలకాంతులు కరముఁగబొలిచి రబల
లగునె యన్యోన్యబంధుకృత్యమ్ము లెందు. 109

గీ. చిలుకపోటుల జీరలచేఁ జెలంగు
దాడిమ ఫలమ్ముఁ జూచితే తరళనయన!
విటుని [3]నునుగోటితాకులఁ [4]బేటు లెత్తు
గబ్బి సిబ్బెంపు బిగిచన్ను గుబ్బవోలె. 110

సీ. అనయంబు మాటదాటని చిల్క [5]పల్కుల
ఫలభంగములఁ జేయఁ బాడి యగునె?
యొకకుత్తుకై యుండు పికనికరమ్ముల
తేఁజిగుళ్ళకుఁబాప నోజ యగునె?
నడకలో బెళుకింత వొడమకఁ జరియించు
రాయంచల నలంచ న్యాయ మగునె?
కన్నుసన్నల మెలఁగఁగ నేర్చు వెన్నెల
పులుగుల సిలుగుల నలచ నగునె?
తగుల మెన్నక యీవగ పొగరు వగల
నగడు గావింప నవి తమకజ్జ మైన
యెడల గొడవలఁ బెట్టక [6]యేల వలదె
కలదె యీచింత యచ్చర కాంతలార! 111

1. గాళ్ళకు. తా. 2. గోరుచు. తా. 3. నిను. తా. 4. నలరుకులట. పూ. ము. తా. 5. దాటుల. పూ. ము. 6. యుండ. తా.

చ. పలుకఁగ నంత నూర్చుఁ గనఁ బాడ ముఖాంబుజమెత్త [1]కాలిసో
కుల నమియంగఁ గౌఁగిలిడ గోగు రసాలము సింధువారమున్
తిలకము బ్రేంకణంబు గణుతింపఁగ సంపెఁగ [2]పొన్న వంజుళం
బల సురపొన్న క్రోవియుఁ బ్రియమ్మున గ్రొవ్విరులిచ్చె హెచ్చుగన్ 112

చ. సుర యుఁమియంగఁ గేసరము చూచినచోఁ దిలకంబు [3]కౌఁగిలిన్
గురవము తన్న వంజులము కూరిమిఁ బాడఁగఁ బ్రేంకణంబు చే
పరపుల మావి మూర్కొనఁగ వావిలి పల్కఁగ గోగు మోమునె
త్తరమున జంపకం[4]బుమియఁ దా సురపొన్నయుఁ బూచె నయ్యెడన్. 113

మధురగతిరగడ.

పూవిలు [5]తుని యమ్ములపొది మామిడి
యీవలరాచల మేటికె గామిడి
పాదిరి పూవులపై [6]చెయి సాచకు
సాదువవౌదువు సకి మమ్మేచకు
యేలకి తీవల కేటికె వాదులు
యేలె వగలు మీరెంతటి సాదులు
ఇందువదన రమ్మీవిరితీవకు
నందని పూవుల కాసకుఁ బోవకు
అలయించక చెలి యాడల వాడకు (?)
పొలతులు రారే పొన్నల నీడకు
[7]పొగడలు పువులివి పొలతులు కోయకుఁ
[8]దగడుతనమ్మున నఁదఱు డాయకుఁ
డీ మొల్లలకై యేలే రంతులు
ఏమిట తక్కువె యీ సేవంతులు
విరవాదులకా విడువని రోసము
మరచితివా చెలి మన్నన దోసము
*సురవొన్నల యంచలగను సేయకు (?)

*   *   *

1. గాలి, తా. పూ. ము. 2. గున్న. పూ. ము. 3. కౌఁగిటన్. తా. 4. బునగ. 5. దుది. 6. చై. 7. పొగడపూవు లీ పొలతుక. తా. పొగడపూవు లివి పొలతుక పూ. ము. 8. నగడుగాదె మీరందరు డాయగ. తా. కనగడుగాది మీరందు డాయకు పూ. ము. * ఈ పంక్తి పూర్వ ముద్రణమున లేదు.

[1]కినియుచు గోసితె గేదఁగి పువ్వులు
వనితరో నాతో వలదే నవ్వులు
†బొండు మల్లెలకె పోలఁతిరో ముచ్చట
మిండతుమ్మెదలు మెలఁగెడు వచ్చట.
*గన్నెరు పూలకుఁ గన్నెఱ నేతురె

*   *   *

*పలుకకె చిలుకలు బారులు దీరెను
*జళుకకువే నీ సరసత మీఱెను
చెలి విరిగుత్తులు చిదుమగ నీ యలి
కలికి పఱచె నహహా యది వెంగలి
యనుచు ననుచు మది నందఱ గూడుక
వనితలు తమలో వదలని వేడుక
తేనియ కాల్వల దెప్పల దేలుచు
సూనానవముల సొక్కుచు సోలుచు
కలరవకులముల కైవడిఁ బలుకుచు
కలహంసల నగు గతులను గులుకుచు
పుప్పొడి తిన్నెల పొలుపుగఁ బాడుచు
కప్పుర పనఁటుల కదలిచి యాడుచు. 114

గీ. కుసుమహారశేచ్ఛఁ జాలించి కుసుమశరుని
శాతబాణంబులనఁగ రంభా తిలోత్త
[2]మాది ముఖ్యాప్సరసలు సమ్మదము మదుల
బొదల నచ్చోటువాసి యా మునుల డాసి. 115

క. దగ్గర బోరా దగ్గికి
వెగ్గలమై యున్నదౌర [3]వీరల తేజం

---

1. కినిసి. తా. †పూర్వార్థమున ఛందోగతి విచార్యము. * ఈ పంక్తులు పూర్వముద్రణమున లేవు. తాళపత్ర ప్రతిలోగూడ నీ రగడ సంపూర్ణముగా లేదు.
2. మాముఖ్యాద్యప్సరసలు. తా. 3. వీరుల. తా.

బగ్గలిక పలుకు వలుకుట
సిగ్గులచేటయ్యె నేమిసేయుదమింకన్. 116

క. అమరులు వినఁగా మనమా
యమరేంద్రుని సమ్ముఖమున నసుమాటలు నే
డమరక పోయెగదా యని
యమరసతులు మంతనంబు లాడుచు వ్రీడన్. 117

సీ. తేఁటిపాటలు దిద్దు తెఱఁగున నటపాట
పాటగా నీటుగా పాటపాడి
[1]యెలయించి పరభృతమ్ములఁ బిల్చు చెల్వున
పలుకుల తేనియల్ దొలక వలికి
[2]అంచల గడు [3]నుడికించు చందంబున
నడల యొయ్యారంపు నటన చూపి
కేకి సంఘంబు జంకించు చందంబున
గిలకొట్టి బెట్టుగా కేక వేసి
అలరుతేనియ కరయంత్రములను జిమ్మి
యెమ్మె మీఱఁగ దీఁగ యుయ్యేలల నూగి
పూవు బంతులు చెంతలఁబోవ మీటి
తావి పుప్పొడినీ ర్వసంతంబులాడి. 118

గీ. భావ హేలానుభావ విభ్రమ విలాస
లలిత బిబ్బోక విభ్రమాదులను బేరు
గల యలంకారములను శృంగారకలన
వెలయఁగా మీఱి మఱి చొరవలకుఁ జేరి. 119

సీ. గుబ్బకుమ్ముల నెదల్ గుమ్మెలువోఁ గుమ్మి
గట్టిగా బిగియారఁ గౌగిలించి
కపురంపు వీడెంపు గంధంబు గుబులుకో
వేమారు చెవుల నేమేమొ గొణిగి

1. యలయించి పూ. ము. తా. 2. యచ్చట కడు నడకించు. తా. 3. నడకించు పూ. ము.

కరకంకణమ్ములు [1]మొరయఁ బదముల వ్రే
ల్చిటికలుదీసి మచ్చికలు చేసి
కళల యిక్కువలంటి గళముల సందిళ్ళ
క్రొవ్వాడి నులివంక గోరులుంచి
యెంత గరగించి [2]నను నొకయింతయైనఁ
జలనమందక రాఁబ్రతిమలును బోలె
నలరు జడదార్లగని లజ్జఁజెలులు తలలు
వాంచి తమనేర్పుఎల్లఁ జాలించి యలసి. 120

క. [3]నడిమింటి తపసి డెందపు
[4]నడిమింటం జెలగు [5]దమ్మినంటు వెలుంగున్
గడుదారి యాతపములన్
జడదారుల యా తపముల జడసి యలంతన్. 121

క. నీవు లొకించుక వీడన్
మోవులు వసివాడ నూరువులు తట్టాడన్
పూవిలుతుఁ [6]డెక్కి విడిచిన
[7]మావులునా వచ్చు చెలుల మానస మలరన్. 122

గీ. తరుణలతికా పరీరంభ తత్పరుండు
కైరవిణికాబ్జినీపుష్పగంధరతుఁడు
మధుకరీగాన సంయుక్త మానసుండు
మలయ పవమానుఁ డెదురుగా మలయుటయును. 123

కం. ఎదురెదురుగఁ జని చూచిరి
మదవతు లరవిందబృంద మకరంద రసో
న్మద చంచరీక కేళీ
సదనంబై యొప్పు నొక్క జలజాకరమున్. 124

1. మెరయ తా. 2. నా యొక. తా. 3. నడిమింట. తా. 4. నడిమింటిం జెలసి. పూ. ము. 5. ఈ కడమభాగము. పూ. ము. న లేదు. 6. తమ్మి విడిచిన తా. 7 మడువులు. ఈ పద్యము పూర్వార్థము పూ. ము. న లేదు. 121. 122 పద్యములు రెండును ఒక పద్యముగా అసమగ్ర చిహ్నములతో పూ. ము. న కలవు.

ఉ. అప్పుడు వేలుపున్ సకియ లందఱు జోడుగనుద్దిగూడి డా
ల్చిప్పలు వన్నియల్ [1]వదలి చిత్రపు చందురకావి పావడల్
గప్పి కటీతటమ్ముల [2]చెలంగి కరమ్ముల నీలశృంగముల్
ద్రిప్పుచు మోదవారివిధిఁ దెప్పలఁ దేలుచు హాళి మీఱగన్. 125

ఉ. తీరముఁ జేరు సౌరసుదతీతతినీడలు తేటయౌ సరో
వారిఁదనర్చె తత్కచముల వాసిని [3]తాను ననేకమూర్తులై
వారినెకుర్కొనందల చివచ్చెనునా నదియట్టు లేకదా
కూరిమిగల్గు నెచ్చెలులకున్ సయిదోడుల కెన్న నేటికిన్. 126

గీ. జిలుగు అవికల లోపల నలరుబోఁడ్ల
గబ్బి సిబ్బెంపు బిగి వలి గుబ్బ లమరె
చిత్తజాతుని యురుఁలోఁ జిక్కి యున్న
కలికి పెక్కువ జక్కవ కవల [4]కరణి. 127

గీ. అరుణ కిరణోద్ధతిని వాడు నచ్చరలను
గను గొని సరోజగేహిని కరుణమీఱ
వెల్లగొడుగులు పట్టించు వితము మించ
నంచగమి నిల్చియాడె చాలగుచు దివిని. 128

చ. పలుకుల పంతముల్ గులుక బారులుదీరి కొలంకుసొచ్చి యా
కులుకుమిటారిగుబ్బెతలు గుబ్బచనుంగవబంటిలోతునన్
నిలిచి యొకళ్ళొకళ్ళపయి నీరజ కైరవ హల్లకోత్పలం
బుల [5]నిగుడించుచుం గదిసి బుజ్జటకొమ్ములఁ జిమ్ములాడుచున్. 129

గీ. కఠిన వక్షోజశైల సంఘట్టనమునఁ
దిరిగె దరఁగలు భూమి భృద్వరుల సత్వ
గరిమ నెంచని బలుమొనకాళ్ళమీద
నడరు జడమూర్తులకు [6]గెలుపగునె యెందు ? 130

1. సడలి. తా. 2. చెలంగ. పూ. ము. తా. 3. తాల్మిన. పూ. ము.
4. కరుణ. తా. 5. నిగుడింపుచున్. 6. గ్రేలువగు.

గీ. రమణియొక్కతె కడునిబ్బరమున నీద
నిగ్గుదేరెడి చిన్నారి నెమ్మొగమ్ము
వేణిరాణించె జాబిల్లి వెఱచి కునుక
కినుక వెనుకొను సింహికాతనయు కరణి. 131

క. తను బట్టలేని చెలులం
గని నవ్వుచు నోలయిడుచు కలికి యొకతె యా
ౘను గొలకంతయు నరుదా
*స్తనకుంభప్లవము [1]లండ సంపాదింపన్. 132

మ. తరుణీరత్న మొకర్తు వెల్లికిల నీదఁ గుబ్బచన్నిందియల్
గరమొప్పెందమ యామినీగత వియోగగ్లాని వారింపఁగా
వెర వూహించి [2]ముఖాబ్జుఁగాంచి భజనావృత్తిం బ్రవర్తింపుచున్
వరముం జెందగఁ[3]జేరు జక్కవలు నవ్యస్ఫూర్తి శోభిల్లగన్. 133

గీ. నిండుజాబిల్లి తల్లియై నిగ్గుదేరు
మోముమాత్రము గానరా మోహనాంగి
యొకతె నిలువీతలీదఁ జెన్నొందె కురులు
తమ్మి గ్రమ్ముక విడని భృంగమ్ములనఁగ. 134

క. కలుకుం గుబ్బల గందము
గళముల కుంకుమము నుదుటి కస్తురి నెమ్మే
నుల పసపు సరోలక్ష్మికిఁ
జెలువుగ నీరాడి సహజ శృంగారముగన్. 135

గీ కొలను వెలువడుచోఁ దమ గోవమోము
తమ్మితావులుగొన మరందమ్ము వెడలఁ
గ్రాయు తుమ్మెదలనఁగఁ గంకణములీను
కీలు[4] గంటులు చెలఁగ నవ్వాలుగంట్లు. 136

---

*స్తనకుంభము (ఉరమునందు సంపాదింపాన్) అని పూర్వముద్రణమున నీపాదము పూరింపబడియున్నది.

1. లుండు. తా. 2. ముఖంబు పూ. ము. 3. జేయ జిరవలఁ తా, 4. గండ్లు చెంగల్వ నవ్వాలుగండ్లు. తా.

గీ. తడి వలిపె చంద్రకావిపావడలు వైచి
యొండొరు నితంబబింబ కుచోరు నఖము
ఖాంకములు జూచి చిరునగవంకురింపఁ
జలువలును రత్నభూషణములును బూని. 137

క. పువ్వులు పూతలు గైకొని
యవ్వల యౌవనజ భావ [1]హావములలరన్
జవ్వనులు [2]మెలఁగ నత్తరి
[3]ముఖ్వన్నియవేల్పు చరమభూదరమెక్కెన్. 138

గీ. మొదల బూర్వాశఁ జెందితి పిదప [4]పద్మి
నికిని కరములు సాచితి వికను దొలఁగు
మనియ పూర్వాశ తాలఁదాచినఁ దదంఘ్రి
యావమన రాగ మిగురొత్తె నర్కు మేన. 139

మ. ఇనుఁడత్యుత్కటతేజుఁడై మెలఁగి [5]భూయిష్ఠానురాగంబునం
దనుఁ జేరంజను దేరఁగా నపరదిక్తన్వీశిరోరత్నమె
త్తిన నీరాజనమోయనం దదనుషక్తింబుట్టు [6]రాగమ్ము త
త్కనదాశాసతిమేన బల్విరిసెనాఁ గన్పట్టె సాంధ్యద్యుతుల్. 140

సీ. ఉదయించినది మొదల్ మది మోద మలవడ
కల వసూత్కరము సానులనుఁ జేర్చె
ద్విజరాజమండల తేజంబు మాయించి
కువలయవృద్ధి తక్కువగఁ జేసె
గురుతరస్తోమ విస్ఫురణంబు సందుగొం
దుల నిగూఢక్రియ నిల నొనర్చె
పుణ్యజనస్తోమముల పెంపు దూలించి
పద్మినీసతిఁబట్టి పగలు గూడె

1. హారము. తా. 2, మెలఁగిరత్త రి. పూ. ము. 3. పువ్వన్నియ. తా.
4 పద్మినికి. తా. 5 భూజిష్ఠ. తా 6. గారమ్ముతత్కనవాశా. తా.

ప్రబలనుగ్రప్రభుత తుదిరంగ మదర
నంటె[1] ధారుణినని తను నఖిల జనము
తూలనాడెడునిందకుఁజాల కవర
వారిధినిబడెనన గ్రుంకె వనజహితుఁడు. 141

గీ. [2]అస్తగిరిశిఖరాహతిధ్వస్త రవిర
థాశునవపాతి శకటాంజనౌఘమనఁగ
తుముల మదనప్రతాపాగ్ని ధూమమనఁగ
నంధకారంబు జగమెల్ల నాక్రమించె. 142

చ. జగములనేకకాలమున శంబరవైరి జయింపఁబంచినన్
నిగిడిన నల్లమూకయని నింగియు నేల యనంతరూఢికై
మొగి బెనగంగఁ జేరెనన బుట్టిన యిండ్లను జూడ భూమికై
డిగఁబడు కార్మొగిళ్ళనఁగ తీవి దలిర్చెనె చిమ్మచీకటుల్. 143

గీ. జలజవనినుండి తుమ్మెద వలసవోయెఁ
గువలయ వనీదళాంతర గుహలుసేర
బల్గిదుండయి చీకఁటి కొల్ల[3] కాదు
వక్రవిక్రమగతి దిశలాక్రమింప. 144

చ. సమయవణిగ్వరుం డతులసాంధ్యవిభారుణ కంజరాగ ర
త్నము లెడలించి నీలి నునుదట్టపు టొల్లియ మీద చాలుగా
నమరిచినట్టి నొక్కటపుటాణిమెఱుంగుల[4] మొత్తముల్ బలెన్
గ్రమముగఁ దోచెఁ దారక లఖండరుచిన్ గగనాంగణంబునన్. 145

క. ఆకాశమండల [5]మధుమ
ధూకానోకహమునందుఁ దులకించు సుమా
నీకముణోకం[6]దగి య
స్తోకప్రభ కడల నిక్కఁజుక్కలు దోచెను. 146

---

1. వారుణి. తా. 2. హస్త. తా. 3. కాని. తా. కాడ పూ. ము.
4. ముత్తెముల్ వలెన్ గ్రమమున. తా. 5. మన. పూ. ము. 6. దని. తా.

చ. కలువల[1]గోము జక్కవలగాము వియోగులబాము నల్లవే
ల్పులదరయొజ్జసానినెరమోహపు [2]దీము విభావరీసతీ
తిలకము మోము తుంటవిలుదేవునియాముగులాము మంచుర
చ్చలతెలిగీము కుందరుచిసాంద్రుఁడు చంద్రుడుదోచెఁ దూర్పునన్.

చ. కువలయ విభ్రమభ్రమరగుంభితగేయనవాదితేయ సం
స్తవమెలయన్ చకోర ముని సంతతి సంతసిలన్ తమో సురాం
గ వితతి వే కరాళుగముఖమ్ముల జిమ్ముచుఁ బూర్వ శైల తా
ర్క్ష్యపై విలసితాంసవీధి కమలాహితుఁ డుజ్జ్వలుఁడయ్యెనయ్యెడన్ 148

సీ. పచ్చకప్పురపు కుప్పలు నింగి యంగడి
నించు మర్యాద రాయంచలెల్ల
గుంపుగూడినగతి గొప్ప గందంపు ల
ప్పలు విప్పలుగా నుంచుపగిది కుంద
మాలిక[3]లెత్తినమాడ్కిని మగరాలు
చల్లినకరణి వింజామరములు
వ్రేలఁగట్టినలీల పాలారఁబోసిన
పరువడి శంఖముల్ పఱపుజాడ
తెల్లుబూచినయేపున మల్లెవిరులు
పేఁక వెలిదమ్మితేకులజోక [4]నిండు
పండు వెన్నెల వెల్లి యఖండరుచుల
కంజజాతాండ ఖండంబు కలయఁబర్వె. 149

వ. ఆ సమయంబునఁ జెన్నలరు కన్నెవన్నెలల వెన్నెలపులుగులలము
కొన్న చిన్నెలవన్నెల చిన్నారి పొన్నారి జిగితొగరు వగపొగరు
తొగరేకు చిప్పలొప్పారు కోరలుగా నలవరించి యించువేడుకల
కలకలారావంబుల నొండొంటిఁబిలుచుచు వలవంతల చింతల
యింతుల చెంతల రంతులు సేయుచు డాయుచు పాయుచు బంతులై
కూర్చుండి నిండుపన్నీటి యేటి కాలువల తావుల తావులం దాము
కొన్న కన్నె వెన్నెలలునించి యించు ఖండరసమ్ము మించు గుజ్జు

---

1. గాము. తా. నోము. పూ. ము. 2. జోము. తా. బోము. పూ. ము.
3. వి త్తిన మర్యాద. పూ.ము. తా. 4. నిండ. పూ. ము. తా.

వెన్నెలల నంజుకొననిచ్చి నచ్చికల బుజ్జగింపుచు కూరిమి మీఱం జేరి నారీమణుల కొనసంగి పిదపఁ గ్రోలుచు సోలుచు వ్రాలుచు చొక్కి చొక్కి మదం బెక్కి నిక్కి మక్కువలుమీఱ ససమమదన సామ్రాజ్య సంపదం బొంపిరి వోవునదియును పట్టయినమింటి పెనమునం జూపట్టి చూపట్టని తొట్టినమదంబున నిందుబింబం బదటు నం జేసి పెరవారి కదిసిన వానిబోగదిమి నిక్కుగల ముక్కులచెక్కులం జిదుమబోయి చఱచి మేనుమఱచి యెక్కడెక్కడవోయె నేదేది యేమేమి యనుచు ననుచుమదమ్ము మెక్కున దొక్కుతొక్కు పలుకులు పలుకుచు నళుకుచు విందులుగా చిందులు ద్రొక్కునదియును పొగరువగ మబ్బునమబ్బి తబ్బిబ్బుగానాగుబ్బగబ్బిపోటు మాటలాడి జగడించి మిన్నంటి కొన్నింటిసాకిరివెట్టి చెలువగల కలువతేకుల [1]బాకులు వీఁకంబూని యానికతలంకక బింకంబున నంకంబునకు జంకించక వేట్లాడనగ్గలికడగ్గరు ననియును మవ్వంబునివ్వటిల్ల చెందొవపూవులు కాడలతో గదియించి యకరువులు మెట్లుగాబూని, యానూలునసానికగా తంత్రులు నిలిపి క్రొవ్వాడిమీఱుకొనగోరు లోకయించుక మోచి నీటుగా మీటుచు టోటులురాఁగోరి వెన్నెలల నలయించు జిలిబిలివలపులపొందుగా చిందులువ్రాయించునదియును నగుచు నగుచు నున్నవాని వినోదమ్ములు కన్గొనుచు నానాకలోక కోకకుచానికరంబులు ప్రయత్నంబున. 150

క. మునిలోక కోకవైరులఁ
గని మోహలతాళిఁ ద్రుంచి ఘనతరవైరా
గ్య నిరూఢినున్న వీరలఁ
జెనకన్ మఱిఁ గినుక శాపశిఖిఁ ద్రోతురొగిన్. 151

గీ. ఫాలలోచనఫాల కరాళనేత్ర
కీల కీలల లీల మిక్కిలి తపోగ్ని
దనరియున్నారు వీరల ధైర్యధనము
కన్నపెట్టఁగఁ జాలఁడు వింతుఁడనుచు. 152

1. బొంకులు. తా.

క. ముందర నరుంధతిం గని
సౌందర్యముబూనుమేను చటుల తపోగ్నిన్
గందఁగ నున్నది వికృతిన్
జెందింపఁగఁ జాల దీ వసిష్ఠమునీంద్రున్. 153

మ. మన యాటల్ మన పాటలున్ మన కళామర్మానుభావక్రియల్
పనిలే దిత్తఱి వాదమేటికిని నీపాటింక నెవ్వారలున్
గనకుండం జనకున్నఁగాదని పొసంగన్ రంభతోఁబల్కి వ
చ్చినజాడం జనిరందఱుంగదలి యా జేజేమిటారుల్వెసన్. 154

క. చని రచ్చర లిటు వీరల
కెనయెవ్వరు ధైర్యచర్య నిల నని మునులన్
గనుఁగొన వచ్చెననఁగ వే
గనుపట్టెన్వేగుజుక్క కాంతులు [1]నిక్కన్. 155

ఉ. వేలుపు జవ్వనుల్ జనిరి వేకువ తేకువగూడ జూడగా
దాలిమి దూలి వీరు దయదప్పి యొకించుక కన్నువిచ్చినన్
జాల ప్రమాదమంచు రభసంబున నంబుజవైరిజాఱెఁబెన్
జాలిని నస్తకూటముల చాటున డాగగఁబోవుకై వడిన్. 156

క. తుఱుమున దుఱిమిన మొల్లల
సరు లెడలి గగనలక్ష్మి సంపంగి విరుల్
దుఱిమెనొనా రిక్కల [2]సిరి
దఱుగన్ రవిరుచులుకొన్ని తఱిఁదీండ్రించెన్. 157

సీ. చీఁకటి మొదలిజేజేలపైఁ జను నింద్రు
[3]క్రొంబట్టు తెలిగుడారంబనంగ
ఇనురాకఁ బ్రాగ్దిశావనజాతి కై [4]సేయ
పాటించు రత్నదర్పణమనంగ
ఉదయాచలమురారి హృదయభాగమ్మున
రాణించు కౌస్తుభరత్నమనఁగ

1. నింకన్. తా. 2. హరి. తా. 3. కెంబట్టు తా. 4. సేసి.పూ.ము.తా.

పూర్వాంబుధిప్రాంతభూమిఁ గన్పట్టెడు
మంజు ప్రవాళ నికుంజమనఁగ
కుముద రమ పెంపు నెత్తమ్మిగుంపు సొంపు
కటికచీకఁటి [1]తిండి శంకరునిబండి
వేవెలుంగులజోదు మువ్వేల్పుపాదు
ప్రాచిఁగనుపట్టె మినుకులబరణి తరణి. 158

సీ. అట జటాధరనిటలాంబకు లంబర
తటినిలో నిత్యకృత్యములుదీర్చి
సైకతవేదికాస్థలముననుండి యొం
డొరులనీక్షించి యత్యుగ్రనిష్ఠఁ
బేర్చి తపంబుఁగావింపఁ బెక్కుసహస్ర
[2]సమలు గతించె విఘ్నములు దోఁచె
నడపొడ గాన మయ్యఖిలలోకేశ్వరు
డా రమాజాని ప్రత్యక్షమగునె
భాగ్యహీనులకకట తాపసుల లోన
వాసి వన్నెయుఁ బోఁ దఱవంపుగాఁగఁ
బూన్కి చాలించి పోరాదు పోయి యేరిఁ
గాంచినను గార మిఁక యేది గతి తలంప. 159

క. అని తలపోయుతఱిన్ భో
రన నంబరవాణి పలికె నతినిష్ఠ తపం
బొనరింపఁ జనియె బహు హా
యనములు మునులార యీ యహార్యమునందున్. 160

క. ఇచ్చట నెన్నాళ్ళకు నా
పచ్చికడాల్మేనిసామి ప్రత్యక్షంబౌ
టచ్చెరువు వినుఁడు వేఱొక
ముచ్చట యెఱిగింతు మీకు మోదంబొదవన్. 161

---

1. దిండి. పూ. ము. తా. 2. సమములు చె. తా. సమములుచెల్ల. పూ. ము.

క. ఘటికాద్రికరుగుఁ డచ్చట
ఘటికామాత్రమున మీకు కాంక్షిత మెల్లన్
ఘటియిల్లు [1] నెంచఁదగునా
ఘటికాద్రికి మాద్రి యద్రి గలదే జగతిన్. 162

సీ. అమరస్రవంతికి శమనదిగ్వీథిని
నూఱుయోజనముల మేర నిగమ
విద్యావధూకాంచి విలసిల్లు నల కాంచి
*యలకాంచితంబయి యచట నశ్వ
మేధము జేయు వాణీధవు విశ్వను
తోత్తరవేది శ్రీయుక్తుఁడగుచు
* * *
* * *
* * *
* * *
నద్రిరాజంబు శ్రీఘటికాద్రి దనరు
నదిగదా నిత్యసదన మయ్యచ్యుతునకు 163

గీ. అందుఁజేసినతప మణువంతయైన
కోటిగుణితంబు ఫలియించు కోర్కెలెల్ల
నరుగుఁ డాశైలమున కను నభ్రవాణి
వాణి చెవులార విని మునిప్రవరు లపుడ. 164

గీ. కదలి పుణ్యాశ్రమంబు లగణ్యపుణ్య
భూములును బుణ్యదేశము ల్పుణ్యనదులు
పుణ్యతీర్థములును పుణ్య[2]పురులు పుణ్య
శైలములు జూచుచు మునిచంద్రు లరిగి. 165

సీ. ఆదిఁ ద్రివిక్రమపాదపంకేరుహో
దరభాగమున నవతార మొంది

1. నేచతగు. తా. *ఈ కడమభాగము పూ. ము. లేదు. 164 వ పద్య మీ సీస మున కెత్తుగీతిగా ముద్రింపబడియున్నది. 3. మునులు. పూ. ము, తా.

సత్యలోకంబేలుసామి [1]కాల్యకరణి
యనిదానకలశి పావనముసేసి
నిటలలోచన జటాపటలిఁ దెప్పలఁ దేల్చి
వర భగీరథ తపోవ్రతముకతన
ప్రాలేయశైలమార్గమున భూమికి జాఁటి
కూరిమిఁదనవారిఁగ్రుంకువారి
కలుషములడంగఁజేయు రంగత్తరంగ
త్రిజగతీకృత సుకృతవర్ధిత నిజాంగ
గంగఁ జేరంగనరిగి సాష్టాంగ మెరఁగి
కూడికొనియాడి మజ్జనంబాడి యాడి. 166

సీ. జలదనీలశ్యాము శాంకరీస్తుతనాము
సకల దేవ సమూహసార్వభౌము
నీలాచలావాసు పాలితనిజదాసు
కటితటీవిస్ఫురత్కనకవాసు
నఖిలలోకాధ్యక్షు నఘదంతిహర్యక్షు
కౌస్తుభశ్రీవత్సకలితవక్షు
[2]బృందారకోదారు నందగోపకుమారు
హార కిరీట కేయూర హారు
వల్లవీజారు రవిసుతావనవిహారు
శ్రీ జగన్నాథు నాదిలక్ష్మీసనాథుఁ
గాంచి సేవించి పూజించి కడు నుతించి
హర్షపులకిత సర్వాంగు లగుచు మునులు. 167

గీ. గంగకన్నను గడు వృద్ధగంగయనెడు
[3]వహిని వహియించు నా పుణ్యవాహినిఁ గని
వినుతులఁ జెలంగి తత్తీర్థమున మునింగి
మునివరేణ్యులు సమ్మోదమునను బొంగి. 168

1. కాల్యకరణీయదానకలసి భావనసేసి. తా. ఈ భాగము పూర్వముద్రణమున లేదు. 2. బృందారతోదారు. తా. 3. వాహినివహించు. పూ. ము. తా.

క. శ్రీకాకులవల్లభుని ని
రాకులమతిఁ బూజచేసి యా హరిదయఁజో
క్కాకుల జోకన్ [1]దుల్లిం
గా కర్మములెల్ల హర్షకలితాత్మకులై. 169

క. [2]అల మును లెదుటం గాంచిరి
కలహంసీమధురవాణి కమలజపాణిన్
బులినశ్రోణిన్ ధృతశై
వలవేణిన్ గృష్ణవేణి వారిధిరాణిన్. 170

ఉ. అన్నదిచెన్ను కన్నులకు [3]నామని సేయ గృతావగాహనో
త్పన్నమహాప్రబోధరసపారగులై మఱి వార్ధిపొందుగై
కొన్న యనేక వాహినుల గోరిక లీరికలెత్త గ్రుంకుచున్
వెన్నునికిం దివాణమగు వేంకటశైలముఁ జూచివేడుకన్. 171

చ. చనిచని కాంచి రా దివిజసంయములందఱు ముందఱన్ గన
త్కనక మణిప్రభాజనక ధాతు గుహాతటశృంగసాలమున్
జనజనిబంధ నేంధనధనంజయదంచిత తీర్థజాలమున్
సనకసనందనాది మునిసంస్తుతశీలము శేషశైలమున్. 172

వ. కాంచి తదుదంచితస్థితికి హర్షించి యమందానందకందళితహృద యారవిందులై మునిపురందరు లందఱుం దండ వందనంబులాచ రింపుచు తత్కుధరా రోహణంబుగావించి చనిచని ముందఱ నర విందబృందతుందిల మకరంద కణాసార సంభూత సౌరభోద్వేలం బును తాలహింతాల తమాల రసాలసాల తిలక తిందుక ఘనసార ఖర్జూర జంబీర కర్పూర కదళికా కదంబకుంద చందన మందార పున్నాగ పూగ నాగకేసర సరళ మన్మథ మధూక పనస పాటల పారిభద్ర బిల్లు బిల్వాది సలలితోద్యానవనవిశాలంబును నుత్ఫుల్ల హల్లక కుముద కువలయ వలయవీథికాసంచరన్మధుకర మధుకరీ ఝుంకారానుకారి ఘుమఘుమారావ తుములకల్లోలమాలికా కేళికాలోల మరాళ గరుత్పటలజానిలోద్ధూత శీకర శరాసారస్థగిత

1. కదులన్. తా. 2. అలమున. తా. అలయమున. పూ. ము. 3. నామతి. పూ. ము. తా.

మార్తాండమండల ప్రభాజాలంబును ద్రవిడవిలాసినీకుచ లికుచద్వయ న్యస్త నిస్తులనవహారిద్రాలేపనవిభాజనిత చంచత్కాంచన కంచుక భ్రమాలవాలంబును సంత తాంచితారామసీమాంత రోద్దామ మాధవీ మాలతీ మల్లికా మతల్లికా కుసుమ విసర కేసరోజ్జ్వలపార్శ్వ తలోత్తాలంబును నగు స్వామిపుష్కరిణి కూలంబున నిలిచి సౌగంధిక బంధుర సుగంధగంధిలంబులగు తత్కబంధంబులఁ గృతావగాహనులై కాల్యకరణీయంబులు నిర్వర్తించి కాంచన శైలశంకాకారి ప్రాకారంబగు తత్ప్రాకారంబుఁ జేరంజని. 173

సీ. భేరీ మృదంగ గంభీర రావాటోప
వారిత వారిధివారి రవము
అవిరళధూప ధూమాంబుదాలోక
తాండవితాహిభుఙ్మండలంబు
కేతు పటాంచల కింకిణీ కలకలా
కులిత భాను శతాంగ ఘోటకంబు
ప్రాకారమణివిభాపటల సిందూరిత
కకుబంత దంతీంద్ర గండతలము
ననుదిన నటన్నటీపాద హంసక [1]స్వ
నాకులిత బలి[2]కాంతా సమాగతాంబు
జాత సంభవ హంసకంబై తనర్చు
నిందిరాజాని కాంచన మందిరంబు. 174

వ. ప్రవేశించి తత్పురోభాగంబున. 175

సీ. పొడుపుగుబ్బలి మీదఁ బొడుచు భానుని లీలఁ
గల కిరీటము తలఁగలుగు వాని
నలచందురుని వెన్నుఁజఱచు నెన్నుదిటిపై
ముత్యాల తిరుమణి మురువు వాని
మొసలివా మించుల మిసమిసల్ దీపించు
నొసపరి కుండలయుగము వాని
సెలవుల తుదికెక్కు చిఱునవ్వు డాల్ సెక్కు

1. త్వ. తా. 2. కాంత పూ. ము.

తళుకు లేఁజెక్కు-ల కులుకు వాని
కలువ తామర కొలముల వలవఁ జేయు
చూపులను చలి వేడియు జూపువాని
విమల లావణ్యజలనిధి వేల బోడము
పగడ మననొప్పు వాతెర సొగసు వాని. 176

సీ. కరశంఖమునకు నేక [1] గ్రీవమును లేవ
గల గ్రీవ[2] చెలువునఁ జెలఁగువాని
తనువెత్తు కీర్తి ప్రతాపంబులన మించు
కరగత శంఖచక్రములవాని
నాకల్పఫలమిచ్చు నా కల్పశాఖల
దాయాదులౌ కేలుదోయివాని
నలకనిర్జితభృంగయౌ నలమేల్మంగ
కిరవైన పచ్చని యురమువాని
కోరి యిరుదుగ మొగముల కుట్టి గన్న
యమ్మ [3] నాఁజను పొక్కిటి తమ్మివాని
ఘోర దానవ విపిన కుతారమైన
బలు కటారంబు కటి తటి గలుగువాని. 177

సీ బంగారు వ్రాత చేరంగుల రంగారు
పట్టు దుప్పటి కటిఁ గట్టు వాని
పద్మ పద్మప్రభాస్పద పాద వేదమం
జీరమ్ములను విలసిల్లు వాని
నతుల చిరత్నరత్నాంశుజాలముల మిం
చుల[4] మించు భూషల నలరు వాని
శృంగార రసరుచిశ్రీలకు నెలవైన
మెఱుఁగు చామనచాయ మేనివాని
సర్వ గీర్వాణ సముదయ సార్వభౌమ
[5] బిరుదకలనాతివిఖ్యాతి వెలయువాని

1. గ్రీవమును. తా. 2. చెలువుల. తా. 3. దానకు. తా. 4. మించుల. తా. 5. భిరుదుగల నాతి. తా.

శుభగుణావాలు నిర్జరస్తుతి విశాలు
వితత కరుణాని [1]ధీశు శ్రీవేంకటేశు. 178

సీ. మొల[2]కటారపుఁ జెక్కుగలవాని గలవాని
నెనరువానిఁ బొగడదనరువాని
దయతోడ [3]కూడి చేతనవాని తనవాని
తనయంతవానిగా నునుచు వాని
†[4]పదములు బొదలు నాపగ వాని పగవాని
పగవాని బురుకను బిఱుదు వాని
నెమ్మోము నగవువెన్నెలవాని [5]నెల వాని
చెలి కన్నుదోయిగాఁ జెలగు వాని
నంబుదపు డంబుమీఱు గాత్రంబువాని
కొండనని కోర్కెకొండను కొండవాని
నిలువుగల పైఁడిచెలువుల వలువవాని
మేలుసమకూర్చు నలమేలు మేలువాని. 179

సీ. తల నిల్లుగట్టు వ్రతంబుల రాయని
తోమని పళ్యాల నేమగాని
[6]చేరుడుబియ్యాల యోరెముల్ దినువాని
కోణంగి సేవల నాణెగాని
కానుకలకు వడ్డికాసులు గొను[7]వాని
ముక్కోటి తీర్థపు టెక్కులాని
అడుగడ్డునకు మ్రొక్కు[8]లందుకోనెడువాని
కూఁకటి మాడల గుత్తవాని

శుక్రవారపు సేవల సొగసువాని
మానినుల గోరి వలపించు మాయలాని
తిండిమెండయగారిని [9]దిగళగురుని
కాంచి సేవించి సంతోషకలితులగుచు. 180

1. ధేశు. తా. వేశు. పూ. ము. 2. కటారువు. 3. కూడు. తా. పూ. ము. †పదముల....గాత్రంబువాని. ఈ భాగము పూర్వముద్రణమున లేదు. 4. పదములు తా. 5. నల. తా. 6. వేరెడు. తా. 7. రేని. తా. ఱేని. పూ. ము. 8. లందెడి దేవుని. పూ. ము. తా. 9. తిగళుగురుని. తా.

సీ. అభివాదనము వృషభాఖ్యమహాహార్య
[1] దివ్యకూటాగ్రవాస్తవ్యునకును
దండంబు గరుడాభిధానశైలమణీవి
భాసమానామానభవనభర్త
కంజలి శేషనామాధికధరణీధ
రాధిత్యకాగృహామేధిమణికి
వినతి శ్రీవేంకటవిఖ్యాతనామధే
యాచలహేమగేహాకులపతికి
చిన్నిపూ వంజనాద్రిప్రసిద్ధనిధికి
శరణు గుహాసరసీకేళిసక్తమతికి
మోడ్పుగేలు త్రిమూర్తుల మొదలిదొరకు
వెండియు జోహారు వినతవేదండునకును, 181

సీ. సర్వేశ ! సర్వాత్మ ! సర్వగుణాతీత !
సర్వజనావన సదయహృదయ !
గోపాల గోపాలగోపనధారేయ !
గోగోపగోపికా భాగధేయ !
వారణదైన్యనివారణ ! వారణ
శిక్షణదక్షిణ సింహశౌర్య !
శేషాచలేశ ! యశేషలోకనివేశ !
శేషశరీర విశేషతల్ప !
నీలనీరదనీల వినీలగాత్ర !
తీర్థతీర్థ మహాతీర్థ తీర్థపాద !
నందనందన ! సనకసనందననుత !
శరణు శరణయ్య శరణార్థిశరణచరణ. 182

మ. సవరత్నాంచన సామగేయపద [2] భాస్వత్పీతకౌశేయరూ
పవరేణ్యా సుచరిత్ర సూరిజనభావ్యా సేవనాసక్తవా
సవముఖ్యామరసైంధవవత్పృతగరాజా సోమవాణీశసం
స్తవ సౌమ్యాత్మక సంగదూరతర సర్వప్రాణిసంరక్షకా. 183

1. నవ్య పూ. ము తా. 2. భాస్వద్వీపశీతేశ రూ. తా.

సీ. భువనముల్ పుట్టింప పోషింప నణగింప
కర్తయైన ప్రధానమూర్తి వీవ
మస్తకముఖ్యసమస్తాంగ బహుళత
లక్షింపఁ దగు జగత్సాక్షి వీవ
కొలుచువారలకును గోరికల్దయసేసి
రాజిల్లు వేల్పుల రాజ వీవ
అజుఁడు రుద్రుఁడు నింద్రుఁడాదియౌ దేవతల్
నిజ మెఱుంగని బోధనిధివి నీవ
తలఁపుపండని తాపసావలికిఁ జూడ
నలవిగానట్టి [1] బ్రహ్మపదార్థమీవ
శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గ చాప
భూరి విస్ఫూర్తి కీర్తిత భుజుఁడ వీవ. 184

క విబుధులకు విబుధభూజము
విబుధారిసమూహములకు విషభూజమునై
[2]యబలులకెల్లను బలమై
ప్రబలు మహామహుఁడవీవ పంకజనాభా! 185

సీ. తులసిరేకులనైన దూర్వలనైన [3]ను
జలములనైన కంజములనైన
పూని [4]నిన్నీశ్వరుఁ బూజించు నామహా
మహులకు జేకూరు నిహ పరములు
నీ మహామహిమము నెఱిఁగినవారలు
[5]ధన్యులై వర్తింత్రు ధరణియందు
కంజాసనాదులు గనలేని వేదమం
జీరుని నిన్ను వీక్షింపఁగలిగె
గాన భవవార్థి దాటఁగాఁగంటి మభవ
మా భవములెల్లక్షనీడేరె మా జపంబు

1. బ్రహ్మదేదీయునీవ. తా. బ్రహ్మంబు వెలయనీవ. పూ. ము. 2. యబలల. తా. 3. ను. జ్వలజలజాతబిల్వములనైన. పూ. ము. 4. విఘ్నేశ్వరుఁ బూజింతురా. తా. పూ. ము. 5. నే ధన్యులైన తారెత్తగలరె తా. పూ. ము.

లలరె మా ముఖముల ఫలములు ఫలించె
[1]వినుతతారాచలాధీశ ! వేంకటేశ ! 186

క. అనుచుం గొనియాడి పునః
పునరాచరిత [2]ప్రణామముల నెంతయు నిం
పొనరించుచుఁ దదనుగ్రహ
వనితామోదానుభావపరవశులగుచున్. 187

వ. ఎట్టకేలకుఁ దన్మందిరంబు వెలువడి యాగట్టుఁజేనిం గనుంగొని. 188

గీ. భానుకోటిప్రభల దీలువలుచు తలుచు
జేగురులుగల శిఖరముల్ చెంతనున్న
యంబరంబును కాయమానంబు దాల్చు
మణిమయ స్తంభములుపోలె మలయు నిచట. 189

గీ. ఇన్నగము మిన్ను మోచినశృంగములు ఫ
ణాసహస్రముకరణిఁగన్పట్ట ధాతు
రాగయుత తారకలు త దగ్ర[3]మణులౌచుఁ
దనరఁ దన శేష సంజ్ఞ సార్థముగ్గఁ దెలుపు. 190

గీ. కుసుమ కోరక రాజి నింపెసఁగు భూజ
శాఖ లలలారు మిగుల నీ శైలభర్త
కదిసియుండెను గగనంబు [4]కడకు నెత్తఁ
బూను మౌక్తికభూషణభుజములట్లు. 191

గీ. అచల మిది ముక్తిసతిచేతి యలరు జంతి
పావ కదళుల నిలఁగూల్చు భద్రదంతి
యీప్సితార్థ రసమ్ములనీను సురభి
సంయమీంద్రకులా[5]వనీజాతసురభి. 192

క. ఈ శైలవిభవం బీ
దేశికసౌభాగ్య మీసుతీర్థ మహత్త్వం

---

1. వినత. తా. 2. ప్రమాణమము. తా. 3. రమణులయిన యితన తన శేషసంజ్ఞ సార్థములు. తా. రమణులయి. పూ. ము. 4. కడకు. తా. కడను. పూ. ము. 5. వన. పూ. ము.

శ్రీశౌరికరుణ గురు వా
గీశ ఫణీశులకు నైన నెన్నం దరమే ? 193

ఉ. ఏమితపంబొనర్చితిమొ యేసుకృతంబొనరించినామొ యే
నోములునోచినారమొ మనోరథముల్ మది దైలువారఁగాఁ
గామిత దానపాటవముఁ గల్గినతండ్రిని వేంకటాచల
స్వామినిఁ జూడఁగంటిమి శుభమ్ములుగూడ నఘమ్ము లూడఁగన్. 194

సీ. అనుచు లోననుచుమహానురాగమ్మున
[1]దనిసిపల్కుచు గిరీంద్రమ్ము డిగ్గి
తద్దక్షిణమున విధాత కమండలు
నాళంబు వెడలు స్వర్ణది తెఱంగు
భూరి[2]తటోద్గతిఁ బొలుపొంది యఘహార
వారియౌ నయ్యాళువారి తీర్థ
మటఁగాంచి స్నానములాడి కౌశికదిక్త
టాంచల వసదనలాఘుఁ గొలిచి
భక్తి గోవిందరాజులఁ బ్రణుతిఁ దేల్చి
యా యచలసార్వభౌమునిఁ బాయలేకఁ
బెనఁగునాలోకనముల నొయ్యన మఱల్చి
మినుకుటందియదోయిసామినిఁ దలఁపుచు. 195

గీ. నారికేళ రసాల జంబీర పనస
మన్మథ మధూక సాల రంభా వనములఁ
గనకకాంతులఁబర్వెడు కలమ సస్య
ములనుఁ బొలుపొందు జనపదమ్ములను దాటి. 196

సీ. శ్రీకరానేక రత్నాకర ప్రాకార
గోపుర ప్రాసాద దీపితంబు
సౌధాగ్ర సంచర జ్జలజముఖీ ముఖ
మణిదర్పణిత చంద్రమండలంబు

1. దనరి. పూ. ము. 2. తమోద్గతి. పూ. ము.

కనక నికేతనాకలిత కేతన[1]పటీ
పల్లవాంకిత దిశాపతి పురంబు
ప్రతిమందిరాళిందభాగ ముక్తాఫల
రంగవల్లీ విభారాజితంబు
నీలమణిజాల కిలితోన్మీల దభ్ర
చుంబి హర్మ్య కదంబ నీలాంబుద భ్ర
మాప్రదాలోక నర్తితామర వనాహి
భుగ్వితానంబు కాంచికాపురవరంబు. 197

క కనుపట్టుటయుఁ దదాలో
కన[2]పరయగు నిజవధూటి కాంతు యెఱిగి య
వ్వనితామణికి వసిష్ఠుం
డనియెన్ మందస్మితాననాబ్జుండగుచున్. 198

క. ఈపురము ధారుణీమణి
నూపురము సమస్తజనమనోరథసిద్ధి
శ్రీపురము గోపురస్థిత
గోపురము వినీలకుటిలకుంతల కంజే! 199

ఉ. నీలలుదేరు గారుడమణీగణ కుట్టిమసీమ [3]నాథులం
గూడి చరించు పట్టణముకొమ్మలు తత్ప్రతిబింబితాంబర
క్రీడదమర్త్యరాజనగరీసురజంపతిరూపురేఖ తే
జోడని సారె గీలి గొనఁజూతురు సౌధవిహారవేళలన్. 200

శా. రాకారాత్రుల చంద్రకాంతరచితప్రాకారవారంబులు
ల్లోకప్రక్రియలం గరంగఁగఁ బ్రణాళుల్ నిండి యశ్రాంతధా
రాకారంబున[4]బారునీరు రతినాథాటోపసస్యావన
శ్రీకిం జంద్రు డొనర్చు కాల్వలన వర్తించున్ పురీవీథులన్. 201

ఉ సారసలోచనల్ నగరసౌధవిధూపలవేదులందు సం
చారము సేయుచున్ నికట సౌరధునీ కనదంబుజంబు లెం

1. పటా. పూ. ము. 2. వర. తా. 3. ధాతులం. తా. 4. జారు తా.

తే రతిఁ గోయఁ బో నచట ద్రిమ్మరు తేంట్లు ముఖారవిందముల్
జేర వెఱం దొరంగుదురు చెంతల కాంతలు గేలి సేయఁ గన్. 202

శా. శ్రీకల్యాణ మహోత్సవాచరిత ధాత్రీ[1]వేదినిక్షిప్త దీ
ప్తాకా[2]రోన్నత కాయమాన భవనవ్యాపారపారీణతా
స్తోక స్తంభమతిప్రదాత్మసకలస్తోతవ్య మాణిక్యసౌ
ధాకారాంచిత మీ పురంబు నుతిసేయన్ శక్యమే యేరికిన్. 203

మ. పురి యభ్రంకషసౌధపంక్తి గని వేల్పుందంతి శైలాళియం
చు రహిం గొమ్ములఁ ద్రవ్వి యాడుటకు నచ్చోఁ జేరి యందుగ్రవై
ఖరిఁ గన్పట్టెడు కృత్రిమేభరిపు[3]సంఘంబున్ నిరీక్షించి వే
వెఱఁ బాఱున్ వెలవెల్లనై యనిమిషుల్ నిర్విణ్ణులై చూడఁగన్. 204

గీ. పురము మేడలనుండి యంభోజముఖులు
కమ్మకస్తురి వేలుఁపు[4]గొమ్మమూక
కర్పణముసేసి వారిచే నందికొంద్రు
[5]ననుపుఁదావుల హరిచందనద్రవంబు. 205

మ. వలభీంద్రోపలఖండదీధితుల శేవల్ కంఠహాలాహలం
బులు సున్నంబు విభూతి వెల్లపడగల్ మూర్ధస్థితస్వర్ధునీ
జలపూరంబులు లోనఁ గ్రుమ్మరుసతుల్ సాంబాలు మైగొన్న యా
యలరుంబోడుల యొప్పునై తగుఁ బురిన్ హర్మ్యేశ్వరశ్రేణికిన్. 206

క. ప్రాకారమగుట నున్నతిఁ
గైకొని సాలంబుగానఁ గడుకొమ్మలచే
జోకై యట కోటతగున్
పాకారిశిలావిలాస భాసురమగుచున్. 207

మ. ఘనగంభీరతరాంబుసంగతి పొసంగం బొల్చు ఖేయంబు నం
బునిధిం[6]బోలుననంగరాదె యచటన్ మోదంబు సంకిల్లఁగా

---

1. వేద. తా. 2. కోన్నత. తా. 3. సంఘంబుల్ నిరీక్షింప. తా. సంఘంబుల్ నిరీక్షించి పెన్వెఱ. పూ. ము. 4. బొమ్మ. తా. 5. ననుప. తా. 6. బోల్చు తా. పూ. ము. తా.

ననయంబున్ బవళించియుండు నల దైత్యారాతి తన్నాభికా
వనజాతంబుగతిన్ మణీవరడ భావంబిందు నింపొందఁగన్. 208

క. తిరుగున్ సురాలయమ్మున
బరగున్ తత్సేవ శుక్రపరిభావమునన్
జరియించునంచు గురునిన్
నిరసింతురు విప్రులిచట నీరజనయనా! 209

సీ. గురుతరార్యామోదకర నిరూఢి వహించి
నిరత శౌర్యాసంగగరిమఁ గాంచి
ధర్మరక్షణకళాదర సమున్నతిఁ జెంది
దినదినాభ్యుదయ వర్తనల నొంది
దీర్ఘ నానా సద్యుతిప్రచారత మించి
ద్విజరాజ పోషణాదృతిఁ జరించి
అతిదుర్నిరీక్ష్య భాసిత తేజమునఁ బొల్చి
పంక్తిప్రభంజన ప్రతిభఁదాల్చి
రాజనమ్మునమీటి విభ్రాజమాన
కరసముద్దండ మండలాగ్రప్రభిన్న
పరతమస్తోములగుచు నిప్పట్టణమునఁ
దనరుదురు వేడ్క రాజమార్తాండులబల! 210

చ. అనవరతంబు నెచ్చెలి దిగంబరియై బికిరంబు లెత్తఁ దా
ధనదుఁడనంచు నెక్కనొకతట్టువయైననులేక మానిసిం
బనిఁగొనె కల్మికల్మికిదిమార్గముగాదని యెంచి మించి కై
కొనరు కుబేరు మేటి ధనకోటిని మీటగు [1]పీటి కోమటుల్. 211

గీ. శ్రీకరవ్యాప్తి నుద్యత్ప్రసిద్ధిఁ గాంచి
విబుధలోకైక సేవాభివృద్ధి మించి
పుట్టినిల్లైన హరిపదాంబుజము వోలి
సొంపు వహియించు నిప్పోటి శూద్రకులము. 212

---

1. నట్టి. పూ.ము.

చ. హరిపదసేవఁ జెంది విబుధాశ్రయ విశ్రుత జీవనస్థితిన్
దిరమయి నిర్మలాశయ మనిందతమై తనరార సత్కవీ
శ్వరనుతమైనవాహిని యజస్రము లోకములెల్ల నిండ సో
దరియగు గంగతో దొరయు [1]తా పురి నాలవజాతి యెంతయున్ 213

క. ఒదుగుచు [2]నొక్కొక మూలను
జదికిలఁబడి కదలమెదలఁజాలవు తామే
మదకరులని దిక్కరులన్
మదిరోయుఁ బురంబులోవి మదనాగంబుల్. 214

మ. అరుదా భారవహంపుజీవనము నాహోయంచు నిట్లున్నది
క్కరులంచున్ గిరులెంచునంచు బుధలోకంబంచు నూహించ ను
ద్ధురతన్ భూమిఁ బెకల్చి తాల్చుటకు నుద్యోగించు చందంబునన్
దరులొక్కుమ్మడిఁ గ్రుమ్మఁ [3]గొమ్ములను మాద్యద్దంతి సంతానముల్.

సీ. అహిభయాపాదకంబై నిజేచ్ఛఁ జరించు
నంబుజోదరు తురగంబుఁ దెగడి
అలఘుపదక్రమములమీఱి తనరారు
కందర్పహరు ఘోటకముల నవ్వి
మొనసిన పరపక్షులల[4]ను చేరివర్తిల్లు
నలినజు కంఖాణముల హసించి
ఆశుగప్రతతిరా నళికి దిక్కులఁబాఱు
నమరవల్లభు వాహనముల గేరి
తనరు నవిశంబు సాదిచేతః ప్రమోద
కర నిరాఘాట వేగబంధుర విశిష్ట
గుణగణభ్రాజితోద్దండ రణనిరంకు
శమ్ములై యొప్పు నిప్పోటి సైంధవములు. 216

సీ. ఘణిఘణిల్లని పాద కటక నిక్వణనముల్
వ్రతుల ధైర్యము వకావక లొనర్చ

1. నీపురి. పూ. ము. తా. 2. నొక్కొక్కమూలల. తా. నొక్కటమూలల. పూ. ము. 3. తత్పురి సముద్యద్దంతి. తా. 4. నె. తా.

పైపైఁ గుబాళించు మైపూఁత ఘుగఘుగల్
పల్లవాళికి మరుల్ [1]బలిమి గూర్ప
ఇంచువిల్తుని నీసడించు వీక్షణ రుచుల్
ప్రజల పాయఁగ బరాబరు లొనర్ప
కావిచక్కెర మోవి కమ్మకస్తురితావి
యువజనమ్ములకు నోరూరఁజేయ
దండలు వహింప విటులకై దండ లూని
సమదగతి పెంపు మందహాసముల సొంపు
వెలయ విహరించు నివ్వీట లలిత రూప
భాజనమ్మగు వారనారీజనంబు. 217

సీ. కరుడుబారెడు వీటికారసమ్ముల కావి
మోవికాటులకు మేల్ముసుఁగులొసఁగ
మినుకుగుబ్బలనింపుమీఱు క్రొన్నెలబారు
చిటులుగందము నిండుసిగ్గునిలుప
తెలిగన్నుదమ్ముల దేరు నిద్దురమంపు
[2]నడరు నెమ్మది భయంబావరింప
పతుల ప్రేముడి జూడ బదఘు వెల్వెలబాటు
తెచ్చుకోలగు తెల్వి తెరయొనర్ప
మగలకునుమాటి మదిలేని మరులుచాటి
మగువకవగూడు నొకపాటి మరుని ధాటి
వెరపువోమీటి వేగుచో వీటి మేటి
జారిణీకోటి చతురతాస్వర్ణపేటి 218

ఉ. తేలెడికన్నులన్నిదురదేల బుగుల్కొనుతావిపూలకై
వ్రాలిన కొప్పులంసములవ్రాలఁ జనుంగవ భారకంబునం
దూలు వలగ్నముల్ బెళుకు తూలకణమ్ములఁబోల నీవి కెం
గేలికిఁ[3]దార్చి [4]వెళ్ళుదురు కేళిగృహంబులు వారకామినుల్. 219

1. బవిలి దీర్ప. తా. బలిమిఁ జేర్ప. పూ. ము. 2. నడగు. తా. నడ నెరద భయ మావరింప. పూ. ము. 3. వార్చి. తా. 4. వెల్వడిరి. తా. పూ. ము.

క. సంతానధరిత్రీరుహ
సంతాన[1]సమూహవనీజ సంతానవరా
క్రాంత వసంతవిలాసా
క్రాంతములై యుపవనములు రాజిలు మిగులన్. 220

లయగ్రాహి. ఇప్పురము నందునికి నెప్పుడును [2]తెమ్మెరలు
విప్పుగల తోపులను గప్పురపుటంటుల్
తెప్పలుగఁ గూర్చు తెలికప్పురఁపు వాసనలఁ
దప్పక హరించి యల చొప్పణఁచ వేడ్కల్
గిప్ప రతి దేలి శ్రమమప్పుడు వహించి నెఱిఁ
దప్పు సుమగంధులకు నప్పరిమళంబుల్
దెప్పరము గా[3]నొసఁగి చిప్పిలుచు వారి మెయి
నొప్పు పెరతావి ప్రియమప్పతిలఁ [4]బూనున్. 221

సీ. ఈవిరుల్ వెతకి యి మ్మొలనాగ కలయంగ
నీవిరుల్ వెదకిన నిపుడుగలవె
యీసరుల్ బూనిననింత వింతయియుండు
నీసరుల్ దెలుపంగ యెలమి గలదె
యీవిరవాదుల కేపుజూపెద వేలె
* * *
* * *
* * *
†ననుచు కందువ మాటల నొనర నిటుల
విటుల ఒటులప్రవీణత వెలయఁ బలికి
కీవులలరంగ తావుల తావులైన
పూవు లమ్ముదు [5]రిప్పీట పువ్వుబోండ్లు. 222

---

1. సమూహాభూజ. పూ. ము. 2. తుమ్మెదలు. పూ. ము. తా. 3. నెసఁగి పూ. ము. 4. బూనన్. పూ. ము. తా. 5. రిమ్ముగ. † యీ యలరులకొమ్మ యేలవచ్చు ఇది యెత్తుగీతి పై పాదముగాపూర్వముద్రణమున కలదు. తాళపత్రమునను కలదు.

చ అలరుల తోటలన్ మణికృతాచలకాంచనసౌధవాటులన్
జిలుకల మాటలన్ రసముజిల్కెడు చెల్వల యాటపాటలన్
గోకుల తేటలన్ గళలు గుల్కు చతుర్విధగేహకోటులన్
గలిమిపొలంతి కీపురము కాపురమై విలసిల్లు నిచ్చలున్. 223

క. కాంతలు నవ రతికాంతలు
కాంతలునరసీజ[1]కాంతకాంతలు లీలా
కాంతలు కళాతికాంతలు
కాంతా! కనుఁగొంటె నేఁడు కనుపండువుగన్. 224

క. అనిపల్కి వసిష్ఠమహా
ముని తక్కిన యార్వురును బ్రమోదంబొదవన్
గను గొని పురవిభవంబున్
వినుతించి రుదంచితాతివిస్ఫుటవణితిన్. 225

క. అంత ననంతానన్తా
నంతఫలశ్రీలఁ జూచినంత నొసఁగు న
[2]త్యంతము నరులకు నట్టియ
నంత సరోవారి తీర్థమాడి మునీంద్రుల్. 226

ఉ. నిక్కఁపుభక్తి నెక్కొనిననెమ్మది సమ్మదమెక్కఁ జొక్కుచున్
దక్కిన నైదు తీర్థములఁ దానములాడి ముకుందుఁ బాడి యా
చక్కి బడేడు రూపముల సాముఁకుం బ్రణమిల్లి కోరికల్
రక్కొనఁజేయు శ్రీవరదరాజులఁ గొల్వగఁ జేరి చేరువన్. 227

గీ. వేగవత్యుత్తరతటాగ్రభాగ గణ్య
పుణ్యకోటి విమానవిస్ఫుట విధాతృ
యజ్ఞవేదిఁ బ్రసన్నుడై హస్తిశైల
మున వపాగంధముఖతచేఁ దనరు వాని. 228

సీ తత శంఖ చక్ర గదా వరదానాభి
నయశోభి భుజచతుష్టయమువాని

1. శాంత. పూ. ము. తా. 2. భ్రాంతము. పూ. ము. తా.

కరుణారసోదీర్ణ కర్ణాంత విశ్రాంత
రవిచంద్ర[1]రూప నేత్రములవాని
చరణసేవక జలాదర విభావక వికస్వర విభాస్వర ముఖాబ్జంబువాని
అసమాన శృంగారరసమాన కౌస్తుభ
లసమాన వక్షస్థలంబువాని
[2]తరణిబింబభ్రమానువిధాయి నూత్న
రత్న[3]మకుటాభిరమ్య శిరంబువాని
దేవతాచక్రవర్తిని దివ్యమూర్తిఁ
గాంచి సేవించి యప్పౌరి[4]కాంతవరులు. 229

క. రాజిల్లుచున్న యప్పుర
రాజము వెల్వడుచు ముందరం జనిచని భూ
యోజనయోగమ్మున ము
య్యోజనములుగడువ నచట నూర్జితమహిమన్. 230

సీ. పనస నింబ కదంబ పాటలీ ఘనసార
సహకార ఖర్జూర మహిరుహముల
కుంద మందారాబ్జ కుంజర మాలతీ
మల్లికావల్లీ మతల్లికలను
సర్వర్తు గుణయోగ సంతత ప్రస్రవ
త్ఫలరస మకరందజల ఝురముల
సహకార పల్లవాస్వాద కషాయిత
కంఠ కోకిలకుహూకారములను
విగతవైర పరస్పర విహరమాణ
హరి కరి వ్యాఘ్ర [5]గో బిడాలాఖు శిఖి భు
జంగమ ప్రముఖానేక జంతుసమితి
[6]చే నిరంతర పరిపూర్ణమైన దాని. 231

1. రూఢ. పూ. ము. 2. తరుణి. తా. 3. మకుటి. తా. 4. కాంత. తా.
5. మృగ. తా. 6. శనినిరంతర. తా. తో. నిరంతర. పూ. ము.

మహాస్రగ్ధర. ఘటికామాత్రోపసేవాకలన
జనులకుం గాంతితార్థంబు లిందే
ఘటియించున్ ప్రాగ్భవీయోత్కట
కుటిల మహాకల్మషంబుల్దొలంగున్
స్ఫుటరీతిన్ దీనిభాతిన్
బొలుచు నెమటియీభూమి నెందేనియుంచు
త్కట[1]రీతిన్ దెల్పు జాడంబగు
శిఖరవముల్ గల్గి రాజిల్లుదానిన్. 232

క. మృగపతులొంటను [2]నౌరయన్
బగలు నిసర్గజములై నపగ లెఱుఁగకయే
మృగములఁ బరిపాలింపుచు
నెగడెడు సింగములగముల నెరవగు దానిన్. 233

సీ. నెత్తంపు రతనాల నిగ్గు లగ్గలికల
జాళువా గుబ్బలిఁ బోలుదాని
హరిపద సంభూత సరిదంబు సంగతి
నాకలోకప్రౌఢి నవ్వుదాని
అమిత ధాతుప్రత్యయాగ[3]మానితమౌట
శబ్దశాస్త్ర ప్రతిచ్ఛాయదాని
సరముల సతతప్రసర దూర్మికా కంక
ణాసక్తి నృపలీల నమరుదాని
కలిత భృగు జటి శాండిల్య గాలవాది
యుక్తి ఋష్యాశ్రమమువలెనుండుదాని
తృప్త మృగ పతి సంఘాత [4]దీర్ఘ ఘోష
ణ ప్రవర్తన వనరీతి నగెడుదాని. 234

గీ. ప్రాంశు శిఖర మయూర[5]దృక్ స్రంసమాన
భుజగ పాశంబు లరుణుండు పొసఁగఁ గూర్చ

1. కీర్తిం. పూ ము. 2. మెరయున్. పూ. ము. 3. మాన్విత. తా.
4. దీర. తా. 5. దృత్సంసమాన. తా.

నర్కరథమున కొనర మధ్యాహ్న వేళ
గతి విలంబంబు గావించు కరణిదాని. 235

సీ. నెత్తంబులందు మానికముల కలిమిచే
మేరు[1]మహీధ్రమ్ము దూరుచేసి
రహిమించు పటికంపు రాగుంపు సొంపున
కైలాసకుధరమ్ము కాకుచేసి
నెలరాతి[2]చాలుపు వలి[3]నీటిజాలున
హిమవన్నగేంద్రమ్ము నీసడించి
సిగరమ్ములను నిగనిగబంగరువునను
హేమకూటనగంబు నెగ్గులెన్ని
సురభి[4]చందనశాఖి సంశోభి యగుట
మలయధరణిధరేంద్రమ్ముఁ జులకఁ జేసి
బహుతరంబైన చామరప్రతతి కలిమి
నొలసి నగరాజ భావమ్ముఁ దెలుపుదాని. 236

క. [5]పటికాక్షసరముఁ జేకొని
ఘటికామాత్రము జపింప ఘనమగు సిద్ధుల్
ఘటియింపఁజేయు దానిన్
[6]ఘటికాద్రిని నచలభక్తిఁ గనుగొని యచటన్. 237

మ. ఫలతీర్థాహ్వయ తత్సరోవరతటప్రాంతంబునన్నిల్చి ని
శ్చలవృత్తిం దపమాచరించుమునులన్ సాధుక్రియంగాంచి వా
రలు దర్భాసన వంద నార్చన లొనర్పన్ బ్రేమఁగైకొంచు న
జ్జ్వలవాక్ప్రౌఢిమఁ బల్కిరిట్టులని వాత్సల్యంబు దీపింపగన్ 238

చ. అనిశము నర్థకామములయందు విరక్తతఁదెల్పెడున్ భవ
ద్ఘనతరచిత్తశాంతి మరిధర్మముమీరెటనుందురందు మీ
మనముననుండు మోక్షుదుఁడుమాధవు డింకఁ దపఃప్రవృత్తికై
మొనసినకోర్కి యేదిమది మోదముతో నది మాకుఁదెల్పుఁడా! 239

---

1. మహీంద్రమ్ము. తా. 2. చాలిపెన్. పూ. ము. తా. 3. నిండు. పూ. ము. 4. నందన పూ. ము. 5. స్ఫటికా. పూ. ము. 6. ఘటికాచలమచలభక్తి. పూ. ము. తా.

చ. అనవుడు వారలిట్టులనిరాదరమొప్ప మహర్షులార! మీ
రనినగతిం ద్రివర్గముల నాస యొకింతయులేదు ముక్తికై
వనజదళాక్షుగాంచుటకువాంఛితమొక్కఁడుదక్క దానిపై
ఘనతపమాచరించుటకు కారణమున్నది చిత్తగింపుడా! 240

సీ. [1]మునులార [2]దివిపైన మునుపందరమును మా
పతి [3]గుఱియించి తపంబు సల్ప
నాకాశభారతి యచటఁ బ్రసన్నయై
హితభాషణముల మాకిట్టులనియె
వినుఁడిందు మునులార! విష్ణుసాక్షాత్కార
మతిదుర్లభంబు ప్రయాససాధ్య
[4]మటుగాన యవనిపై ఘటికాచలముగల
దందు వే ప్రత్యక్షమగును శౌరి
కృతయుగమ్మున సప్తర్షు లతుల కీర్తు
లందుఁ దపమున హరిఁగాంతు రట్టియెడలఁ
గందురు ముకుందు నందుల కరుగుఁ డనిన
నాటగోలెను వచ్చియున్నార మిచట. 241

క. అన విని యా సప్తర్షులు
మనమున నశరీరవాణిమాటలవలనన్
వనజాక్షుఁ గనుట నిజమని
యనుపమసంతోషభరమునందుచు నచటన్. 242

* వ. ఫలతీర్థాహ్వాయ సరోవరవారిఁ గృతస్నానులయి నిత్యకృత్యంబు
లాచరించి. 243

శా. వారంతన్ ఘటికాచలేశ్వరు జగత్స్వామిన్ దయాసాగరం
ఖీరాకారు నుదారుని న్నిజమనఃపీఠంబునన్నిల్పిదు

1. మునులెల్ల. పూ.ము.తా. 2. దినిపై.పూ.ము. దివిపై. తా. 3. గురిచి. తా. 4. మట తా. * ఈ వచనము తాళపత్రప్రతిలో కొట్టివేయ బడియున్నది, మరియు నందు "నిత్యకృత్యంబులాచరించి" అన్నదిలేదు.

ర్వారంబౌ విషయైక[1]భోగనిరతస్వాంతంబు బంధించి తా
రారాధించిరి వేద[2]చోదితమనుధ్యానప్రకారంబునన్. 244

క. హరి సర్వజీవహృదయాం
తరగతి సర్వజ్ఞుఁడయ్యుఁ దన్మునిచిత్త
స్థిరతఁగనన్ క్రీడాత
త్పరుఁడై కించిద్విలంబపరుఁడై యుండన్. 245

ఉ. వారలు శౌరిఁగానమికి వందురుచున్ దురపిల్లి యక్కటా
శ్రీరమణీమనోహరుఁ డశేషజనావనతత్పరుండు మా
కోరికఁ యియ్యఁడయ్యె ప్రతికూలతఁ జెందె మదీయభాగ్యముల్
నారద వాయునందన సనందన ముఖ్యులఁ బోలమింతయున్. 246

చ. యమముఖ పూర్వయోగనిచయమ్మున సుస్థిరమేమహాత్మచి
త్త మతఁడుదక్క నన్యులకుఁదప్పఁదలంపు ప్రమాదయుక్తిఁదా
లిమివసలేమిఁ గష్టపడలేమి శుచిత్వములేమి మానస
భ్రమ నలసత్వసంగతి నభక్తి నశక్తిని నమ్మకుండుటన్. 247

క. అని యీగతి తమ యోగ
మ్మున కెడనెడ నంతరాయములు దెల్పుచు నం
త నితాంతనిశ్చలంబై
తనరు తపంబాచరింప తాత్పర్యమునన్. 248

వ. తదవసరమ్మునఁ బిచండిల మార్తాండ మండలాఖండదీప్తిచ్ఛటా నిరా
సక బ్రహ్మాండకటాహ [1]పాటన ప్రశస్త చిరత్నరత్నప్రభా భాసుర
కోటీరుండును, కోటీరమ్మద మదవిదారక పిశంగలోచన త్రితయాం
చల ప్రోచ్ఛలద్విస్ఫులింగసముదయుండును, సముదయత్ప్రభావిభా
సమానరత్న మంజీర కంకణ కేయూర హార కుండల ప్రముఖ
విభూషణవితానుండును, వితానధ్వంసరిరంసాక్షుద్ర వీరభద్రరౌద్ర
రసవిద్రావణ సమున్నిద్రకరాళ దంష్ట్రాయుగళుండును, గళవినిర్గత
కహకహాట్టహాసగర్జనగర్జారవప్రవిదారిత దానవహృదయవిసరుండును,

1. భోగి. తా. 2. మోదిత. పూ. ము. పాటవ, పూ. ము.

విసర త్కేసరజటాజాల పరికల్పిత నభోలక్ష్మీగృహావదనమాలికాలం కారుండును, లంకారమణకుమార భయంకర బిరుద హాటకకశిపు నిశాటవక్షఃకవాట పాటన[1]కుఠారకఠోరనఖర ప్రకరుండును, కరానీత దిక్కరీంద్రప్రయుక్తమందాకినీజలసారశీకరసమాప్లుత[2]విష్టపత్రయుండును, త్రయీవిభవస్థావర కేంద్రాగ్నివరుణవాయు మను ముని వసు పరమేష్ఠిహారుండును, హార[3]జహాతిఘరితోధి[4]ధాన ధానవక్షోభ కారిభుజాయుగళుండును, యుగపత్ప్రవృత్త విశ్వావసు తుంబురు నారద ప్రభృతి దివ్యగాయనగీత నిజనామాంకిత బిరుదావళ్యుదాహరణ మంగళాష్టక దండకాదిప్రబంధసంరంభుండును, రంభాద్యప్సరః ప్రపంచిత నృత్తసమానకాలీన పారిజాతప్రసూనవర్ష దివ్య దుందుభిధ్వానుండును నై శ్రీనరసింహదేవుండు ప్రత్యక్షుంబైన.

క. భయమును కంపంబును వి
స్మయమును సంభ్రమము చిత్తసమ్మోదము భ
క్తియు ముప్పిరిగొనఁ బ్రణతులు
నియతిం గావించు ఘటిత నిటలాంజలులై 250

వ, ఇట్లని స్తుతియించిరి. 251

సీ. సంత్యక్తమదమానజనతేష్టదానమం
దారకాయ! తమోవిదారకాయ!
ప్రాగ్భవార్జిత మహాపాతకాంబుధర ప్ర
భంజనాయ! సురారిభంజనాయ!
మఘవదాదిముఖాదిమకుటాగ్రరత్న నీ
రాజితాయ! దయావిరాజితాయ!
*భక్తభాషితరమాపతిసమస్తాత్మతో
ద్ధారకాయదరారి[5]ధారకాయ
ప్రణతిమభినుతిమహితార్చాం ప్రపత్తి
మంజలిం శరణాగతిం ప్రార్థనాంచ
తన్మహేకుర్మహేవిదధ్మఃసమర్ప
యామహేదధ్మయిమయేదయామహేచ. 252

1. కుఠారత్కఠోర. పూ. ము.తా. 2. విగ్రహాలుండును.తా. 3. జహీతి. తా. 4. దానవక్షోభటవిక్షోభకారి.తా. *ఈపంక్తి అర్థమువిచార్యము.5.దారకాయ.తా

దండకము : శ్రీనృసింహా సురారాత్యహంకారరంహా ప్రమత్తేభ
సింహా నిరంహాస్తమస్సాధు సంకీర్తితాహ్వా, ద్విజిహ్వాదిరాడ్భూ
షణా బ్రహ్మముఖ్యామరాధీశకోటీరకోటిస్ఫురద్రత్నకోటీవినూత్న
ప్రభా భాసమానాంఘ్రి రాజీవ రాజీవగర్భాండ భాండచ్ఛటా
సృష్టిరక్షావినాశక్రియాదక్ష దక్షాధ్వరధ్వంసిచేతః[1] ప్రమోదాతి
నిష్ణాతవేషా అశేషాజరానీకదుర్లోకదంష్ట్రాస్యజిహ్మ నఖాగ్రక్షుణ్ణోద
గ్రజాగ్రన్మహావిగ్రప్రగ్రహా గ్రాహరూపోగ్ర సంసారబంధచ్ఛి
దాచుంచుచంచల్లవిత్రా పవిత్రాకృతీ స్వామి నీదివ్యలీలా నికా
యంబు లాత్మన్వివేకింపగా నప్రమేయంబు లశ్రాంతయోగీంద్ర
హృద్గేయముల్ శక్రశంభుస్వయంభూమనోజ్ఞేయముల్ భవ్యదివ్యర్షి
వాగ్గేయముల్ క్షీరవారాశికన్యాజనుర్భాగధేయంబు అవ్వాని
నేమున్ నుతింపన్ ప్రవర్తింపు టోహో మహాసాహసిక్యంబు దేవో
త్తమా సోమకాఖ్యుండు దైతేయముఖ్యుండు వాణీవధూనాథు
వంచించి ప్రామిన్కు లెల్లఁ [2]బ్రమోషించి మున్నీటిపెన్నీటిలో
డాగ వానిఁ మహామత్స్యరూపంబునఁ బుట్టి వారాశిలోఁ బట్టి
పుచ్ఛంబునఁ గొట్టి యా వేదముల్ దెచ్చి యావేధకున్ బ్రీతితో
నిచ్చి హెచ్చుఁగటాక్షింపవా వైదికాచార మార్గంబు రక్షింపవా
దేవతల్ దేవతారుల్ సుధోత్పాదనార్థంబుగా మందరాగమ్మునన్
వారిరాశిఁ మథించంగ నప్పర్వతంబబ్ధిలో గ్రుంగినన్ దానిఁ
గూర్మావతారంబునుందాల్చి పైకెత్తవా కీర్తులన్ హత్తవా పాప
బుద్ధిన్ హిరణ్యాక్షు డిద్ధారుణిన్ జాపగాఁ జుట్టి పాతాళ లోకం
బునన్ బెట్ట దానిన్ వరాహావతారంబునన్ మీఱి దంష్ట్రాగ్రభాగంబుచే
నుబ్బగా నెత్తవా సర్వమున్ విష్ణుఁడేయంచు భాషించు ప్రహ్లా
దుపైఁ గిన్క వాటించి యిచ్చోట నీవాహరిం జూపుమంచున్ హిర
ణ్యాక్షు దైత్యానుజుండుక్కు కంబంబు దాచేతఁ దాటింప పాటించి
యందే నృసింహావతారంబునన్ బొల్చి ఘోరార్భటిన్ నిల్చి యాదై
త్యునిన్ ద్రుంచవా బాలు ప్రహ్లాదు రక్షించి విఖ్యాతిచే మించవా
వామనబ్రహ్మచర్యాకృతిన్ [3]బూని నీవా బలింజేరి యాదైత్యుచేఁ
గోరి పాదత్రయీమాత్రభూదానముం బట్టి త్రైవిక్ర మాకారముం
బూని మింటన్ ధరిత్రిన్ పదద్వంద్వమున్ నించి శిష్టైకపాదంబు
తన్మూర్ధభాగంబుపై నుంచి యద్దైత్యుఁ బాతాళముం జేర్పవా వజ్రికిన్
గోర్కె చేకూర్పవా తండ్రికిం గీడువాటించునక్కార్తవీర్యార్జునన్

1. ప్రమోషాతి. తా, 2. ప్రఘోషించి. తా. 3. మీరిచాతన్. తా.

జామదగ్న్యుండవై త్రుంచి శోధించి తద్రాజవంశావళిం గిన్కమున్యేడుమారుల్ కుఠారాగ్రహేతిన్ రణక్షోణిహింసించి తద్రక్తధారావళిన్ సప్తహ్రదంబుల్ ముదంబొప్పఁగావించి వాటన్ బితౄణంబొగిందీర్పవా [1]భూభరంబార్పవా పంక్తికంఠుం డకుంఠప్రతాపంబునన్ వాసవాద్యష్ట[2]దిక్పాలురన్ సిద్ధసాధ్యాప్సరోయక్షగంధర్వవిద్యాధరశ్రేణులం బట్టిబాధింప వానిన్ విదారింప ధాత్రిన్ దశస్యందనక్షోణిపాలాత్మజాతుండవై రామనామంబునం బుట్టి సీతాసతిం బెండ్లియై తండ్రియాజ్ఞప్తి నీరేడుసంవత్సరంబుల్ మహారణ్యవాసంబుగావించి సీతాపహారున్ మహావీరు లంకాపురీవాసు వీతాత్మసంత్రాసు లోకైకవిద్రావణున్ రావణున్ ఖండనక్షోణిలో ద్రుంచి సీతా సమేతంబుగా రాజ్యముం జెందవా సర్వలోకస్తుతుల్ బొందవా ధాత్రిఁగృష్ణాగ్రజాతుండవై [3]రోహిణేయుండవై బుట్టి లీలం బ్రలంబాదిదుష్టాసురశ్రేణి ఖండింపవా దిక్కులంగీర్తినిండింపవా త్రైపురేంద్రద్విషాయుర్వినాశార్థమై బుద్ధరూపంబునన్ దద్వధూశీలభంగంబు[4] భావింపవా మోహనానేకశాస్త్రప్రసంగంబుఁగావింపవా మీఁదటన్ గల్కిరూపంబునన్ మ్లేచ్ఛులన్ మట్టనున్నట్టి మీ దివ్యలీలల్ ప్రశంసింతు మీశా విధీశా చిత్తుద్రప్పాపమౌనీదు రూపంబుఁగన్గొంటి మస్మత్తపంబుల్ ఫలించెన్ నిరీశా రమాధీశ సర్వేశ్వరా నిర్వికల్పా నిరీహా పరానందసంవిత్స్వరూపా నృసింహా నమస్తే నమస్తే నమః. 258

## ఆశ్వాసాంతము

మ. సతతానేక విపశ్చిదీడిత కళాజాతాత్మ తామ్రాతుశో
భితదేహ శ్రమనంది తైకఖురళీభేతాళ [5]తాళోద్భట
స్తుతిపాత్రీకృతసార సారగుణయాదోరాశి [6]దోరాసితా
సితధారాసితమండనాగ్రనిహతాశేషాహి[7] రాణ్మండలా.

పంచచామరము.

మరాళరాజి రాజతక్షమాధరేంద్ర చంద్రికా
నరాళ గాంగ తుంగ భంగ నవ్య నవ్యయప్రభా

---

1. భూధరం. తా. 2. దిక్పాలకుల్. తా. 3. రామణేయుండవై. తా. 4. గాలింపవా. పూ. ము. 5. తాళధ్వట. తా. 6. దోరాశిరాశితధారాశిత. తా. 7. రాణ్మండలా. తా.

ధరా అసత్వ కారి కాంతి ధుర్య కీర్తి కీర్తి తా
కరాళ విద్విషన్నికాయగర్వ[1]శార్వ రారుణా.

*మాలిని. సరసగుణసమాజా! సన్మృగేంద్రస్ఫుటేజా
పరభటకృతపూజా! బంధుగీర్వాణభూజా!
తరుణతరణితేజా! ధారుణీరాజరాజా!
భరణసుకవిభోజా! భాగమాంబాతనూజా!

గద్య. ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధిక కృపాపరిపాక పరిచిత
సరస కవితాసనాథ తెనాలిరామకృష్ణకవినాథ ప్రణీతంబైన
ఘటికాచలమాహాత్మ్యం బను మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.



---

1. శర్వరారుణా తా. 2. మహాత్వంబను. తా.

* తాళపత్రప్రతియం దీపద్య మిచటలేదు. ప్రథమ తృతీయాశ్వాసాంతము లందున్నది; రెండుచోట్లగల పద్యము మూడవచోటగూడ నున్నచో అదొక నిండని యుంచబడినది.

# ఘటికాచల మాహాత్మ్యము

## తృతీయాశ్వాసము

క. *శ్రీమత్ప్రసన్న వేంకట
ధామ కృపాకవచవర్ధితా తామరస
స్తోమరసాస్పద[1]వచనా
†కామప్రద కల్పరూప ఖండోజీ భూపా! 1

క. అవధారు ధాతృనందను
డవిరళ మధురోక్తి ననియె నా భృగుమునితో
నవకుంద దంతకాంతులు
నవరన చెక్కిళ్ళ సాంద్ర చంద్రిక లీనన్. 2

క. సప్తర్షి వర్యులీక్రియ
సప్తతురంగమ సహస్ర సదృశ [2]మహోభ
వ్యాప్తుని నద్దేవునిఁగని
ప్రాప్తభయోత్కర్షమునను ప్రాంజలులగుచున్. 3

క. సర్వేశ్వర! సర్వాత్మక!
శర్వాది సుపర్వనయన సాధ్వసకరమై
పర్వెడు నీరూపముఁగన
నోర్వము శాంతస్వరూపమొందు మహాత్మా! 4

వ. అని విన్నపంబు సేయఁ దదనంతరసమయంబున. 5

సీ. కనకకుంభ ప్రభాకలిత తాంబరతలంబు
అసమాన రత్నమయాంచితంబు
బలభిన్మణి విచిత్ర వలభిప్రదేశంబు
కమనీయ చిత్రరేఖాయుతంబు

---

* పూర్వ ముద్రణమునం దీపద్యము లేదు. 1. వచన తా. † ఈ పాదము తాళపత్రమున లేదు. 2. మహేభ. తా.

ప్రాజ్య ముక్తాఫలోదంచద్వితానంబు
సురభిళాగురుధూప శోభితంబు
వివిధ నటీ[1]నాట్య విభ్రమాకాంతంబు
కిన్నర గంధర్వ గీతి యుతము

*    *    *    *
*    *    *    *

రత్నరాజిప్రదీప విరాజమాన
మైనయొక్క విమానంబు గానఁబడియె. 6

క. వారంతఁ ద ద్విమాన
ద్వారము సొత్తెంచి నిలువ దక్షిణదిశగా
[2]చేరి వెసం బ్రసవాయుధ
వైరి నిరీక్షించి ప్రమథవైభవమెసఁగన్ 7

సీ. కరముల శంఖచక్రములు దాల్చినవాని
మురువైన తెఱనోటి యొఱపువాని
లోవంక మూపుల శివిఁబొల్చినవాని
పద్మాసనంబునఁ బరఁగువాని
యోగపట్టికనొప్పు నూరుద్వయంబుపైఁ
దొరయనిల్పిన కేలుదోయివాని
మేరుకూటంబుపై మిహిర బింబము లీల
శిరముపై మకుటంబు చెలఁగువాని
బాలచంద్రుని పైనున్న బాలచంద్రు
బోలు నళికోర్ధ్వపుండ్రంబు పొలుపువాని
కనకన వెలుంగు నంగారక విధమునను
గాననయ్యెడి మిక్కిలికంటివాని, 8

వ. మఱియుఁగలుషలక్ష్యభేదంబు సేయ వినతంబులగు త్రిణతంబులకొమ
రున బొమదోయిదీపింపఁ గురులసిరులవరలు మోముదమ్మినిమ్మల
నిందిందిరమ్ములుగ్రమ్మికొన మంకెనకావి సుంకంబుగొనుతావి

1. నట. పూ. ము. 2. శిరదిశన్.

మోవి తీవి నలంతినవ్వు నివ్వటిల్ల భక్తజనవిషయకారుణ్యంబున నేత్రాంచలంబుల నారుణ్యంబు తారుణ్యంబు సంపాదింప కుండలద్వయమణిప్రభాపూరంబు గండమండలతాండవంబొనర్ప జగత్త్రితయైకాధిపత్యంబు దెలుపు రేఖాత్రయంబు కంఠంబునందనర కెందమ్మి చెంతనున్న తుమ్మెదకొదమ చందంబున కౌస్తుభోపకంఠంబున శ్రీవత్సాంకంబు శోభిల్ల పంచవర్ణంబులం బ్రపంచించుచు పంచతత్త్వతత్త్వాభిమానికయైన మాలికయొప్పార బాలప్రవాళలీలం దలపించుచు బాహుశాఖల నఖరశిఖర కాంతులు విరాజిల్ల హారమంజీరకంకణాంగదరోచులు దిక్కులం బిక్కటిల్ల కాదంబినీ సమావృత గగనంబువగిది నుదరబంధంబు సొంపార సంధ్యారాగసంవృత శిలోచ్చయంబునా కనకాంబరపరివేష్టిత కటిప్రదేశమ్ము భాసిల్ల మధుకైట [1]హననవధ్యశిలాకల్పంబులైన జానువులు ప్రకాశింప శంఖ చక్ర హల కులిశ జలజాతపత్ర పతాకాదిరేఖాంకితంబులగు పదంబులు విలసిల్ల చరణకాంతిసందోహ వాహినిం[2]దేలియాడు రాయంచగుంపుసొంపున నఖంబులు విరాజిల్ల నైంద్రజాలికుని పోలికమున్నుగైకొన్న యాకారంబు మాయించి సౌమ్యాకారంబు దాల్చివెల్చినవాని శ్రీనరసింహదేవునాలోకించి దండప్రణామంబులు సమర్పించి కృతాంజలులై యిట్లని వినుతి సేయందొడంగిరి. 9

క. జయజయ సితపద్మాక్షా!
జయజయ నిటలాక్ష! సర్వజగదభిరక్షా!
జయజయ దుర్జనశిక్షా!
జయజయ దితిసుతవిపక్ష! సదవన[3]దక్షా! 10

వ. దేవా! జగత్సృష్టిరక్షణసంహారంబులకుఁ గర్తవు జగదంతర్బహిర్వ్యాపకుండవు సకలాంతర్యామివి పృథివ్యాదితత్త్వస్వరూపకుండవు శబ్దాదిగుణాత్మకుండవు సచ్చిదానందస్వరూపకుండవు అణువునకణువు మహత్తునకు మహత్తువు నీవ భవత్కటాక్షంబునంగాదె మధ్యేసముద్రంబున భోగీంద్రతల్పంబున యోగనిద్రాముద్రితుండవగు నీనాభిపద్మంబున బొడమిన పద్మజునకు మానసపుత్రులై మరీచిప్రముఖులు సృష్టి పెక్కువిధంబుల గావించిరి నిమేషంబులుపదునెనిమిది కాష్ఠయగు

1. హననావంధ్య. పూ. ము. 2. జేరి, పూ. ము. 3. రక్షా. తా.

తనపేరు వెలయింపఁదలఁచి నాపే రెన్న
వినక పుట్టిన పిన్నతనయవర్యు
మామకభక్తిసమగ్రుని ప్రహ్లాదుఁ
దీవ్రనిస్పృహా ఘోరదృష్టిఁ జూచి
హరి వినుతించిన హరియింతునే నిన్ను
హరి వైరిసు మ్మోరి యసురులకును
నని యెఱుఁగఁజెప్పి తనమాట వినకయున్న
తనయు ఘనరోషకలుష చేతస్కుఁడగుచు
కనికరంబింతయునులేక కఠినవృత్తి
చంపఁ దలపోసి మదిలోన దెంపుఁ జేసి. 15

సీ. కత్తుల మొత్తించి గంధద్విపముల మొ
త్తమ్ముల కొమ్ములఁ గ్రుమ్మఁజేసి
ఫణులచేఁ గఱపించి పావకశిఖలలోఁ
బొరలఁ ద్రోయించి యంబుధుల ముంచి
కట్టించి కొట్టించి కాఁచిన కారులఁ
బట్టించి ధట్టించి గట్లచరుల
ద్రొబ్బించి నరకాగ్నిదూలించి దానవ
భటులచేనొంచి యిప్పాట్లఁ జఱచె
బాలుఁ డలయఁడు సొలయఁడు
*మదిని నాయందు భక్తియేమరడు విష్ణు
పక్షమును మానితినటంచుఁ బలుకనొల్లఁ
డేమిచెప్పుదు నబ్బాలు హృదయశుద్ధి. 16

గీ. అతనిఁగావ సభాస్తంభమందువెడలి
కడిఁదిఱక్కసు వెడఁద వక్షంబు వాడి
గోళ్ల విదలించి యవనిపైఁగూల్చి కరుణ
బాలు రక్షించితిని ముని ప్రవరులార! 17

---

1, వారుల. తా. * మదిని....పక్షమును- ఈ భాగము పూర్వ ముద్రణమున లేదు.

క. మెచ్చితి మిము మునులారా
నొచ్చితిరిన్నాళ్లు తడసి నొగలకుఁడిఁక మీ
కిచ్చెదఁగోరిన వరములు
నిచ్చలముగ మీతపంబు నేడు ఫలించెన్. 18

వ. అనిన నమందానంద కందళిత హృదయారవిందులై య మ్మహర్షు
లిట్లనిరి. 19

క. పురహర పురంద రాదిక
దురధిగమంబై భవాదిదూరమ్మగు నీ
యురుమూర్తిఁగనుట కంటెను
వర మెయ్యది వరముగలదు వర్ణింప నజా! 20

గీ. ఉర్వి నమృతఫలాఖ్య భక్తోచితాఖ్య
గలిగె నేకతమున నీకు కలుషదూర!
వినఁగఁ గోరెద మెఱింగింపవే యటన్న
ఋషుల కిట్లని పలికె సర్వేశ్వరుండు. 21

క. అమృతము మోక్షము తత్ఫల
మమరిచి యమృత ఫలనామ మందితి ధరణిన్
శమయుక్తభక్త కాంక్షిత
మమరిచి భక్తోచితాఖ్య నటు గైకొంటిన్. 22

క. ఈ పర్వతశిఖరమ్మున
దీపించుచునుండు రెండుతీర్థము [1]లవియున్
బ్రాపించు నేత దాఖ్యలె
తాపసవరులార! సార్థతానయ యుక్తిన్. 23

సీ. దివ్యమౌనీంద్రు తీర్థంబులోఁ గ్రుంకి
ధన్యులై కడు మహత్త్వంబుఁ గనిరి
ఎవ్వరు మద్భక్తు లిందు మజ్జనమాడ
నపవర్గ సంప్రాప్తి కర్హులగుదు

---

1 లవియున్. పూ. ము. తా.

రాదిమాశ్రమము నారాయణగిరి నాకు
నల రెండవది ఘటికాచలంబు
వృషభాద్రి మూడవ దీమూడు నెలవుల
నశ్రాంతమును నేను విశ్రమింతు
ననిన దద్దేవదేవు పాదాంబుజముల
కమ్మునీంద్రులు సాష్టాంగ మాచరించి
విన్నపముగలదొక్కటి వేద వేద్య
కృప దలిర్పంగ నది చిత్తగింపవలయు. 24

సీ. జలజాక్ష ! మూఁడుయోజనములదాక ని
గ్గిరిమీఁద ఝరులు దీర్ఘికలు నదము
లేరులు మడువులు భూరి మోక్షదములు
గావుత నేఁడాదిగాఁగ నిందు
వసియించు జనుల కాపద లెవ్వియును లేక
దయ శాంతి దాంతియు ధర్మబుద్ధి
కలుఁగంగవలయు మృగంబు లన్యోన్యంబు
మైత్రిచే నెప్పుడు మనఁగవలయు
శబర యవన పుళిం దాదిజనములెల్ల
జ్ఞాన వైరాగ్య ధర్మముల్ బూనవలయు
నెలనెలను మూఁడువానలు నిండఁగురియ
ధరణి సస్యసమృద్ధయై తనరవలయు.

సీ. ఆగమ యాగ యోగాన్నదానైక ప
రాయణులగుచు ధరామరులును
కరులతో హరులతో వర వీరభటులతో
జగతిఁ బాలించుచుఁ క్షత్రియులును
ధన ధాన్య పశు సుహృ ద్బంధు వర్గంబుతో
కోటికి [1]పడగెత్తి కోమటులును
ధరణిసురోత్తమచరణ సేవారతి
ప్రవరులై [2]మనుచుశూద్రప్రవరులు

1. పడగెత్తు. తా.   2, మనెడు. తా. మించి, పూ. ము.

వెలయుదురుగాత యని తను వేడికొనిన
మునులపైఁ నుడివోవని కనికరమున
నట్లెయొనరింతు నే నని యానతిచ్చె
ఛిన్నసుజనార్తి శ్రీ నరసింహమూర్తి 26

క. [1]హరుఁడు విరించియు నపుడ
గ్గిరిమాహాత్మ్యము నృసింహుకృప మునిభాగ్య
స్ఫురణము మెచ్చుచు తమ మం
దిరములకుం జనిరి మదిని నివ్వెఱ యొదవన్. 27

గీ. అంత [2]వైఖానసులు వసుధామరాగ్ర్య
లజుని పంపున సంతసం బావహిల్ల
వచ్చి హరినామసరసుల వారిఁ గ్రుంకి
ధౌత పటములు కటితటిఁ దాల్చి నిల్చి. 28

క. మల్లియలు కమలసుమనో
వల్లరులును గన్నెరులును వాసంతికముల్
హల్లక పాటలములు ను
త్ఫుల్లవకుళ చంపకములు పోరిపోరి గొనుచుఁ. 29

సీ. దేవతాగృహము సద్భావంబుతోఁ జొచ్చి
స్వస్తికా[3]సనములవరుసనిలిచి
[4]ధౌతులై దేహశోధన మాచరించి ప్రా
ణాయామ పరతమై యంతరంగ
మేకాగ్రముఁగఁజేసి యెలమితో సంకల్ప
కల్పిత వస్తునికాయమునను
మానసపూజ నేమంబున గావించి
యావాహ నాస నార్ఘ్యాది విధులు
గంధ సుమ ధూప దీపాదికముల
[5]మధుర నైవేద్యవీటీసమర్పణముల

1. హరియు. పూ. ము. తా. 2. వైఖానసులు.పూ.ము.తా. 3. సరములు తా. 4. ధాతు. తా. 5. మఱియుమధుర, పూ. ము.

నాటపాటల పూజనం బాచరించి
[1]రనిన నారదునకు భృగుఁడనియె నపుడు. 30

గీ. సకల జీవాంత రాత్మయా శౌరి కెట్లు
వసుధ నావాహనంబు నుద్వాసనంబు
గలుగు నదియెల్ల నానతీవలయు ననిన
నింపుసొంపార నారదుఁ డిట్టు లనియె. 31

మ విను దైత్యాంతకుఁ డంతరాత్మ యగుచున్ వేళొండుచోనున్వసిం
పును లోకంబులనిండియున్నశిఖి యేపోల్కిన్ శమీగర్భమం
దును గానంబడు నట్ల బింబగతుఁడై తోడ్తోడ నావాహనం
బును నుద్వాసన మమ్మహామహుఁడు సంపూర్ణస్థితిన్ గైకొనున్. 32

క. అనవుడు భృగుముని యిట్లని
యెను వైఖానసు లనంగ నెవ్వరు చెపుమా
వినవలతు ననిన నారద
ముని యిట్లను నాదరంబు ముప్పిరి గొనఁగన్. 33

క. ఇదిగోవ్యము *కలుషహారము
విదితంబుగ దీని తెఱఁగు వింటి తొలుత నీ
కది యిపుడు తెలియ వినిపిం
చెద నవధానముగ వినుము శిష్టజనాఢ్యా! 34

సీ. అనఘ! నిరుక్తవేదాంగోక్తమై ధర
పొగడొందు నీకథ పుణ్యయగుచు
నంబుధీశ్వరుని యాగంబున జలదద
యనెడు నచ్చరఁ జూడ నజుని కపుడు
వీర్యంబుజారఁ దద్వీర్యం[1]బతఁడు పర్ణ
పుటి నించి వహ్నిలోఁ బోయ నందు
నర్చియును భృగుండు నంగారపిండంబు
నం దంగిరుండును నత్రి మునియు

1. కనిన.తా. *ఈపాదార్థము తాళపత్రమున లేదు. 2. బితడు.పూ.ము.తా.

విఖన సాంగత్యమునఁ జేసి విఖనసుండు
బోడమి రాయన్వయంబునఁ బుట్టు గనిన
వేదశాస్త్రార్థనిరతులు విప్రవర్యు
లఖిల మంత్ర తంత్రార్థ రహస్య విదులు. 35

క. పంచవిధ బేరపూజా
చుంచువులై వారలెపుడు శుద్ధాత్మకులై
పంచాయుధ శోభితు నర
పంచాస్యునిఁ గొలుచుచుంద్రు భాగ్యము కలిమిన్. 36

క. [1]అన భృగుఁడు పంచ బేరా
ర్చన తెఱఁ గెఱింగింపు మనుచుఁ బ్రార్థించుడు న
య్యనిమిషసంయమి యాదర
మున నిట్లనిపలికె నధిక మోదం బెసఁగన్ 37

సీ. ఘన తేజ ధృవ కౌతుకస్నాపనోత్సవ
బల్యంబులివి బేరపంచకంబు
పరఁగు నాఅవయది [2]బాలాల[3]యావ్వాయం
బదియ సూ పాంచరాత్రాభిదంబు
వరుస శ్రీకృష్ణుండు పురుషుండు సత్యుండు
నచ్యుతుండును [4]బుద్ధుఁ డనఁగ నందు
నావాహ్య[5]లల్లధ్రువాదిగా నుత్తరో
త్తర [6]బేరములయందు వరుస సేయ
వలయు నావాహనం బని పలుక భృగుఁడు
నారదునకిట్టులనియెను గౌరవమున
నాద్యబేరంబు నావాహనాదికముల
నితర బేరంబుఁ జెందుట యెట్లు లనిన. 38

క. దీపంబువలన వేఱొక
దీపము గలుగంగ రెంటఁ దేజము లేదే

1. అని. పూ. ము, తా, 2. వాలాల. పూ. ము. తా. 3. వర్వతంబది సూ వె. పూ. ము. 4. బుద్ధు....లవ్వి. 5. లబ్లి.తా 6. భేదము, పూ. ము. ఈ భాగము పూర్వముద్రణమున పూర్తిగాలేదు.

శ్రీపతి యభిముఖ భావమె
యేపున నాహానాఖ్యనెసఁగు ధరిత్రిన్. 39

క. అనవుడు భృగుఁ డిట్లను వి
ష్ణుని బూజ యొనర్చు ధరణిసురులకు ప్రాపిం
చును [1]మఱి దేవత్వం బని
జనులాడుదు రవ్విధంబు చయ్యనఁ జెపుమా ! 40

క. అనవుడు నారదుఁ డిట్లను
ఘనులగువీరల కొసంగె కమలోద్భవుఁడీ
యనుపమ పూజావర్తన
మును మును గావునను నదియుఁ [2]బొందదు వారిన్. 41

గీ. కూలిగొని చేయువారి కా కొదవ గలదు
నొందుచో ఖండితారివేదండుఁ డైన
శ్రీనృసింహుని[3]తో నది చెల్ల దెపుడు
మౌనినాయక యిది సత్యమైన పలుకు. 42

సీ. ఒకనాడు సంశయయుక్త చిత్తు లగుచు
సకల వైఖానసుల్ సాధుచిత్తుఁ
డవ్వసిష్ఠుఁడు విన నసఘ మే మిచ్చట
నివ్వటిల్లినవేడ్క నిలచుటెట్టు
లనిన నమ్ముని వారికనియె నో ఘనులార
యి మ్మహాహరియుండు నెడలు తలచు
రాణించు బదరికాశ్రమము సాలగ్రామ
ధరణీధర మయోధ్య ద్వారకయును
కాశి మధురయు నైమిశకాననం బ
వంతినారాయణాఖ్యాపర్వతము నీల
గిరి కురుక్షేత్రమును గాంచిపురము వెలయు
హరివసతులందు సుప్రసిద్ధంబు లగుచు. 43

1. దేవతల కత్వం. తా. 2.బొందుదు. తా. పూ. ము. 3. చో.తా.పూ.ము.

గీ. వేగవతి యుత్తరపుదరి వెలయు హస్తి
గిరి నజుని యజ్ఞవేదికా పరిసరమునఁ
దనరు పుణ్యకోటివిమానమున వసించు
వరదుఁ డార్త్మీయభక్తుల వరము లొసగు. 44

క. ఇచ్చోటుల వసియింతురు
సచ్చరితులుబుధులు సత్యసంధులు పెక్కం
డ్రెచ్చో నేమూర్తి భయం
బచ్చో నామూర్తిఁ గొలుతు రనుపమ భక్తిన్. 45

వ. విశేషించి యీ ఘటికాచలంబు సకలజనప్రశంసనీయం బని వసిష్ఠుండు బల్కుటయు నమ్మును లమ్మునీంద్రచంద్రుంబూజించి స్వామీ యిందు విషమప్రదేశంబున మేముండుట యెట్లుసిద్ధించు నుపాయం బుగలదేని యాన తిమ్మనినుటయు వసిష్ఠుండు వారల కిట్లనియె. 46

గీ. ఇమ్మహీధ్రమ్మునకు చుట్టు నెవ్వరేని
సమతలంబుగఁ జేయంగఁ జాలిరేని
యిందుమీరు సుఖంబున నుందు రనిన
వారు శ్రీనరసింహునిఁ జేరి మ్రొక్కి. 47

సీ. శిరములు కన్నులు [1]చెవులు కాళ్లు
చేతు లసంఖ్యముల్ జెంది త్రిభువ
నేశుఁడవై బ్రహ్మవై శక్ర రూపివై
యఖిల దేవాకృతి నలరి తీవ
రూపదీపితుఁడ వరూపుఁడ వఖిలస్వ
రూపుఁడ వీవ సంప్రాపకుఁడవు
అసమాక్ష [2]ముఖ్యులు నీయాజ్ఞ దాటంగలే
రితరు లెఱుంగుట కెంతవారు
పాకశాసనముఖ్య దిక్పాలవరులు
శాశ్వతైశ్వర్యులైరి నీ సాంద్రకృపను

1. చెవులు(చెక్కులు). 2. ముఖులు. పూ. ము. తా.

సర్వ భూతాత్మకుండవు సర్వ శుచివి 48
నీ ప్రభావంబు దెలియంగ నేర్తు మెట్లు ?

సీ. నీవాఁడుగావున నిధినాథుఁడయ్యెను
దేవ ! కుబేరుండు దివిజవరుఁడు
నినుఁగొల్చి దుర్వాసముని శాపజలధిలో
మునిగిన శ్రీ గాంచె మున్నువోలె
కడఁకతో తండ్రి యంకంబెఱుంగనివాని
[1]గాఁచితి నీ యంకగానిఁగాఁగ
జనకుని కృతవీర్యసంభవు నంబరీ
షునిఁ గాచితివిమున్ను జనులు వొగడ
ఘన కృపావిభవమ్మునఁ గావు మమ్ము
నని మునీంద్రులు గొనియాడఁగా నృసింహుఁ
డంబు దారావగఁ ఖీర మయిన ఫణితి
హితము దళుకొత్త వారల కిట్టులనియె. 49

క. మెచ్చితిమునులారా మీ
యిచ్చకు వచ్చిన వరమ్ము లెయ్యవి చెపుడా
యిచ్చెద నన వారును మది
నిచ్చలముగ భక్తియుక్తి నియతి దలిర్పన్. 50

క. దేవా యిగ్గిరి చుట్టును
నేవేళన్ నీదు సేవ యే మొనరింపన్
దావొసఁగు మనుచు వేడిన
నా విభుఁడపు డాంజనేయు నాత్మఁదలంపన్ 51

వ. అంత. 52

మ. కనకోర్వీధర సన్నిభంబగు మహాకాయంబుతో విస్ఫుర
ద్ఘన కాంతిస్ఫుట కుండలద్వయముతోఁ గౌశేయవస్త్రంబుతోఁ
గన దుత్కంపిత వాలవేష్టనముతోఁ గద్రమాంజలిస్ఫూర్తితో
హనుమంతుం డపుడేగుదెంచి నిలిచెన్ హర్మ్యాగ్రభాగంబునన్. 53

1. గాంచితి నీయంతవానిగాగ. పూ. ము.

గీ. నిలిచి సాగిలి మ్రొక్కి యో నీరజాక్ష!
నీకు నచ్చిన తొలిబంట నేన యిపుడు
నన్ను రమ్మన్నపనియేమి నాకుఁ దెలియ
నానతీయఁగఁ దగు నన్న నభవు డనియె. 54

క. ఈ మునులు నిలిచియుండఁగ
నీ మహీధరముననుఁ బార్వతీశ్వరుని దెస
భూమి సమతలము సేయుము
గ్రామము నీపేరనొకటి గావింపు[1]మిటన్. 55

క. అన నట్లజేసి యచ్చట
హనుమంతుఁడు తనదు పేర హనుమగ్రామం
బను నొక గ్రామంబొనరిచి
తన నెలవున కఱిగె నంతఁ దద్విజవరులున్. 56

క. అనుమోదమునను నరహరి
యనుమతిఁ దమయిండ్ల నుండి హరిగృహమునకున్
జను దెంచుచుఁ దత్పూజన
మొనరింపుచు నివ్విధమున నుండుచు నంతన్. 57

సీ. అంబుజాక్షునకుఁ గల్యాణమహోత్సవ
మాచరింపఁగ మదియందుఁ దలచి
పువ్వుల చప్పరమ్ములు మేలు కురువేరు
తావుల పందిళ్లు దళ్లు పెక్కు
పట్టులు మేల్కట్టు బహుదివ్యమణిపంక్తి
తోడ నమర్చిన తోరణములు
నగరు ధూపంబులు నంగడి వీధులు
బుగబుగలీను కప్పురపు మ్రుగ్గు
యాగశాలలు కనకకల్యాణవేది
భర్మహర్మ్యంబు[1]లును వీడుపట్లొనర్చి
చాటఁబనిచిరి సకల దిక్చక్రమునను
సరసిజాక్షుని పరిణయోత్సవదినంబు. 58

1. మికన్. తా. పూ. ము. 2. లను. పూ. ము. తా.

సీ. భూషణ [1]ప్రవిలిప్త భూరిమణిప్రభా
కోటి దిక్కోటుల గుమురుగట్ట
ముత్యాలగొడుగుల మొలుచుడాల్ వెన్నెల
మొత్త మాకస మెల్ల ముంచికొనఁగ
చామరంబులువీఁచు చామ కరంబున
హేమకంకణరవం బింపుఁగులుక
పటహా భేరీ శంఖ పణవ మర్దళ ముఖ్య
వాద్యధ్వనుల్ దిశావలయమ్ముదువ
నందలంబులు పల్లకీ లశ్వములును
సామజంబులు నెక్కి యుత్సాహ మొదవ
నవని నాయకు లేతెంచి రచ్చటికిని
సరసిజాక్షుని పరిణయోత్సవముఁ జూడ. 59

సీ. వ్యాసాది సంయమివర్గంబుతోఁగూడ
వాధూల సంయమీశ్వరుఁడు వచ్చె
వీణలు ధరియించి గాణ లేతెంచిరి
దేవలోకమున వర్తించువారు
నిటలోర్ధ్వపుండ్రంబు నీర్కావులు ధరించి
యరుదెంచి రఖిలాగ్రహార జనులు
[2]గొన్నన గొల్లెన కొల్లారు బండ్లును
తేనె నేయును నూనె తిలలు పెసలు
గుడము జీరకము హారిద్ర గోధుమలును
వరుగు వడియంబు లల్లంబు వరుసఁ గొనుచు
వణిజులును జేరివారును గణన మీఱి
వచ్చి రద్దేవదేవు నుద్వాహమునకు. 60

క. అంతట వైఖానసు ల
త్యంత సదాచారు నొకని నన్వయ[3]వృద్ధున్
శాంతుని నాచార్యునిఁ గా
వింతమని యొనర్చి రట్ల వేదోక్తవిధిన్. 61

1. ప్రత్యుప్త. తా. 2. గొనలు. తా. 3. వృద్ధున్. తా.

ఆ. వె. [1]హోమపూర్వకముగ నుత్తుంగ గరుడకే
తనపటంబు నెత్తి తాళమాన
విధము తప్పకుండ వివిధ వాద్యంబులు
మొరయఁజేయు తదవసరము నందు. 62

క. పరివార సహితముగ పుర
హరుఁడును కమలోద్భవుండు దిశాధిపతులు స
త్వరమున సహవాహనులై
స్థిరకుం జనుదెంచి రానృసింహుఁ గనంగన్. 63

సీ. కనకకుంభము లెత్తి కరిరాజ యుగ్మంబు
నినుచు తీర్థము లాడు నీలవేణి
వెన్నెల నొరవెట్టు వెలిపట్టు వస్త్రంబు
జోకగాఁ గట్టెడు లోకజనని
అలినీలములనొప్పు నబ్జాననమ్మున
కొలువుండు గురుకుచకుంభయుగళ
నెత్తమ్మి రేకుల నిరసించగాఁ జాలు
సొగకన్నులుగల శోభనాంగి
ఇందిరాదేవి యా జగదీశు నెదుట
నిలిచి మంగళాష్టకముల[2]యులివు నెలఁగ
చిత్రకరమైన తెర[3]యెత్త చేతులెత్తి
హరికి తలఁబ్రాలు [4]వోసె నయ్యవసరమున. 64

సీ. కౌతుకబంధముల్ ఘటియించి నెటిమించి
భూరి వాద్యంబులు భోరుగలుగ
మొనసి ముక్తాఛత్రములు మిన్నుముట్టంగ
భాగవతుల యాట పాట లమర
నాగమస్తుతులు గాయక గానములు నొప్ప
నంబుజాననల నాట్యములు ధనర

---

1. హేమ. తా. 2. యలవు. తా. నెలవుసేయ. పూ. ము.3. యెత్తి. తా. 4. నించె. తా. ము. తా.

దేదీప్యమానమై దీప[1]ప్రతానంబు
రోదసీకుహరంబు రుచులనింప
రత్నయానంబు లందుంచి రాజసమున
మించి తిరువీధు లేగించి రంచితముగ
దిరుగ నగరు ప్రవేశించి దేవదేవు
మంచి నైవేద్యముల దనియించి రెలమి. 65

క. ఈగతి తొమ్మిది దినములు
నాగమవిధి సమ్మతముగ నఖిలోత్సవముల్
రాగిల్లఁ దీర్థవారియు
బాగుగఁ దిరుకోటిడించి ప్రమద మెలర్పన్. 66

క. ఈవిధమున వైఖానసు
లేవేళ మహోత్సవంబు లెసఁగింపఁగ స
ద్భావమున జనులఁ బ్రోచుచు
నా విభుఁడు సుఖాబ్ధి నోలలాడుచు నుండున్. 67

సీ. అపవర్గకాముల కపవర్గ ఫలదంబు
ధనకాములకు మహాధన కరంబు
పుత్రార్థులకు బహుపుత్ర దాయకము నా
యుష్కాములకు మహాయు ష్కరంబు
పాతక హరమును బహు రసాలంకార
భావ నానార్థ విభాసురంబు
నఖిల పురాణేతిహాస విఖ్యాతంబు
పాఠక శ్రావక భాగ్యఫలము
నిఖిల కవి బుధ సంస్తవనీయ మయిన
యీ చరిత్రంబు నిరతంబు నెసఁగు చుండు
తారకాచంద్రభాస్కరధరణిశైల
శరధు లెందాక నందాక జగతియందు 68

1. ప్రతానంబు పూ. ము.

గీ. అనుచుఁ బల్కిన నారదమునివరేణ్యు
తోడ [1]భృగుముని మదిలోన వేడు కలర
ననఘ నీవల్ల సుకృతినైతి ననుచు
నతులు గావించి [2]మించి సమ్మతిని నుండె 69

## ఆశ్వాసాంతము

శా. దివ్యాహార పయస్సితామధుర మాధ్వీక ప్రవాహోపమా
నవ్యాహార విలాస హావ విలసన్నారీ నవాంభోజినీ
నవ్యాహారమణాపణాయిత బుధా నందానుసంధాన స
ద్రవ్యాహార కుముద్వతీరమణ రారాజద్యశోమండలా.

క. లోచన కమలా విలసన
యాచనక స్థూలలక్ష యావత హృదయా
సేచనక నిశాజోపై
[3]రోచన కౌశిక పతద్విరోధి వరేణ్యా!

మాలిని. సరసగుణసమాజా! సన్మృగేంద్రస్ఫుటౌజా!
పరభటకృతపూజా! బంధుగీర్వాణభూజా!
తరుణతరుణితేజా! ధారుణీరాజరాజా
శరణసుకవిభోజా! భాగమాంబాతనూజా!

ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధికకృపాపరిపాక పరిచిత సరస
కవితాసనాథ తెనాలిరామకృష్ణకవినాథ ప్రణీతంబైన
ఘటికాచలమాహాత్మ్యం బను మహాప్రబంధంబు
నందు సర్వంబును తృతీయాశ్వాసము.

1. నిట్లను.పూ.ము.తా. 2. యతఁడు. పూ. ము. తా. 3. రోచనక కౌశిక ద్విరాధీవరేణ్యా. తా. 4. మహాత్వం. తా.